# పీఠిక.

ఈ గ్రంథకర్త దక్షిణాఫ్రికా చరిత్ర, అధినివేశ స్వరాజ్యము నాదిగా గల గ్రంథములను రాజకీయార్థిక విషయములను గూర్చిన వ్యాసములను వ్రాసి ఆంధ్రలోకమునకు చిరపరిచితుడుగనే యున్నందున, ఈయనను గూర్చి కాని ఈయన రచనా కౌశలమును గూర్చి కాని ఇచ్చట వ్రాయదలంపలేదు.

"సహకార వస్తునిలయోద్యమము" మని ఈ గ్రంథమునకు పేరిడినను ఇది సహకారోద్యమముయొక్క స్వరూప స్వభావములనెల్ల పరిపూర్ణముగా జర్చించు ఉత్తమగ్రంథముగా నున్నది. సహకార మనగా నేమో, అది ప్రజల యార్థిక సాంఘిక నైతికాభివృద్ధికిని జాతీయ వికాసమునకును మానవ కల్యాణమునకును గూడ ఎట్లు తోడ్పడగలదో, ప్రపంచమునందలి వివిధ దేశములం దిది యే యే రూపములు దాల్చి ప్రజాసేవ చేయుచున్నదో, మన దేశముయొక్క రాజకీయార్థిక పరిస్థితులను బట్టి మనకుగూడ ఇది యెట్లుపకరింపగలదో, ఈ గ్రంథమునందు చక్కగా వివరింపబడినది. అనేక ఆంగ్లగ్రంథములను పరిశీలించి విషయముల నెల్ల సమగ్రముగా సమకూర్చి సులభశైలిలో ప్రజలకందరికిని తెలియునట్లుగా వ్రాయబడినగ్రంథ మింతవరకు నిదితప్ప ఆంధ్రమున నింకొకటి కానరాదు.

దీని నెల్లరును బఠించి పాశ్చాత్య దేశసహకార సంఘములు నిర్వహించుచున్న ట్లిందు సూచింపబడిన ప్రజాహితైక కార్యములలో కొన్నిటినైనను తమ తమ గ్రామములందలి సహకారసంఘముల ద్వారా చేయించుకొనినచో తమకు తమగ్రామవాసులకు మాత్రమే గాక ప్రజలకు దేశమునకు గూడ సేవచేసినవా రగుదురని సహకారోద్యమమునందు మాకు గల అనుభవమునుబట్టి నిస్సంశయముగ చెప్పగలము.

బెజవాడ,
21—9—33.

ఘంటసాల సీతారామశర్మ,
వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి.

# సహకారవస్తునిలయోద్యమము.

## విషయానుక్రమణిక.

### ప్రథమభాగము:



### ద్వితీయభాగము:



### తృతీయభాగము:

అ ను బం ధ ము .



ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమమునకును తద్ద్వారా వయోజనవిద్యకును మూలపురుషులు, రామమోహన ధర్మగ్రంథాలయస్థాపకులు, ప్రజాసేవాతత్పరులు, సహకారోద్యమాభిమానులు, నిగర్వచూడామణులు, ఈ గ్రంథరచనకు కారణభూతులు, మదీయ మిత్రులు,

కీర్తిశేషులు:

సూరి వేంకట నరసింహశాస్త్రిగారికి.



# సహకార వస్తునిలయోద్యమము

## ఉపోద్ఘాతము.

ఒకవంక సకలసౌఖ్యములతో తులతూగు ధనికులు, ఇంకొకవంక గర్భదారిద్ర్యమున కూటికి గుడ్డకు గరవై దిక్కులేకున్న దరిద్రులు, ఒక వంక దివ్యసౌధములు, వేరొక వంక అపరిశుద్ధములు అనారోగ్యములునగు గుడిసెలు - ఈ తారతమ్యము, సాంఘికవైపరీత్యము ప్రపంచములోని అన్ని నాగరిక దేశములను కలచినవి. ప్రజల ఆర్థిక సాంఘికపరిస్థితులను సమీకృతత్వము చేయవలెనని, జనసామాన్యమునకు జీవనాధారము సామాన్యసౌఖ్యము, వార్ధక్యమున అశక్తతయందు, నిరుద్యోగమునందు, రక్షణము కలిగింపవలెనని ప్రపంచములోని సంఘసంస్కర్తలెల్లరు ప్రయత్నించి చూచిరి. ప్రజాపరిపాలనము - ప్రజాభిప్రాయమునకు బాధ్యతయు, స్వాతంత్ర్యమును గల దేశములందలి ప్రభుత్వము లీ లాభములను ప్రజలకు కలిగించుటకు పూనుకొనినవి. నేడు కడుపార తిండి, వొడలినిండుగ కప్పుకొనుటకు గుడ్డ లేకుండ తమ పౌరులు మరణించుట కే ప్రభుత్వము సంగీకరించుటలేదు సరికదా, జనసామాన్యమునకు నిర్బంధోచితవిద్యయొసగుట, వైద్యసహాయము చేయుట, జీవనభృతి నొసగుట, వృద్ధులకు నుపకారవేతనము లొసగుట అశక్తులకు బాలెంతలకు వేతనము లిచ్చుట, విద్యార్థులకు పాఠశాలవేళలలో

తిండిపెట్టుట సర్వసామాన్య పాలకధర్మములుగా పరిణమించినవి. ఇట్టివి మచ్చునకైన కని విని యెఱుగని మనవారికిని వింతగనే తోచవచ్చును; కాని జీవనవిధానమున పాశ్చాత్య దేశములకును మనకును హస్తిమశకాంతరము కలదు. ఇక ప్రభుత్వములు చేయు సాహాయ్యమేగాక పాశ్చాత్యప్రజలు చేసికొను స్వయంసాహాయ్యముకూడ అమితముగా కలదు. రాజకీయ సాంఘిక ఆర్థికవిషయములందు తమజీవనవిధానమును చక్కబరచుకొనుటకు స్వయంకృషి, స్వయంసాహాయ్యము, సాముదాయిక పురుషప్రయత్నము, పాశ్చాత్యదేశములందు వివిధరూపములు దాల్చి బలవంతులు, ధనవంతులు నగు వారినుండి బలహీనులు, ధనహీనులు నగువారిని కాపాడినవి. అట్టిపురుషప్రయత్నములలో వృత్తికట్టడిసంఘములు, వ్యాపారకట్టడి సంఘములు, సహకారోద్యమము, ప్రధానములుగా నున్నవి. వృత్తికట్టడిసంఘములు షావుకారులతో పోరాడియు, సమ్మెలు చేసియు, ఆందోళనము చేసియు, కార్మికులవేతనములు హెచ్చించినవి. పనిచేయుకాలపరిమితి తగ్గించినవి. సహకారము కార్మికులకు ఒక సంఘశక్తిని ప్రసాదించుటయేకాక షావుకారులు తమ ధనముచేతనే యేలాభములు కార్మికులకు లేకుండచేయుచున్నారో ఆయాలాభములెల్ల కార్మికులకు కలిగించుటకు తోడ్పడినది. కార్మికుల చేతులకు కాళ్ళకు మానసములకు పెట్టబడిదారులు తగిలించిన దాస్యశృంఖలములు ఛేదించి వీరిని స్వతంత్రులుగను శ

వంతులుగను చేసినది. విజ్ఞానము ఆరోగ్యము సౌఖ్యమును వీరికి కలిగించినది.

ఆంగ్లదేశమున సహకారము మొదట వస్తునిలయముల రూపముదాల్చి వానిద్వారా జనసామాన్యమునకు చౌకగా సరకు లందిచ్చుకొనుటకు వస్తు ఉత్పత్తికిని వస్తువులవినియోగము అనగా క్రయవిక్రయములకును తోడ్పడి, ఒక విధమగు ఆర్థికోద్యమముగను దాని లాభములతో సాంఘిక శ్రేయము ఆరోగ్యము విద్యల నభివృద్ధిపరచుచు నొక విధమగు ప్రజాహితైకసాంఘికోద్యమముగను పరిణమించినది. ఇతర దేశములందు వివిధరూపముల వర్ధిల్లిన సమస్త సహకారప్రయత్నములు గూడ ఆంగ్లదేశమున వస్తునిలయ శాఖలుగా వర్ధిల్లినవి. ఇట్లు కల్పవృక్షమువలె పెరిగిన సహకారోద్యమబీజములను నాటినమహాపురుషులు ఆంగ్లదేశములో మారుమూలగ్రామమగు రాక్డేలులో సాహుకారుల చేతిక్రింద అణగిమణగియుండి తగినకూలి లేక ఆధారము లేక దారిద్ర్యమున మునిగియున్న నేతగాండ్రు. వీరు **1844** లో నొకచిన్న వస్తునిలయమును స్థాపించి ధనవంతులసాహాయ్యము గాని అధికారులయండదండలుగాని ప్రభుత్వముయొక్క చేయూత గాని లేకయే స్వయంకృషిచేత ఆత్మవిశ్వాసముచేత పాటుపడి తుదకు దారిద్ర్యవిమోచనము గావించుకొని తామే పెట్టుబడీదారులై యజమానులై బాగుపడి సహకారప్రజాప్రభుత్వమునకు మార్గదర్శకులైరి. ఈ చరిత్రను మొదట 'జార్జి జాకొబ్ హోలీ ఓకు'గారు ఆంగ్లభాషలో వ్రాసిరి. ఇది చాలభాషలలోని కనువ

దింపబడి ఉద్యమాభివృద్ధికి తోడ్పడినది. ఐరోపాలోఁగూడ వస్తునిలయము లభివృద్ధిఁజెంది ప్రజల కెన్నో విధములుగ తోడ్పడుచున్నవి. పాశ్చాత్యసహకారోద్యమచరిత్రవలన భారతదేశము నేర్చుకొనవలసినసంగతులు చాల గలవు. భారతదేశమునందు సహకారోద్యమము స్థాపింపబడి ముప్పదేండ్లైనది గాని అప్పటినుండి పరపతిసంఘములే చాల బయలుదేరినవిగాని తక్కినవిధములైనసంఘములు స్థిరపడలేదు. కొందరిది సాకుగా జూపి భారతీయులకు వ్యవహారజ్ఞానము నీతిధర్మములు స్వపరిపాలనాశక్తియు లేవనిపలుకుచుందురు. పాశ్చాత్యజనులచరిత్ర చదివినచో నిది సరికాదని తెలియగలదు. దేశకాలపరిస్థితులు రాజకీయసాంఘికపరిస్థితులు ఇంక ననేక కారణములు ప్రజలయుద్యమములకు వివిధస్వభావములను పరిణామములను గలిగించుచుండును. ఏవ్యవహారమందైనను మొదట చిక్కులు కష్టములు ఆపదలు కలిగి వానినిగడచి శ్రమపడిపడి మునిగి తేలినపిదపగాని అనుభవము, నేర్పు, పరిపూర్ణశక్తి, వికాసము, విజయమును చేకూరవు. ప్రజలు వానినిగడచుటలో తోడ్పడుట, ఆయా ప్రభుత్వములయొక్క కర్తవ్యము. అదిచేయని ప్రభుత్వము ప్రభుత్వముకాదు. గ్రామములందలి కక్షలను, దురాత్ములను, మోసగాండ్రను, జూపి జనహితైకోద్యమమునకు కలుగు అడ్డంకులుజూపి జాతికంతకును కళంకమాపాదింప దలచుట హేత్వాభాసము. సంసారమునందువలెనే సాంఘికజీవనమునందును సహకారమునందువలెనే స్వపరిపాలనమునందును, కష్టసుఖములు కలిగి కడతేరినగాని పరిపూర్ణశక్తి కలుగదు.

ఆత్మవిశ్వాసము, స్వయంకృషి, స్వయంసాహాయ్యము వలననే భారతదేశమునకు ఆర్థికసాంఘికరాజకీయాభివృద్ధిని గాంచవలెనన్నచో పాశ్చాత్యదేశములయందీ సాముదాయిక పురుషకారమెట్లుత్పన్నమైనదో అది ప్రారంభించినవారెన్ని చిక్కులుపడిరో వారికెన్ని అటంకములు కలిగెనో ఎన్ని బాధలు పడి తుదకు వారు సఫలీకృతమనోరథులైరో తెలిసికొనుట యావశ్యకము. ఆచరిత్రను చదివిననే మన కాత్మవిశ్వాసము, ధైర్యము పూనికయు కలుగును.

భారతదేశసహకారోద్యమమునందు అప్పులిచ్చు పరపతిసంఘములకు సంబంధించిన సహకారమే బాగుగా నాటుకొనినదిగాని వాణిజ్యవ్యవసాయములకు, క్రయవిక్రయములకు సంబంధించిన పరపతీతరవస్తువినియోగసహకారమంతగా అభివృద్ధి గాంచలేదు. అందువలన మనసహకారులదృష్టి సమస్యపైనునకు మరల్పవలెనన్నచో నీయుద్యమచారిత్రము జాగ్రత్తగ చదువుట యావశ్యకము.

# సహకార వస్తునిలయోద్యమము.

## ప్రథమ భాగము.

### ౧

### సహకారమనగా నేమి?

ధనిష్ఠబద్ధము లగుసాధనములులేని తమ ఆర్థికస్థితిని జీవనమును చక్కజేసికొనుటకు కొందరు లోకసంఘముగా జేరి తమలో నొక్కొకవ్యక్తియు తక్కినవా రందరికొఱకును అందరు నుగలిసి ఒక్కొకవ్యక్తికొఱకును పాటుపడుచుండు సాముదాయిక స్వాయంసాహాయ్య స్వాయంకృషిపద్ధతికే సహకారమని పేరు. సంఘములోనివ్యక్తులు ధనహీనులు బలహీనులు నైనను సంఘీభావమువలనధనము, బలము, గలియవేసికొని ధనవంతము బలవంతము నైన సంఘశక్తి నియలుదేయుట సహకారోద్యమమున గానవచ్చుచున్నది. సహకారమనగా నేమో నిర్వచింప బూనుట తెలివితక్కువపని. ఏలయన సహకారమొక సిద్ధాంతముయొక్క ఆచారవిధాన మేగాని, కేవల మొక అర్థవాదప్రతిపాదనము, సిద్ధాంతబోధనమును కాదు. జీవితపద్ధతిలో, పొదుపు, సహకారవిధానమునం దనుభవము, సహకారులలోని విద్యాభివృద్ధియు సహకారవ్యవహారాచరణమును జయప్రదముగ జేయును.

'సర్ హోరేస్ ప్లంకెట్' అను ఐరిషు సహకారోద్యమనాయకుడు సహకార మనగా 'శ్రేష్ఠతరకృషి, శ్రేష్ఠతరవ్యాపారము, శ్రేష్ఠతరజీవనము' అని నిర్వచించెను.

'సహకారము ఏమనుష్యుని సంపద నాశింపదు. ఎవరిని కొల్లగొనదలపదు. సంఘమునందు సంచలనము కలిగింపదు. రాజ్యతంత్రజ్ఞులకు కష్టము కలిగింపదు. రహస్యసంఘములు స్థాపింపదు. ద్వేష్యము పురికొల్పదు. శాంతిభంగము కలిగింపదు. ఒకరి ఆధిక్యానికిని పట్ల అసహనము జూపదు. దానికి ఒకరి దానధర్మము లక్ష్యము లేదు. ఒకరి దయాధర్మము లక్ష్యము లేదు. సోమరులకు దానికి పొందులేదు. పాటుపడువారి కన్నదు నాశాభంగము కలిగింపదు. పెట్టుబడిదారులు పనివారికి కూలి నిచ్చి పనిచేయింతురు: శ్రమకు బేరుధర నిచ్చెదరు; లాభమంతయు తామే హరించెదరు. కాని సహకారవ్యవస్థ పెట్టుబడికే కూలినిచ్చి తెచ్చుకొని దానికి బజారుధర నిచ్చి ఆలాభము నంతయు తాను సంపాదించును. మూలధనమునకు మనుష్యులు దాసులగుటకన్న మనుష్యులకు మూలధనము దాస్యము చేయుటయే ధర్మము న్యాయముకాదా ?

ప్రస్తుతము జనుల కుండు సౌఖ్యము అభివృద్ధిచేయుట మాత్రమె కాదు. జీవనాధారమే లేని మనుష్యులకు జీవనాధారమును గూడ కల్పించుటయే సహకారోద్యమముయొక్క పరమోద్దేశము. తమ భావిజీవితమున తమ కుటుంబములకు జీవనోపాధిని కల్పించుకొననివారు చెడ్డరోజు వచ్చినప్పుడు

వారిని కాపాడు భారము ఒరులపైన బడవేసినవారగుదురు. అందువలన వారు గౌరవపాత్రులు కాజాలరు.

సహకారులు తమ వ్యవహారప్రయోగములవలన ధనము నార్జించినారు. ఆ ధనసంపాదనము గౌరవమే గాక ఆ పిదప విలువగల విద్యాసంపాదనమును శ్రద్ధతో సాధించిన సామాన్య కార్మికులలో ప్రథముడై గౌరవము నార్జించినారు' అని సుప్రసిద్ధసహకారశాస్త్రజ్ఞుడు చరిత్రకారుడు నగు జార్జి జాకబ్ హాలియోకు గారు వ్రాసినారు.

సహకారసంఘమును లిమిటెడుకంపెనీవలెనే వ్యాపారము చేయునుగాని దానివలె నిది లాభములపంపిణీకొరకేర్పడినవర్తకసంఘము కాదు. కంపెనీలాభము దానికిపెట్టుబడి పెట్టిన వాటాదారుల వాటాలప్రకారము వారికే పంచిపెట్టబడును. సహకారసంఘములోనిలాభము దానిలోపనిచేసినవారికిని దానితో వ్యాపారముచేసినవారికిని, వారివారి వ్యాపారములనుబట్టి పంచబడును. దీనిలాభవిభాగములు భాగస్థుల లాభముకొరకు దాచబడి వృద్ధియగును. కంపెనీయొక్క జయాపజయములు ఇతర వ్యాపారసంఘములతో చేయుపోటీపైన ఆధారపడును. సహకారసంఘము ఎవరితోను పోటీచేయదు. దానిసభ్యుల క్షేమలాభములే దాని ప్రధానకర్తవ్యకరణములు. కంపెనీపరిపాలనలోని పలుకుబడిదాని వాటాదారుల వాటాలసంఖ్యనుబట్టి యేర్పడును. సహకారసంఘములో ఎన్ని వాటా లున్నను ఒకవ్యక్తికి నొకవోటుమాత్రమే యుండును.

కంపెనీలో వాటాలసంఖ్య నిర్ణీతమైయుండును. సహకారసంఘములో ఎన్ని వాటాలైన కొనుటకుదొరకును. తక్కిన వ్రజోపయోగసంఘములవలెనే సహకారసంఘముకూడ తనసభ్యుల విజ్ఞానము ఆరోగ్యము, మున్నగు లాభములకొరకు తోడ్పడినను, ఇది కేవలము దానికొర కేర్పడినదికాదు. ఇది కేవలము దానధర్మములకొరకు రాజకీయములకొరకు నేర్పడినదియు కాదు. ఇది ఆర్థికవ్యవహారముసంఘసేవయుకలిగిన ఒకఉత్కృష్ట ప్రజహితైకవిధానము, స్వయంకృషి, స్వయంసాహాయ్యము సంఘీభావము కల సంభూయసముత్థానమని ప్రాచీనార్యులు నిర్వచించిన సాముదాయిక పురుషకారము.

## ౨

## పాశ్చాత్యదేశముల సహకారోద్యమము.

పాశ్చాత్యదేశములందును మనదేశమునందువలెనే మొదట వ్యవసాయము చేతిపనులు గ్రామములందలి జనసామాన్యముయొక్క జీవనాధారములుగ నుండెను. ఆవిరియంత్రములు వచ్చినతరువాత యంత్రాగారముల పరిశ్రమయు పట్టణములు నధికములై ధనవంతులు మరియు ధనికులగుటయు బీదవారు మరింత దరిద్రులగుటయు తటస్థించినది. కొందరత్యధికభోగముల ననుభవించుచుండగా చాలమందికి కూటికి గుడ్డకు గరవయ్యెను. జనసామాన్యమునకు సుఖజీవనము గలిగించునట్లు సంఘమును పునర్నిర్మాణము చేయుట యావశ్యకమయ్యెను. ఇందుకొరకు పలువురు పలుమార్గము లుపదేశింప

సాగిరి. వ్యక్తులయొక్క శక్తిసామర్థ్యములను బట్టి వారు ధనికులు కావలెననువ్యక్తివాదమును కొందరు పూనిరి. ఇందులో శక్తిగలవారు బాగుపడుటయు తక్కినవారు నిస్సహాయులగుటయు తటస్థించును. పంథొమ్మిదవశతాబ్దమున ఫ్రాన్సు, ఇంగ్లాండు, జర్మనీ దేశములందలిజనుల అభిప్రాయములందు మార్పులుకలిగెను. ఆస్తి సంఘసంఘములదై యుండవలయు ననియు పనివానిఆవశ్యకతనుబట్టి వానికి కూలి యివ్వబడవలయు ననియు "కమ్యూనిజం" సిద్ధాంతమును కొందఱు బోధించిరి. దేశముయొక్క ఆర్థికవ్యవహారములెల్ల ప్రభుత్వమును (మునిసిపలు) స్థానిక స్వపరిపాలకసంస్థలును తమ చేతులలో నుంచుకొని అందరికిని సమానావకాశములను కలిగించుచు ఆ యా వ్యక్తులశ్రమకు అనుగుణముగా వారివారికి వేతనలాభము కలిగింపవలెనను "సోషలిజం" సిద్ధాంతమును కొందఱు బోధించిరి. ఈ సిద్ధాంతములు బోధించుటకు బాగుగా నున్నను వీనిని ఆచరించుటకు చాలా ఆటంకము లున్నందున పారిశ్రామికులలో కొందరు కార్యశూరులు పారిశ్రామికసంఘములను (Labour Unions) స్థాపించి తమ కోరికలు నెరవేరువరకు సమ్మెలు కట్టి కార్యము సాధింపవలచిరి. కూలిని హెచ్చించుటకు, శ్రమచేయు కాల పరిమితిని తగ్గించుటకు, నీ తుదిపద్ధతియే చాలవర కుపయోగపడినది. తక్కినబాధ లెట్లున్నను జనసామాన్యము నమితముగా బాధించు ఆర్థికజాడ్యములు రెండు కనబడుచుండెను. అప్పు చేయకుండ జీవింపగలవారు చాలతక్కువ. అప్పులపైన

వడ్డీలు మితిమీరిపోయెను. ఇక చిల్లరసరకుల గొనకుండ బ్రదుకువారు నరుదే కదా! చిల్లరవ్యాపారముపైని లాభములు తీయువారి తెలివితేటలవలన చిల్లరవ్యాపారములో అసలుసరకువిలువకన్న లాభమే అధికమయ్యెను. ఈ రెండుజాడ్యములును బీదలను పిల్చిపిప్పిచేయుచుండెను. ఈ జబ్బులను కుదుర్చుకొని తొలగించుటెట్లాయని ప్రజలు పరిపరివిధములుగా యోజింపఁజొచ్చిరి. అధికమగువడ్డీలబారినుండి బయల్పడుటకు కొందరు కలిసి పెద్దమొత్తము బదులుతెచ్చి దానిని కావలసినవారికి చౌకవడ్డీల కిచ్చు సమష్టిఋణవిధానము నారంభించిరి. అత్యధికలాభము లార్జించు వ్యాపారముబారినుండి తప్పించుకొనుటకు సమష్టిక్రయవిక్రయములపద్ధతిని మొదలిడిరి. అనగా కొందరు కలిసి ఉమ్మడిగా సరకులను కొని కావలసినవారికి చౌకగా నమ్ముపద్ధతి ప్రారంభించిరి. ఈ రెండు విధములైన సంభూయసముత్థానప్రయత్నములనుండియే సహకారము ప్రభవించినది. మొదటిది పరపతిపద్ధతి యనియు రెండవది "పరపతీతరపద్ధతి" యనియు ప్రసిద్ధికెక్కినది. సహకారక్రయవిక్రయవిధానము మొదట నింగ్లాండులోనే పాదుకొనినది. పారిశ్రామికసంఘములు కూలివారికి ఆత్మవిశ్వాసము స్వయంకృషిశక్తియు కలిగించినందున వారీస్వయంసాహాయ్యశక్తిని క్రొత్తమార్గములలో పెట్టగలిగిరి. 19 వ శతాబ్దారంభమున సహకారపద్ధతులు వివిధరూపముల దాల్చెను. రాబర్టు ఓవెన్ అనునాతడు 1771 లో జననమొంది 1859 లో మరణించెను. ఇతడు పారిశ్రామికులలో

సహకారోద్యమమును స్థాపించి జయప్రదముగ జేసిన ధీశాలి. బజారు ధరకుగాక అసలుధరలకే వస్తువులను విక్రయించుపద్ధతి వలన ఇతడు స్థాపించినవస్తువిక్రయశాలలు నష్టమువచ్చి చెడిపోయెను. కాని అతడు వేసినవిత్తనము మాత్రము ఫలించెను. ఇతర విక్రయశాలలు బయలు దేరెను. 1844 లో స్థాపింపబడిన రాక్డేలువస్తువిక్రయశాల బాగుపడి అందరకును మార్గదర్శి యయ్యెను. పరపతిసంఘములను స్థాపించి వడ్డీ వ్యాపారమువలన ప్రజలకు కలుగుచుండిన బాధలు నివారించుటలో ముందంజవేసినది జర్మనీదేశము. 1808 నుండి 1883 వరకు జీవించిన హెర్ స్కుల్జు (Her Schulze) 1850 లో నొక పట్టణమున అప్పులిచ్చు పరపతిసహకారసంఘమును స్థాపించెను. 1818 మొదలు 1888 వరకు జీవించిన హెర్ రెయిఫీసెన్ (Her Raiffeisen) 1848 నుండి పాటుపడి గ్రామపరపతిసంఘమును 1862 లో స్థాపించెను. ఈఉద్యమము మొదట జర్మనీలో బాగుగా వ్యాపించెను. సహకారపద్ధతులపైన వస్తువుల నుత్పత్తిచేయువిధానమును మొదట ఫ్రాన్సుదేశములో ఫొరియర్ (Fourier 1772-1837), బ్యూచెజ్ (Buchez 1796-1865) అనువారు ప్రారంభించిరి. తరువాత ఇంగ్లాండులో ఒవెన్ శ్రమపడి పనిచేయగా 1820 మొ॥ 1847 వరకు నీ పద్ధతిసాగెను గాని జయప్రదము గాలేదు. కొన్ని జనులసంఘములుగను కొన్ని అంగళ్ళుగను ఈప్రయత్నములు బయలుదేరెను. ఇవి బాగుపడకపోవుటకు కారణ మింగ్లాండుదేశప్రభుత్వముయొక్క విముఖత్వమే. ఫ్రాన్సులోనిసంఘముల కాప్రభు

త్వము ధనము నప్పిచ్చియు, మునిసిపాలిటీలు సైనికశాఖ సివిలు శాఖయు తమకు గావలసినవస్తువుల నీ సంఘములయొద్ద నే కొని యు చేయూత నొసగినందున నవి యభివృద్ధిగాంచెను.

సహకారపద్ధతులపైన సరకులను గొని విక్రయించి ప్రజలకు చౌకగ నందిచ్చు సహకారవినియోజకవిధానము బాగుపడుటకు, ఇంగ్లాండులోని రాక్డేలువస్తువిక్రయశాలమార్గ దర్శి యయ్యెను. అది అభివృద్ధిజెంది టోకువ్యాపారశాఖలను దానికి సంబంధించిన వస్తుఉత్పత్తిశాఖలను ఏర్పాటుగావింపగా నది యంత్రాగారపరిశ్రమలకు పోటీయగు వినియోజక సహకారోద్యమ మనుపేరున విజృంభించెను. కేవలము రైతులకు అప్పు లిచ్చుపరపతిపద్ధతి మాత్రమెగాక కర్షకులకు గావలసిన సమస్తవస్తువులను పరికరములను సప్లై చేసి వారి పంటల నుత్పత్తి చేసియు బజారులో పెట్టి ధర రాబట్టియు ఇంక నితర పనులందును సహకారపద్ధతిపైన వ్యవహారములు జరిగించు పద్ధతి జర్మనిలోని గ్రామములం దభివృద్ధి జెందెను. దీనికి వ్యవసాయికసహకారమని పేరు కలిగెను.

డెన్మార్కు దేశీయు లీసహకారమును పశుసంపద పాడి వస్తువులయుత్పత్తి వినియోజనములందుపయోగించి సహకారపశుపాలనోద్యమమునకు మార్గదర్శకు లైరి. డెన్మార్కు వారికి యుద్ధములో పోగా మిగిలినభూమి సారవంతమైనది కానందున వారు పశుసంపదపైన నాధారపడవలసినవా రైరి. అందువలన వారు సహకారపశుగోష్ఠాగారములు పాడిదినుసుల

శాలలు స్థాపించుటలో మాత్రమేగాక పండులను కోళ్లనుపెంచి వానిని విక్రయించు వ్యాపారమునగూడ సహకారమార్గము లుపయోగించిరి.

ఇటలీదేశములోని చిన్నచిన్న రైతులు సహకార కర్షకసంఘములుగా చేరి ఇజారాదారులప్రమేయము లేకుండగనే భూఖామందులదగ్గర భూమిని తామే కౌలుకు పుచ్చుకొనిగాని క్రయముపొంది గాని తమలో తాము దానిని పెద్ద భాగములుగా గాని చిన్నిభాగములుగా గాని విభజించుకొని సహకారపద్ధతిపైన సాగుచేయుచు నీ సిద్ధాంతమును ఆచరణలో పెట్టిరి. పట్టణములలో తాపీపనులు, బళ్ళుతోలుట, ఎగుమతిదిగుమతులు, రేవుపనులు మున్నగు ఇజారాలను కంట్రాక్టులను మధ్యవర్తులతో సంబంధము లేకుండగా తామే పుచ్చుకొని పనిచేయుటకు సహకార కంట్రాక్టరు సంఘముల నిర్మించుకొనిరి.

ఇట్టు అప్పులలో, వ్యాపారములో, వృత్తులలో, వస్తు ఉత్పత్తిలోను, వినియోజనములోను మధ్యలాభము పొందు దలారీలకు తావులేకుండగా పని వారే స్వయంసహాయ్య పద్ధతులపైన కార్యనిర్వహణము చేసుకొనుటకు సహకార సంఘములు మూలాధారములయ్యెను.

## భా ర త దే శ ము - స హ కా ర ము :

భారతదేశములో కూడా క్రొత్త సాంఘిక పరిస్థితులేర్పడి సాంఘిక ఆర్థిక క్షోభ యత్యధికమై ఆబాధ మాన్పు ప్రయత్నములోనుండి సహకారోద్యమావశ్యకతను ద్విగుణీకృతము చేసినవి. ప్రాతపరిశ్రమలు నాశనమై క్రొత్తవి స్థాపింపబడనందున ప్రజలలో నిరుద్యోగసమస్య యధికమైనది. జాతీయసంపద వృద్ధిజెందుటలేదు. చౌకబారుపరదేశ వస్తువులతో మనబజారులు నిండినవి. ప్రజ లితరవృత్తులు లేక వ్యవసాయముపైననే ఆధారపడవలసినవారైనారు. జనసంఖ్య పెరుగుచు జనుల వారసత్వధర్మములవలన భూములు చిన్న చిన్న భాగములై పోయి కృషివలన లాభము లేకున్నది. కేంద్రీకరింపబడిన ప్రభుత్వవిధానమువలన గ్రామములో నున్న తెలివిగలవారు డబ్బుకలవారు పట్టణములకు వచ్చి నింపుచున్నారు. పాశ్చాత్యదేశములతోడి వ్యాపారమువలన ముడిసరకులధరలు పెరిగినను ఈధరలు మధ్యవ్యాపారగాండ్ర చేతులలోనే పడుచున్నవిగాని పంటపండించు రైతులకు లాభము కలిగించుటలేదు. ధరలు పెరిగినందున ఇతరచోట్ల నుండి కొనవలసినసరకులకు గ్రామవాసులధికసొమ్ము వెచ్చింప వలసివచ్చుచున్నారు. పంటలో ఇన్నవవంతుచొప్పున ముడి సరకులనే శిస్తుగా వసూలుచేయుపద్ధతి పోయి రొక్కపుశిస్తు వసూలుపద్ధతి వచ్చినందున రైతులు కిస్తీలు చెల్లించుటకు

తమ పంటలను తెగనమ్మి హెచ్చువడ్డికి షాహుకారులదగ్గర అప్పులు చేయవలసినవా రగుచున్నారు. పూర్వకాలమునాటి న్యాయశాస్త్రము ప్రకారము ఋణముయొక్క బాధ్యత మూడుతరములవరకును నిలిచియుండినందున ఋణశేషము నుంచుకొనుట పాపముగా నెంచి ప్రజలు ఋణశుద్ధిచేయుచుండిరి. బాకీదార్లును తొందరపడకుండిరి. మూడేండ్లలోనే కాలదోషము పట్టుపద్ధతి వచ్చినందున ఋణదాతలు తమబాకీని గట్టిచేసికొనుటకు కుయుక్తులు పన్నుచు క్రొత్తమార్గములచే రైతులభూములనే తమ చేజిక్కించుకొనజూచుచున్నందున చిన్నచిన్న రైతులు నిరాధారు లగుచున్నారు. ఇక న్యాయ పరిపాలనావిధానము చాలకష్టసాధ్యము, ధనవ్యయకారణము నైనందునను తగవులు గ్రామసంగతులు నెరిగినపంచాయతీ వలనగాక దూరములో నున్న అధికారులవలన పరిష్కరింపబడుచుండుటవలనను అసత్యము అన్యాయము నిరోధింపబడుటకు వీలులేకుండపోయినది. ఇందువలన ఋణదాత తన ప్రైవేటు ఖర్చులు పబ్లికుఖర్చులు గలిపి తడిపి మోపెడుచేసి రైతును దిగదీయుచున్నాడు.

భారతదేశమున 70 లక్షల గ్రామములు కలవు. నూటికి 77 మంది వ్యవసాయకులు; నూటికి 87 మంది గ్రామవాసులు నైయున్నారు. రైతులు చాలా బీదలుగా నున్నారు. సెంట్రలు బ్యాంకింగు విచారణ సంఘము (Indian Central Banking Enquiry Committee) వారు మన దేశములో కర్షకునికి సాలుకు 42-0-0 రూపాయిల కన్న

హెచ్చుఆదాయము లేదని నిర్ణయించినారు. దేశములో ఐదుమందిగల కుటుంబమునకు 6 యకరముల చొప్పున చిన్నచిన్న మళ్ళు కలవు. ఐదేండ్లకొక మంచిపంట పండుచుండును. దేశములోని మొత్తము సాగునకనువగుభూమిలో నూటికి 16 వంతులకు మాత్రమే నది, చెరువు, భావి మున్నగు వానివలన నీటిపారుదల ఆధారము కలదు. తక్కిన 84 వంతులు వర్షాధారముపైననే సాగు కావలెను. రైతు నిరక్షరుడుగా నుండును. అప్పుపుట్టు పరపతి ఆధారములు తక్కువ.

భరతవర్షమున 80 లక్షల జమీందారులు కలరు. వారి రైతులు నానాటికి బీద లగుచు శిస్తు లిచ్చుకో లేకున్నారు. భరతఖండమున సాలుకు 105 కోట్ల రూపాయిలు వ్యాజ్యముల కొరకు వ్యయముచేయఁబడుచున్నవి. ఇది చాలవరకు రైతులనే బాధించుచున్నది. సమష్టికుటుంబముల పంపిణీపద్ధతివలన నీ వివాదలు కలుగుచున్నవని కొందరితలంపు. వ్యాజ్యములవలన రైతులు షాహుకారులచేతులలో పడుచున్నారు. పదేండ్లలో న్యాయవాదులసంఖ్య నూటికి 10 వంతున హెచ్చినది. నేడు రైతులు భరించుచున్నఋణము 900 కోట్ల రూపాయలు కలదు. ఇందులో చాలవరకు లాభవిహీనమైనది. దీనిలో నూటికి 5 కన్న తక్కువవంతుసొమ్ము శాశ్వత అభివృద్ధికరములగుపనులకొరకువ్యయముచేయబడినది. చాలతక్కువసొమ్ము పశువులు పరికరములు మున్నగువానికొరకు చేయబడినది. ఋణములో చాలవరకు వ్యవసాయికాభివృద్ధికొరకుగాక ఆసామీలు తమ ఆకటద గడవబెట్టుకొనుటకు చేసిన ఋణమే.

మఱియు నీఋణము బ్యాంకులవలన గాక ధాన్యపువ ర్తకులతో సంబంధముగల సాహుకారులదగ్గరనే వాడుకొన్నందున నిది మఱియు ననర్థదాయకమైనది. రైతులు ఋణగ్రస్థు లగుట కింక నొక కారణము - పెండ్లిండ్లకు అపరకర్మలకు వారు చేయు వ్యయము. అయితే హైందవాచారములం దిది తప్పదు. పెండ్లి కట్నములు ఋణములకు కారణములగుచున్నవి. మోటారులు వచ్చి గ్రామజీవనమును వికాసవంతముగ చేసి రైతులకుమఱింత వ్యయకారణము లగుచున్నవి. సహకార పద్ధతులు రైతులకు కొంత లాభము కలిగించుచున్నను వారికి గల అజ్ఞానము భయములవలనను ఉద్యోగులు ప్రజలసేవకుల మనుపద్ధతిప్రకారము నడచుకొననందునను దుర్మార్గుల మోసములవలనను దీనివలన కలుగవలసినంతలాభము వారికి కలుగకున్నది.

భరతఖండమున పరిశ్రమలు బాగుగ లేవు. పారిశ్రామికుల స్థితియు బాగుగలేదు. భరతఖండమున నూటికి 10.7 మంది పరిశ్రమవృత్తులవలన జీవించుచున్నారు. చాలమంది ప్రత్తి, జనుము కర్మాగారములు, ఇనుపపనులు గనులు, వీనిలోనే పనిచేయుదురు. ఒక బ్రిటీషుకార్మికుడు చేయుపనిని ఇద్దరు మొదలుకొని ముగ్గురు హైందవకార్మికులు చేయుదురు. ఉష్ణాధిక్యము వలనను జవసత్వములు తక్కువగుటచేతను నిది తటస్థించుచున్నది. కాని కాయకష్టమును తగ్గించు యంత్రములు వృద్ధియగుచున్న కాలమున నీ సౌకుమార్యమువలన ఆర్థికసంపదకు నష్టము కలుగుటకు కారణము లేదు. ఇంగ్లీషు

కర్మాగారములందుకన్న హిందూదేశములోని కర్మాగారము లందు పరికరములు హెచ్చుగ నమర్చబడియున్నవి. మఱియు కర్మాగారములకు కావలసిన ముడివస్తువులు హిందూదేశము నసే లభించుచున్నవి. ఇట్లున్నను బ్రిటీషుకర్మాగారముల పోటీ హిందూదేశపు కర్మాగారములకు తగులుటకు కారణ ములు రాజకీయములేగాని ఆర్థికములు గావు.

హిందూదేశపు కార్మికులకు వసతిసౌకర్యములు లేవు. 1928 సం॥ బ్రిటీషు ట్రేడ్‌యూనియను కాంగ్రెసురిపోర్టులో నిట్లు కలదు: ఉండుటకు, వండుకొనుటకు, పండుకొనుటకు నుపయోగపడు నొకగది- 9 అడుగుల చతురపుది, మట్టిగోడలు పెంకుటికప్పు కలది- నెలకు 3-6-0 ల కాడుగ కన్న తక్కు వకురాదు. నలుగురు మొదలుకొని ఎనిమిదిమంది పిల్లలతో సహా దానిలోనే జీవింపవలెను. కార్మికులకొరకు యజమానులే కట్టినఇండ్లవలనగూడ వీరికి లాభము కలుగుటలేదు. అవి బారకీచులు. ఒక్కొకగదికి రు 2-4-0 ల అద్దె. పురుషుల నెల కూలి రు 13-8-0 లు. స్త్రీలకూలి రు 9-12-0 లు. ఈ యిండ్ల వీథుల పారిశుద్ధ్యమును చూచువారు లేరు. ట్రేడ్ యూని యను కాంగ్రెసువారి నివేదికలోని అంశములు చూచిన కార్మికులు ఎంత క్రిక్కిరిసి జీవించు చున్నారో తెలియ గలదు.

| | |
|---|---|
| ఒక నగరమున మొత్తము జనాభా | 10731309 |
| ఒక గదిలో 5 మంది చొప్పున కాపురమున్న వారు | 687217 |
| ,, 6 మొదలు 9 చొ॥ ,, | 236783 |
| ,, 10 ,, 19 ,, ,, | 115731 |
| ,, 20 పైన ,, ,, | 31578 |

బొంబాయిమునిసిపాలిటీవారు కార్మికులకొరకు కట్టిన భవనములందు కూడ ఒక్కొకగదిలో నొక కుటుంబము వసింపవలెను. అద్దెలు దామాషా కూలివాడు భరింప గల దానికన్న హెచ్చుగ నున్నవి. కలకత్తా జనుముకర్మా గారములవారు తమ పనివారికొరకు మంచిఇండ్లను కట్టి యున్నారు. కాన్పూరు నేతపరిశ్రమలవారు మంచి యిండ్లనే కట్టినారు. చెన్నపురికర్మాగారములవారి పరిస్థితులును కొంత బాగున్నవి. ఇవి తప్ప తక్కినచోట్ల వీరిస్థితి బాగుగ లేదు.

భారతదేశకర్షకులయొక్కయు కార్మికులయొక్కయు స్థితిగతులు సంస్కరించు నుద్దేశముతో 1892 లో సహకారోద్యమము దేశములో నెలకొల్పు తలంపు ప్రభుత్వము వారికి కలిగెను. మదరాసుప్రభుత్వమువారు సర్ ప్రెడరిక్ నికాల్సన్ గారిని వ్యవసాయిక బ్యాంకులను ఇతరభూసంబంధ బ్యాంకులను స్థాపించుటకు గల అవకాశములనుగూర్చి యోజించుటకు నియమించిరి. 1899 లో ఆ నివేదిక మద్రాసుప్రభుత్వమువారికి చేరెను. 1900 లో ఇండియా ప్రభుత్వమువా రది చూచిరి. సహకారోద్యమమును గూర్చి

విచారించుటకు 1901 లో సర్ ఎడ్వర్డులాగారి అధ్యక్షత క్రింద నొక ఉపసంఘమును నియమించిరి. 1904 లో నొకసహకారసంఘముల చట్టము చేయబడెను. రెండేండ్లలో 800 సహకారసంఘములు బయలుదేరెను. తరువాత 1912 లో నింకొక చట్టము చేయబడెను. ఇటీవల 1922 లో బొంబాయి ప్రభుత్వమువారును, 1932 లో మదారాసు ప్రభుత్వమువారును తమతమరాష్ట్రములకు సహకారసంఘముల చట్టములను నిర్మాణముచేసిరి. 1933 నాటికి భారతదేశమున ఒక లక్ష సంఘములు బయలుదేరినవి. వానిపెట్టుబడి 91 కోట్ల రూపాయలు. సభ్యులసంఖ్య 43లక్షలమంది. కాని 35 కోట్ల జనసంఖ్యగల దేశమున నిదియొక గొప్పసంగతికాదు. గ్రామవ్యవసాయ పరపతిసంఘముల స్థాపనయే ప్రధానముగా ప్రభుత్వమువా రెంచినందున అప్పులిచ్చు పరపతిసంఘములే చాల బయలుదేరెను. ఇతర విధములగు సహకారసంఘములు వృద్ధిజెందలేదు. చేతిపనులు చేయువారికిగాని పట్టణములలోని పారిశ్రామికులు చిన్నవర్తకులు బాగుపడుటకు వీలైన సంఘములుగాని పెరుగలేదు. సహకారవస్తు ఉత్పత్తినిగూర్చి తగుశ్రద్ధ వహింపబడలేదు. సహకారవస్తునిలయములు కొన్ని బయలుదేరినను అవి చాలాచోట్ల నష్టపడినవి. దీనికారణములు పరిశీలించుట యావశ్యకమయ్యెను. అప్పులిచ్చు షాహుకారునకు బదులప్పులిచ్చు బ్యాంకులను స్థాపించినంత మాత్రమున నేదేశములోని ఆర్థికపరిస్థితులును బాగుపడవు.

గ్రామపున ర్నిర్మాణకార్యములందు సహకార పద్ధతుల నుపయోగించు కొనుటకు మన ప్రజలింక నలవాటు పడలేదు. నవీనపద్ధతులపైన పశువులను పెంచి పాడిదినుసులు తయారుచేయుట మనదేశమువారెఱుగనే యెఱుగరు. ముడివస్తువులను బజారులో పెట్టుటకు వానిని తయారుచేయు కృషిసంబంధపరిశ్రమలు మనకు వింతలు. వ్యవసాయికవ్యాపారముసైతము రైతులు జరుపుకొనరు. అది సాధారణముగా ఋణములిచ్చు సాహుకారుచేతిలోనే యుండును. రైతుల పంటలను వారే అమ్ముకొనుటకు తగిన వ్యవసాయసంబంధ పరిశ్రమ కట్టుబాటులు సహకారపద్ధతులపైన నిర్మింపబడిననే తప్ప మనరైతుల దుర్భరదుస్థితి పోయి బాగుపడజాలరు.



# సహకార వస్తునిలయోద్యమము

## ద్వితీయ భాగము.

### రాక్డేలు సహకారోద్యమ చరిత్ర.

### మొదటి ప్రకరణము.

ఇంగ్లాండు దేశమున లంకాషైరుజిల్లాలోని రాక్డేలు గ్రామము ఉన్నిపరిశ్రమకు ప్రసిద్ధిజెందినది. 1843 వ సంవత్సరాంతమున నొకనాడు కూలి లేక అల్లాడుచున్న నేతగాండ్రు కొందరు తమ స్థితిగతులనుగూర్చి యోజించుకొని బాగుపడుట కేదైనమార్గము నాలోచించుకొనుటకు సమావేశమైరి. పరిశ్రమలను స్థాపింపవలయునన్న పెట్టుబడి లేదు. అంగళ్ళను పెట్టుదమనుకొన్న సరకులేదు. ఎట్లయిన నేదో యొక వ్యాపారమును మొదలిడి బ్రతుకుతెరువు కల్పించుకొనదలచిరి. విరాళములకొరకు వారొక కాగితముపైన లెక్క వేసి చూచుకొనగ వారమునకు రెండుపెన్నీలు* (2 అణాలు) చొప్పున పండ్రెండుగురు ధైర్యశాలురు విరాళములను వేసిరి. 'ఈ చిన్న మొత్తమునైన నెట్లిచ్చుకొందుము దైవమా?' యని వారు దిగులొందిరి. ఈ పరిస్థితులలో ఒక్క సంవత్స

---

* ఇది ఇంగ్లాండులోని చలామణి. 12 పెన్నీలు ఒక షిల్లింగు. 20 షిల్లింగులు ఒక పౌను- అనగా నవరసు. దీనివిలువ పూర్వము రు 15-0-0 లు. ఇప్పుడు మారకపురేటును బట్టి రు 13-5-3 లు. బజారువిలువ రు 19-12-0.

రమువరకు విరాళములను వసూలు చేసినప్పటికిని ఒక బస్తా (ఓటుమీలు ధాన్యపు) పిండిని కొనుటకు వలసినమూల ధనము సమకూర్చుట కష్టతరమాయెను. ఇట్టి దైన్యమున ప్రారంభింపబడిన సాలెసంఘము 1857 నాటికి గొప్పఅభివృద్ధి జెంది పరిశ్రమాలయములను అంగళ్ళను నిర్మించుకొనెను. ఈ సంఘమువారి కిరాణాసరకుల యంగడిలో సాలుకు 76000 పౌనుల వ్యాపారము జరుగుచుండెను.

ఆ కాలమున ఇంగ్లాండులో ఉన్నివ్యాపారము చేయు వర్తకులు చాల లాభము గడించుచుండిరి. సాలెవాండ్రు కూలి చాలక దారిద్ర్యమున మునిగియుండిరి. ఇంతలో దేశములో ధరలు పెరిగి పారిశ్రామికులు మలమల మాడ జొచ్చిరి. ఎట్టకేలకు 1843 లో సాలెవాండ్రు కూలిని హెచ్చు చేయుమని తమ యజమానులను కోరిరి. ఇతరవర్తకులు హెచ్చుచేసినచో తానుకూడ హెచ్చుచేసెద నని ప్రతివర్తకుడును చెప్పుచుండెను. కాని అందరు హెచ్చుచేయుట యెట్లు తటస్థించును? ఒకరిద్దరు వర్తకశిఖామణులు తమపనివాండ్ర వేతనములను హెచ్చించి చూచిరి. ఇతరులుకూడ హెచ్చింపనిచో వీరును మరల తగ్గించి వేయుదురు. అందువలననే 1843 వ సంవత్సరమున పైనచెప్పబడిన రాక్డేలు సాలెవారిసంఘము కార్యాలోచనము చేసెను. ఒక్కొక్క వర్తకుని దగ్గరనున్న పనివాండ్రు తమ తమ యజమానులను కూలిని హెచ్చింపుమని యడిగి ఆత డట్లు చేయనిచో పనిమానునట్లును, పనిలో నున్నవారు వారమునకు 2 అణాలుచొప్పున నిచ్చు విరాళములతో

వారిని పోషించునట్లును తీర్మానించిరి. ఇది కష్టసాధ్యమగు కార్యము. కూలి హెచ్చింపు డనియు లేకపోయిన పనిమానెద మనియు చెప్పుటకు వెళ్ళినవారిపైన యజమానులకు ప్రేమయుండుట దుర్లభముకదా? ఈ రాయబారము నిర్వహించుటకొరకు తిరుగువారు రాకాలమున పని మానవలసిన వారేకదా! ఈకార్యమును నిర్వహింప నియమించినవారికి తృప్తికరముగా పని చక్కబెట్టుకొని వచ్చుటయు కష్టతరమే కదా! ఈ 'రాయబారి' తిరిగి ఇల్లు చేరునప్పటికి యజమాని వీనిపనికి స్వస్తి చెప్పును. వీ డితరపరిశ్రమాలయములకు పోయి పని కావలెనని వేడుకొనగా చాలచోట్ల లేదని తిరుగ నంపుదురు. ఎట్లకేల కొకచోట దూరముగ నున్న ఊరిలో పని దొరకును. తన భార్య బిడ్డల నచ్చటికి తీసికొనిపోవు నప్పటికి ఇతడు నేతగాండ్రనాయకు డని యజమాని చెవిని పడును. మరల నితనికి పనిపోవును. ఇట్లు తిరిగి తిరిగి వేసరును. ఈ చిక్కులలో వీనినే స్తగాండ్రు వీనికి తినుటకు త్రాగుటకు నేదైన నిచ్చి కాపాడుట తటస్థింపవచ్చును. ఏదో సారా దుకాణమున పోట్లాటలో వీనిపైన పోలీసువారు కేసు నారోపింపవచ్చును. ఈకేసులో నితడు నిజముగా నిర్దోషియేమైనను మేజస్ట్రేటుకు సహాయముగ నియమింపబడు "జూరీ"సభ్యులలో కొందరు పరిశ్రమాలయయజమాను లుండుటయు, ముద్దాయి నేతగాండ్రకు నాయకు డని ఎరిగియున్నందున 'వీడు దిట్టరి నుడీ!' యని తమ తోడిసభ్యులతో పలుకుటయు, పక్షపాత బుద్ధిచేత వీనిపైన నేరారోపణమును స్థిరపరచుటయు, వీనికి

శిక్ష విధింపబడుటయుగూడ తటస్థించుచుండును. కారాగారమున కొన్నాళ్ళుండుట తటస్థించెనేని, వీని భార్యాబిడ్డలు మలమలమాడి ఒక్కొక్కప్పుడు దుర్మరణము నొందుటకూడ తటస్థింపవచ్చును. ఇన్ని బాధలుపడి కారాగారమునుండి విముక్తుడైన 'రాయబారి' దిక్కులేక దేశాంతరముల కేగి బ్రదుకవలసి వచ్చును. ఇట్టి యవస్థలబడి ఇంగ్లాండు దేశమునుండి అమెరికాకు వలసపోయినవారాదినములలో ననేకులుండిరి. ఇది చూచియే యజమానులపై కత్తిగట్టుటకు పనివాండ్రు వెఱచుచుండిరి. కూలి హెచ్చింపుమని యడుగుటకు రాయబారులుగ పోవుటకు భయపడుచుండిరి. ఎట్లకేలకు రాక్డేలు సాలెసంఘమువారిలో కొందరు ధైర్యశాలురు రాయబారులుగ పోవుట కంగీకరించిరి. చాలమంది యజమానులు వేతనములు హెచ్చించిరి. కాని కొంద రిష్టపడక తమ కర్మాగారములను మూసివేసిరి. అందువలన చాలమందికి పని లేకుండపోయెను. ఈ చిక్కులవలన వేతనము హెచ్చించుకొను అవకాశము పోయెను. 'మన మేల కష్టపడవలెను? పెట్టుబడిదారు లేల సుఖపడవలెను? అందరును సమానులే కదా? అందరును సమానముగ గడించి సమాన సౌఖ్యము నేల పొందరా'దను 'సోషలిష్టు' భావములు మన సాలెవారిలో ప్రబలసాగెను. కాని ఈభావముల నాచరణలో పెట్టి ప్రజల నేలగల రష్యాదేశపు 'సోవియటు' పరిపాలనా విధాన మింకను అవతరింపలేదు. తమ క్షేమలాభములకొరకు పనిమానుకొని సమ్మెలను సాగించుట యుక్తమని వాదించు

పారిశ్రామిక సంఘసంస్కర్తలును లేరు. అందువలన కర్తవ్య మేమా యని వితర్కించిరి. యజమానులు తమ వేతనములు హెచ్చుచేయనందున తమస్థితిగతులు బాగుచేసికొనుట కేదైన ఇతరమార్గములు కలవా యని మన రాష్ట్రేలు సాలెలు యోచించిరి. వారమునకు రెండణాలు విరాళము మాత్రమే వారికి శరణ్య మయ్యెను. వారమునకు రెండణాలచొప్పున ప్రోగుచేసినచో ఏదైన చేయవలెనన్న ఎన్నాళ్ళకు వీలగును? అప్పటికి ప్రోగైన కొద్దిమొత్తమును నలుగురికి భాగించి పంచిపెట్టుడని కొందరు దరిద్రులు కోరిరి! ఈ సంఘము వారికేమి చేయుటకును తోచలేదు. ఈ కాలమున 'చార్టిస్టు' పఠనమందిరమున ప్రతి ఆదివారము బహిరంగసభలు జరుగుచుండెను. అచ్చట మన సాలెసంఘమువారు తమ ధర్మసందేహములను తీర్చుకొనదలచిరి. ప్రజల ఆర్థికాభివృద్ధినిగూర్చిన చర్చను ప్రారంభించిరి. ఎవరికి తోచినచికిత్సను వారు చెప్పసాగిరి. ప్రజలబాధల కెల్ల మద్యపాననిషేధమే పరమౌషధమనియు, సారాయము కొరకు వ్యయముచేయు సొమ్మును తమ తమ కుటుంబములకొరకే వినియోగింపు డనియు మద్యపాన నిషేధోద్యమనాయకులు హెచ్చరించిరి. ఇతరు లితర విధములుగ బుద్ధిచెప్పిరి. నిజమేకాని చేతినిండ పని, పుష్కలముగ కూలి, వారి శ్రేయమును కోరు యజమానులు, నున్నప్పటికినిగూడ పనివాడు త్రాగుడుకొరకు దుర్వ్యయము చేయుచున్నగదా ఈనీతులు చెప్పవలెను? ప్రతి స్త్రీకిని పురుషునికిని వోటుహక్కు సంపాదించుటకు ఆందోళనము చేసినకాని

పనివారిస్థితిగతులు బాగుపడ వని అట్టి అభిప్రాయములతో ఆకాలమున పనిచేయుచున్న రాజకీయపక్షములోని చార్టిస్టులు పలికిరి. బ్రిటీషుపార్లమెంటులోనికి ప్రతినిధుల నెన్నుకొనుటకు ప్రజ లందరికిని "వోటు" అధికారము గలిగినగాని ప్రజలు బాగుపడ రని చెప్పుట "పెండ్లి అయినగాని పిచ్చి కుదురదు: పిచ్చికుదిరినగాని పెండ్లికా"దని చెప్పుటవంటి దేకదా! ఎట్టి పార్లమెంటైనను సంఘసంస్కారముచేసి ప్రజల ఆర్థికస్థితిని పూర్తిగ బాగుచేయుటకు శక్తికలిగియుండు ననుట హాస్యాస్పదము. అయిన నా కాలమునాటి చార్టిస్టుపక్షమువారి కిట్టి యభిప్రాయ ముండెను. మన సాలెసంఘమువారు చార్టిస్టుల వలనే బాగున్న దనుకొనిరిగాని ప్రజ లందరికిని హక్కులు గలుగువరకు తాము బాగుపడుట కెట్టి ప్రయత్నములు చేయక మానుకొని యూరకొనుట వెఱ్ఱితన మనియు, తమ కున్నవీళ్ళ నుపయోగించుకొని నలుగురు కలిసి ఏదైన స్వయంకృషి చేసికొనుట యుక్తమనియు కొందరు సోషలిస్టు సహకారవాదులు పలికిరి. సాలెసంఘమువారికి తుదకు సహకారమార్గములచే స్వయంసాహాయ్యము చేసికొని బాగుపడుటయే యుక్తమని తోచెను.

స్వయంసాహాయ్య మార్గములలో తమకు కావలసిన సరకులను తమకు సరసమగు వెలల కందింపగల అంగడి నొకదానిని స్థాపించుకొనుట యొకటి. సాధారణముగ కోమటింట సామగ్రి లరువునకు తెచ్చుకొనువారి కందలి మంచిచెడ్డలు తెలియగలవు. అందు ముఖ్యముగ బీదలు పడుబాధలు బ్రహ్మ

దేవుని కెరుక. అరువు నిచ్చువాడు సరకుయొక్క అసలు విలువపైన వడ్డీనిచేర్చి తక్కువపడే మొత్తము పూడక చాల తంటాలుపడును. వసూలుకాని బాకీల మొత్తములుకూడా కలిసివచ్చేటట్లు అరువిచ్చువాడు. వడ్డీనష్టము కలుపుకొనియు అధిక వెలలు వేసియు, దలారీ మోసపు తూకములు తూచియు, ఎన్నో కృత్రిమములను చేయును. ఇదిగాక అరువులవలన తగాదాలు రావచ్చును. ఋణస్థుడు సొమ్ము నివ్వకపోవును. కోర్టులలో వ్యాజ్యములు, అందువలని యనర్థము లనేకములు దాపురించును. ఇదియెల్ల సాలెవారెఱుగుదురు. అందువలన మనసాలెవారు రొక్కవ్యాపారమే చేయదలచిరి.

1844 సంవత్సరము 24 అక్టోబరు తేదీన సాలెసంఘమువారు 28 మంది తమ సహకారసంఘమును "రాక్డేల్ సొసైటీ ఆఫ్ ఈక్విటబుల్ పయినీర్సు" (Rochdale Society of Equitable Pioneers) అనుపేరున రిజిష్టరు చేయించుకొనిరి. ఈ సంఘముయొక్క ఉద్దేశమువలన వీరి యాశలు, ఆశయము లెంతవరకు నుండెనో తెలియగలదు.

(1) ఈ సంఘసభ్యులకు వారి కుటుంబములకు సౌఖ్యమును పెంపొందించి క్షేమలాభములను కలిగించుటకు ఆర్థికాభివృద్ధిని కలుగజేయుటకు వలసిన కార్యములకొరకు షేరు 1 కి ఒక పౌను (పదిహేను రూపాయలు) చొప్పున మూలధనము సేకరించుట.

(2) వీరికి కావలసిన ఆహారవస్తువులు, దుస్తులు వీరికి సరసమగు వెలలకు విక్రయించుట కొరకు వస్తునిలయమును స్థాపించుట.

(3) పరస్పరసాహాయ్యము చేసికొని బాగుపడదలచు సభ్యులును వారి కుటుంబములును నివసించుటకొరకు కొన్ని గృహములను కొనుట లేక నిర్మించుట.

(4) పనిలేక అల్లాడుచున్న సభ్యులకును, కూలి తగ్గించి నందున ఆదాయము చాలక బాధపడుచున్న సభ్యులకును వృత్తిని కల్పించునట్టియు వస్తువులను తయారుచేయునట్టియు పరిశ్రమలను నెలకొల్పుట.

(5) పనిలేకను, తమకు లభించుచున్న స్వల్పపు వేతనములు చాలకను కష్టపడుచున్న సభ్యులకు జీవనోపాధిని కల్పించి కాపాడగలందులకు వ్యవసాయమున కుపయోగింపగల భూములను కొనుట లేక కవులుకు పుచ్చుకొనుట.

(6) వస్తువుల ఉత్పత్తి, విభజన అనుభవవిధానములను విద్యాపద్ధతిని పరిపాలనాపద్ధతిని ప్రజలకు శ్రేయము కలిగించుమార్గముల నడుపుటకొరకు, ఆచరించుటకు, ఆశ్రమములను స్థాపించుట; అట్టి ఆశ్రమములను స్థాపించుటలో ఇతర సంఘములకు సహాయము చేయుట.

(7) మద్యపాననిషేధమును ప్రోత్సహించు ఫలాహారశాలను స్థాపించుట.

నిజముగ నీయుద్దేశము లెల్ల నెరవేరిన-చో సత్యయుగము నాటిసౌఖ్యము ప్రజలకు అరచేతిలోని స్వర్గమై యుండునుగదా! అయిన నిట్టి సదుద్దేశములు వారికి కలిగినందులకే మనము సంతసింపవలసియున్నది.

ఆనాటి సొసైటీసంఘమున నలుబదిమంది సభ్యులుండిరి. అందులో కొంద రాయూరిలో వలుమూలల నుండుటయేగాక కొంతమంది చుట్టుప్రక్కల గ్రామములందును కాపుర ముండిరి. అందువలన వారి విరాళములు వసూలు చేయవలెనన్న ఒక్కరు పూర్తిగ ఆపనిపైననె తిరుగవలసి యుండును. ఎట్లైన నేమి ప్రతి ఆదివారమును విరాళములను వసూలు చేయుపనికి ముగ్గురుసభ్యులు పూనుకొని పూనికతో వసూలుచేయుచుండిరి. రెండు పెన్నీలచొప్పున విరాళము వసూలుచేయుట కష్టముగ నుండెను. అందువలన చందా మూడు పెన్నీలకు హెచ్చించిరి. ఎట్టకేలకు 28 పౌనులు చేకూరెను. ఈ మూలధనముతో మనసంఘమువారి యుద్దేశముల నాచరణలో పెట్టుటకొరకు వస్తునిలయమును (స్టోర్సు : Stores) స్థాపింపవలయును. తమంగడిని పెట్టుటకు రాక్డేలుగ్రామమున టోడ్ లేను అను వీధిలో డన్లప్పుగారి మేడక్రిందిభాగమును సంఘమువారద్దెకు తీసికొనిరి. దీనికి సాలుకు పదిపౌనులు బాడుగ నియ్యవలయును. విలియం కూప రను నతనిని షరాబుగ నియమించిరి. శామ్యుల్ ఆష్వర్తు అనునతనిని సరకులను విక్రయించువానిగ నేర్పరచిరి. ఇక సరకులను జూచిన కడుపు నిండిపోవును. పల్లెటూరి కోమటింట నుండునంత

అమ్మకము, సరసమగు వ్యాపారసరణియు శ్రేయస్కరము లను నీతిని గ్రహింపగలుగు శక్తి సులభముగా అలవడదు. దుర్గుణములనుగాని జాడ్యములనుగాని అణచుట కెంతశక్తి, ఎంతసొమ్ము మనము ధారపోయవలయును! అయినను అవి పుట్టకుండ నివారించుకొనుట కావంతయైన మనము ప్రయత్నింపము. కొంచెము సొమ్మునైన వ్యయముచేయుట కంగీకరింపము. ఏమైనను సరే తక్కువ వెలలకు సరకు కావలెనని, ఎక్కువ తూనికగలసరకు కావలయుననియు తంటాలు పడువారున్నంతకాలము అమ్మకములో మోసముచేయువా రుండి తీరుదురు. కొను వారియందు నీతియున్ననే అమ్మువారియందును నీతి యుండును.

ఈ విషయములెల్ల మన సాలెసంఘములోని బుద్ధిమంతులు గమనించి ఎన్నిచిక్కులు కలిగినను భరించి తమ సభ్యులందు సహకారసిద్ధాంతములను నాటునట్లు చేయుటకు సమకట్టిరి. ఈ సహకారసంఘమువా రెల్ల రీ నీతిని గ్రహించి సంఘమునకు తోడ్పడరైరి. కొందరు ధైర్యశాలురు మాత్రము తమ సంఘముయొక్క హితముకోరి ఎన్నిబాధలనైన సహించి ప్రవర్తింపసాగిరి. ఎంతదూరమున తా మున్నను సరకులకొరకు తమ యంగడికే వచ్చుచుండిరి. ధర లెట్లున్నను సరకు లెట్లున్నను కొనుచుండిరి. ఈ ధైర్యశాలుర యిల్లాండ్రుకూడ వీరి

కీవిషయమున తోడ్పడసాగిరి. ఇట్లు శ్రమపడుచున్న సభ్యులు తమవలెనే ఇతరసభ్యులును సంఘముయొక్క అభివృద్ధికొరకు శ్రమపడవలె నని పట్టుపట్టిరి. సభ్యులెల్ల రిక్కడనే సరకులు కొనితీరవలె నని బలవంతము చేయసాగిరి. అట్లు కలిసిరాని సభ్యులను తొలగింపవలె నని యొకసభ్యుడొక తీర్మానము కూడ నుపపాదించెను. ఇట్లు చేసినచో సభ్యుల స్వేచ్ఛకు భంగము వాట్లిల్లు ననియు పరస్పరసాహాయ్యము చేసికొనుట కిష్టపడి స్వేచ్ఛగ పాటుపడుపద్ధతియే నిజమగు సహకారమనియు, బలవంతము చేయరా దనియు మరియొక సభ్యుడు పలుకగ నాతీర్మానము నుపసంహరించుకొనెను.



# రాక్డేలు సహకారోద్యమ చరిత్ర.

## రెండవ ప్రకరణము.

రాక్డేలు సంఘస్థాపకులలో నొకడగు జాన్ కెర్షాయను నతడు 1891 - 92 సంవత్సరములందు తన యనుభవముల నిట్లు వ్రాసెను. "నాకు ఏడవయేడు రాకుండగనే కూలిపనిలో ప్రవేశించితిని. ఎనిమిదవయేడు రాకుండగనే బొగ్గుగనులలో పని చేయవలసి వచ్చెను. అందువలన నాకు విద్య నేర్చుకొనుట కవకాశమే లేదు. నవీనయంత్రనిర్మాణము పారిశ్రామికుల నధోగతిలో పడవేసిన కాలమున రాక్డేలులో 136 మంది వారమునకు 6 పెన్నీలపైనను 200 మంది 10 పెన్నీలపైనను 508 ఒక షిల్లింగుపైనను 1500 మంది 1 షిల్లింగు 10 పెన్నీలపైనను జీవించవలసి వచ్చిన కాటకములో రాక్డేలు సహకారోద్యమము స్థాపింపబడినది. ఎనుబదియెనుకుటుంబములకు కప్పుకొనుటకు కంబళ్ళు లేవు. నలుబదియారు కుటుంబములకు పడుకొనుటకు గడ్డితప్ప వేరే ఆధారము లేదు. ఈ క్షామములో నింగ్లాండుదేశ మల్లకల్లోలముగా నుండెను. అనేక ఉద్యమము లున్నను, అవి అశాంతికి అతృప్తికిని కారణములయ్యెను గాని తరుణోపాయము చూపలేవయ్యెను. పరిశ్రమ చాల చౌకగ నుండెనుగాని, రొట్టె ప్రియముగనే యుండెను. రొట్టెతప్ప ఇతర ఆహారపదార్థము జనసామాన్యమునకు లేనే లేదు. గోధుమధాన్యము దిగుమతి నిషేధించుచు చేయబడిన

చట్టములవలన ధర పెరిగినది. దీనిని గూర్చి ప్రజలలో ఆందోళనము బయలుదేరెను. అట్టి సభలో 1842 లో పరిశ్రమాలయములే మూసివేయవలెనని కొందరనిరి. జీవనభృతికి చాలకుండ యజమానులింకను కూలి తగ్గించివేయుదురని కొందరనిరి. 1843 లో రాక్డేలులో సహకార సిద్ధాంతములు చర్చింపబడసాగెను. అప్పటికి రెండేండ్లనుండి రాక్డేలులో నుండిన సహకారసంఘము మూలబడెను. దానికి కారణము అరువుబేర మనియు అదిమార్చినచో బాగుపడు ననియు 'చార్లెస్‌హావర్త్' పలికెను. 1843 క్రిస్మసు పండుగకు కొన్నిరోజులు ముందొక ప్రతినిధులసభ ఆహ్వానింపబడెను. బొగ్గుగని పనివాళ్ళు నన్ను ప్రతినిధిగా బంపిరి. అప్పుడు మా వేతనము కొంచెము హెచ్చింపబడెను. దీని రహస్యము బయల్పడగా అందరు ఛీ ఛీ యనిరి. మేము బొగ్గుగనుల యజమానులను బెదిరింపగా వారు మాకు కూలి కొంచెము హెచ్చించి దానికి మూడురెట్లు బొగ్గు ఖరీదు హెచ్చుచేసిరి. దీనివలన ఎవరు బాగుపడినట్లు? పైగా జనసామాన్యమునకు నష్టముకూడ కలిగెను. ఈ విధముగనే అన్ని వ్యాపారములలో జరిగినచో నిక ప్రజలు బ్రదుకుటెట్లు? బొగ్గుతో పాటు అన్నిసరకుల ధరలు హెచ్చిపోవును. దారిద్ర్యము పెరిగిపోవును. ఈ సంగతి ఇంతకు ముందుగనే ప్రజల కేల తెలుపవైతివని సభవారు నన్ను అడిగిరి. ప్రజలు మా యవస్థను గూర్చి యేమి శ్రద్ధవహించిరని నేను వారికి చెప్పవలె? నంటిని. చూడుడు: యంత్ర

ములు వచ్చిన తరువాత చేతిమగ్గములవారెట్లు మల మల మాడుచున్నారో? గజమునకు అరపెన్నీ హెచ్చుఖరీదిచ్చి కొనే దాత లున్నచో చేతినూలు నేతగాండ్రకీ గతి పట్టియుండునా? జనుల కిట్టి దాతృత్వ మెక్కడిది? వారికి కావలసినది చౌకబారుధర. అట్లే చేతిమగ్గముల ఉన్ని పనివాళ్ళను గజమున కొక్కపెన్నీ హెచ్చుధర యున్నచో బ్రతికిపోవుదురు. కాని ప్రజలకు బుద్ధి యేది? పనివాళ్ల జీవములకంటె నాలుగు డబ్బులే ప్రజలకు ముఖ్యములు. భారత దేశపు నూలు పరిశ్రమ నాశనమై డక్కామజిలీను పట్టుసాలెలు నాశనమగుటకు నిదియొక కారణముకదా! హావర్తు ఈ మాటవిని ఔను సుమా. నేనిది తలంపనైతి ననెను.

ఈ సభలో పారిశ్రామిక సమితులు Trade Unions వారు సహకారులను నిందింపగా వీరు వారిని నిందించిరి. పారిశ్రామిక సమితులు బలవంతములై వేతనముల విషయములో పని చేయగలుగునని నాటి పారిశ్రామికులు తలంపరైరి. ఈ సమితులు వస్తు ఉత్పత్తికి తోడ్పడనందున అంతగా ప్రయోజనకరములు కావని వారు తలంచిరి. చార్లెస్సుహావర్తు సహకారములో కొంత సంస్కరణము చేసిన లాభకరమని ఇంకొక రోజున సభలో పలికెను. సహకారము ఆచరణమున నిష్ఫలమైనదని సమితులవారు వాదించిరి. అది పాడగుటకు కారణము వచ్చినలాభమును ధనికులు మూటకట్టుకొని పోవుటగాని వేరుకాదని హావర్తు పలికెను. పనివారెల్లరు వారమునకు మూడు పెన్నీల చొప్పున చందా

యిచ్చినచో సహకార వస్తునిలయమును స్థాపించి దాని లాభ
మును వడ్డీకి పెరుగనిచ్చినచో నెన్నాళ్ళలో పరిశ్రమాలయ
ములు పారిశ్రామికుల వశ మగునని కెర్షా ప్రశ్నించెను.
అందరు పనివాళ్లు చేరినచో పదునైదేండ్లలో నిది సాధ్యమగు
నని అంచనా వేయబడెను. ఈ విషయమై ఒక కరపత్రము
తయారుచేసిరి. తక్షణమే అక్కడ నున్నవారు 5 షిల్లింగుల
చొప్పున చందాలువేసి 3 పౌనులు సమకూర్చి ఆ కరపత్రము
నచ్చువేయుటకు హస్తమిచ్చిరి. ఈ కరపత్రములెల్ల పని
వాళ్ళకు చదువనిచ్చి మరల ప్రోగుచేయసాగిరి. కెర్షా చాల
కరపత్రము లట్లు పంచిపెట్టి, పదునైదుదినములతరువాత
మరల ప్రోగుచేయుచు చదువనివారి కిచ్చుచుండును. చదివిన
వారి అభిప్రాయ మడిగి తెలిసికొను చుండును. చాలమంది
చదివితి మని చెప్ప యూరకొందురు. క్లగ్‌హాలులో నొకయింట
కెర్షాకు తిట్లు తగిలెను. 'నీవంటివారు నీ స్నేహితులవంటి
వారు నీ కవులకు దుస్థితికి కారణభూతులు' అని అచ్చటి
పనివాడు పలికెను. సాంఘిక పారిశ్రామిక దుస్థితిని మాన్పు
టకు ఆందోళనము చేయుట అవివేక మనియు దీనివలన వ్యవ
హార మింకను చెడిపోవు ననియు నత డనెను. ఈ సిద్ధాంతమే
యంగీకరించినచో దుష్పరిపాలనము చిరస్థాయియగును. సంస్క
రణము అభివృద్ధి గగన కుసుమము లగును. అపరాధములు
అన్యాయములు చేయువారి కవి తెలియు టెట్లు? వారు తప్పు
చేయకుండుటకు సిగ్గుపడు టెట్లు? ఇక స్వార్థపరు లెన్ని
యన్యాయములైన జేయవచ్చును. దోచుకొన వచ్చినదొంగకు

స్వేచ్ఛయేకదా! పాపమా పనివాడేమిచేయగలడు? వానికీ బోధల నెవరో తెలివికలవారు చేసియుందురు. ప్రభుత్వములు పెట్టుబడిదార్లు, ఇజారాదార్లు, స్వార్థముకొరకు పాటుబడు ప్రతివారు అభివృద్ధియు ధర్మము జరుగకుండ ఆపుచేయ దలచు ప్రతివారును ఇట్టిబోధలు చేయుట పరిపాటిగ నున్నది. 'మీ రాందోళనము సలుప నక్కరలేదు. ఇంకను తరుణము రాలేదు. మీరు కోరునది చేయుటకు మీ యాందోళనమే యడ్డంకియగును. మీరువృధాగా ప్రజలను రేపుదురు. ఇబ్బంది పెట్టుదురు' అని ప్రభుత్వములు పలుకును. కొన్నాళ్లైన పిదప వారి మాటలు నమ్మి యూరకొన్నవారు వాగ్దానములను చెల్లింపుడని కోరగా వారి కోర్కెలు విపరీతములనియు ఎవరును మార్పు కోరుట లేదనియు చెప్పి తాము మొదట ఆందోళనము చేయుటవలననే పని చెడును గనుక యూరుకొనుమని చెప్పగా వారూరుకొన్న కారణమే వారికోర్కెలు నిరాకరించుటకు హేతువుగా పేర్కొని చూపుదురు! ఇట్లు ఒక పక్షముకు చెందిన లాభాపేక్షాపరులును, అన్యాయప్రవర్తకులును దానిని మాన్ప ప్రయత్నించువారికి చెప్పుచుండుట పరిపాటియైనది. 'మీరు సంతతము ఆందోళనము చేసి అధికారములో నున్న వారికివిసుగుపుట్టింతురుసుడీ!' అని పలుకుదురు మీరామాటలు విని యూరకున్నచో మీరుకోరుఅభివృద్ధి యెవరికి నావశ్యకము లేదని ధ్రువమగుచున్నది. లేకపోయినచో వారే దానిని కోరరా? అందురు.

ఆందోళనమే ప్రజాభిప్రాయమును కలిగించును. న్యాయము చేయకుండ అణచియుంచుటవలన తమకు లాభకరముగ నుండువారిచేత న్యాయమొనరించునట్లు చేయునట్టిది ప్రజాభిప్రాయమే. ఈ వితండవాదములు నాటి రాక్డేలు సహకారులకు నచ్చుటలేదు. అందువలన క్షరా క్లెగ్‌హాలు పనివానికిట్లు బదులుచెప్పెను. 'పరిస్థితులు బాగుగలేవని నే నెరుగుదును. వారమునకు పదిషిల్లింగులతో కుటుంబము బ్రతుకలేదనియు నాకు తెలియును. ఈ స్వల్పపు వేతనమునకు పాటుపడుట యన్యాయము. ఇది మారితీరవలెను. 'వంచనము చేయకుండ బ్రతుకుటకు కావలసిన జీవనభృతిని సంపాదించుకొనగలుగు జీవనమార్గములు కలిగించుకొని తీరవలెను' అనెను. క్లెగ్‌హాలు పనివా డట్లు పలికియుండుటకు గల కారణ మతని కెవరో దుర్బోధలుచేసి మోసగింపబడుచేయని తరువాత బయల్పడినది.

ఆ రోజులలో 'టోడ్ లేను' అను వీధిలో మూడు అంతస్తులమేడ యొకటి యుండెను. మూడవఅంతస్తుపైన నొక పాఠశాల యుండెను. మధ్యయంతస్తులో నింకొకపాఠశాల యుండెను. క్రింది యంతరువు ఖాళీగా నుండెను. ఇది పూర్వమొక అంగడిగా నుపయోగింపబడియుండెను. రెండు పెద్దద్వారబంధములు తలుపులు కలవు. కొన్ని కిటికీలు పెట్టినచో నిది చాలా బాగుండును. ఛార్లెసుహవర్తును తక్కినవారును సంఘముకొరకు దీని నద్దెకు తీసికొనదలచి యింటియజమానును నడిగిరి. అతడు వీరిసంఘమునుకూర్చి విని విని, దాని నద్దె కివ్వ

ననెను. అంతట హావర్తు తనకు వ్యక్తిగతముగా అద్దె కిచ్చె దవా యనగ నతడు సరియనెను. ఇట్లు ప్రతిమూడు నెలలకు అద్దెను ముందుగనే యిచ్చులాగున నాయింటికిందిభాగమును మూడువత్సరములకు బాడుగకు పుచ్చుకొనిరి. ఒక వస్తునిలయము స్థాపించి వస్తువిక్రియము రాత్రిళ్ళు చేయదలచిరి. శామ్యూయేలు ఆష్వర్తు, విలియం కూపరు అంగడివాండ్రుగ పనిచేయుటకు నడుము గట్టిరి. మొదటి మూడుమాసములు తమకు వేతనము లక్కరలేదనియు సంఘము లాభములు పంచగలిగినచో గంటకు మూడుపెన్నీలచొప్పున పనిచేసిన మూడుగంటలకు నివ్వవలసిన దనియు కోరిరి. 1844 లో వస్తునిలయము ప్రారంభింపబడెను. మూడు నెల లగునప్పటికి నిల్వసరకువిలువ పోను నవరసుకు మూడుపెన్నీలచొప్పున లాభవిభాగమొసగబడెను. రెండవలాభవిభాగము నాల్గుపెన్నీలు. నాల్గవది 7 పెన్నీలు. 5 వది 9 పెన్నీలు. ఆరవది 11 పెన్నీలు. ఏడవది 1 షిల్లింగు 2 పెన్నీలు. ఎనిమిదవది 1 షిల్లింగు 4 పెన్నీలు. తొమ్మిదవది 1 షిల్లింగు 6 పెన్నీలు. తుదకు 2 షిల్లింగులు మొదలు 2 షిల్లింగుల 6 పెన్నీలుకూడా లాభము పంచబడెను. వీరి విధులప్రకారము పదియవవంతు విద్యావిషయిక కార్యములకు వినియోగింప బడవచ్చునుగాని, రిజిష్ట్రారు దీని కంగీకరించలేదు. ఆనాటి న్యాయశాస్త్రము పనివారు విద్యనేర్చుకొనుట కంగీకరింపదు! విద్య లేదని వారికి ప్రభుత్వము నియోజనాధికార మొసగదు !!

దారిద్ర్యమున మగ్గువా రభివృద్ధిజెంది స్వతంత్రులై బాగుపడుట కన్నియు నాటంకములే కలుగుచుండునుకదా !!!

# రాక్డేలు సహకారోద్యమ చరిత్ర.



## మూఁడవ ప్రకరణము.

1845 సంవత్సరములో మన సహకారసంఘమువారు తేయాకును పొగాకునుగూడ తమ వస్తునిలయములో విక్రయింపఁదలచిరి. ఆకాలమున నివి యమ్ముటకు లైసెన్సులు పొందవలసియుండెను. అందువలన మార్చి నెలలో లైసెన్సు పొందిరి. ఇందుకొరకు మూలధనము హెచ్చుగ కావలసియుండెను. సంఘమున సభ్యులసంఖ్య పెరిగినదికాని దానికి తగినట్లు పెట్టుబడి పెరుగలేదు. సంఘమువారు కర్తవ్యమాలోచించిరి. ఒక సభ్యుడు రెండున్నర షిల్లింగులు (షిల్లింగుకు పన్నెండు అణాలు) సమకూర్చెదనని వాగ్దానము చేసెను. ఇంకొకసభ్యుడైదు షిల్లింగులు సమకూర్తు ననియెను. ఒక మహాదాత ఒక పౌను (పదిహేను రూపాయలు) చందా వేసెను. నిజముగ రెండణాల చందాకూడ క్రమముగ చెల్లించుటకు శక్తిచాలని కార్మికుల బ్రతుకులో ఒకపౌను పెన్నిధిగనే భావింపవచ్చును. ఆకాలమున నీబీద సంఘమున కిట్టి సహాయము చేయసాహసించిన యాతనిపేరు "విలియంమల్లాలియూ." ఇతరసభ్యులు తమ తమ శక్తికొలది హెచ్చు చందాలు చెల్లించిరి. ఇట్లు సాలె కుటుంబములోని మగవారికి పొగాకును స్త్రీలకు తేయాకును వస్తునిలయములోనే కొనుటకు వీలు కలిగెను.

లను" ఐదుగురు "డైరెక్టరు"లను ఎన్నుకొనుచుండిరి. సంఘము వారి లెక్కలను పరీక్షించుటకు "ఆడిటర్లు" కూడ కలరు.

ఉద్యోగులును డైరెక్టరును ప్రతిగురువారము సాయంత్రము తొమ్మిది గంటలకు యార్కుషైర్ వీధిలో సంఘము వారి కార్యాలయమున సమావేశ మగుచుండురు. సర్వసాధారణముగ రిజిష్టరు (లేఖ్యాసాధము) చేయబడిన సంఘముల కన్నిటికినిగల సామాన్యవిధులెల్ల నీ సంఘము వారికి నుండెను. ఏటేటను మొదటి మంగళవారము నంతనాడు సంఘము యొక్క సామాన్యసభ జరుపుటకును, అచ్చట సంఘము వారి (స్టోర్సు) వస్తునిలయముయొక్క వార్షికోత్సవసందర్భమున ఒక షిల్లింగు చెల్లించినవారికి విందు నుపచరించుటకును సంఘమువారు తీర్మానించిరి. కొన్ని కారణములవలన నీ విందులు జరుపుటకు వీలు కానందున అల్పాహారవిందులు (టీపార్టీలు) మాత్రమే జరిపిరి. ఆ సందర్భమున ఇతర సహకారులను గూడ ఆహ్వానించుటయు జరుగుచుండెను.

ఆ కాలమున జనసామాన్యమున నీసహకారసంఘము వారి వస్తునిలయమునకు వచ్చి సరకులు కొనువా రెవ్వరు లేరు. అయినను అట్టివా రెవరైన నుందురని సంఘమువారు సోమవారమును, శనివారమును సాయంకాలమున మాత్రము సరకులు సభ్యులకుగాక ఇతరప్రజలకుకూడ విక్రయింపవచ్చు నని తీర్మానించిరి. పొద్దున సభ్యులకుమాత్రమే విక్రయింపవలెను. వారమునకు రెండుమారులు మాత్రమే సాలెవా రా కాలమున వెచ్చముల దెచ్చుకొను చుండిరని తోచుచున్నది.

ఉద్యోగులును ట్రస్టీలును డైరెక్టరులును కార్యనిర్వాహణమున ప్రాలుమాలినచో అపరాధ రుసుముల జెల్లింపవలసియుండెను. ఎట్లయిననేమి కార్యనిర్వాహక సంఘమువారు జాగ్రత్తగ వ్యవహారములనెల్ల చక్కబెట్టుచుండిరి. సభ్యులసంఖ్య హెచ్చెను. 1845 సం వత్సరము మార్చి 3వ తేదీ మొదలు వస్తునిలయమును సోమవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, శనివారముకూడ తెరచియుంచుటకును ఆరోజులలో పూర్వముకన్న యెక్కుడుగంటలకాలము తెరచియుంచుటకును నిశ్చయించి ఆ ప్రకారము జరిగించిరి. శనివారము పొద్దున మాత్రమే వస్తునిలయమును వ్యాపారముకొరకు తెరచియుంచుచుండగ 1846 ఫిబ్రవరి 2 వ తేదీ మొదలు సభ్యుల సమావేశములకొరకు ప్రతిశనివారము మధ్యాహ్నముకూడ తెరచియుంచవలెనని తీర్మానించుట చూడగ వస్తునిలయము దినదినాభివృద్ధి గాంచుచున్నటుల స్పష్టమగుచున్నది. ఈ సంవత్సరము అక్టోబరు నెలలో వస్తునిలయములో నొక కసాయి దుకాణమును గూడ నెలకొల్పి మాంసము విక్రయింప సాగిరి. 1846 మొదలు 1848 వరకును మూడేండ్లవరకు నీ వస్తునిలయము బాల్యావస్థయందు వచ్చు సాధక బాధకము లెల్ల అనుభవించవలసివచ్చెను.

ప్రజల నాకర్షింపజాలమి, ఆ భావము, దేశమున నిరుత్సాహకరమైన ఆర్థిక పరిస్థితులు, నీ వస్తునిలయముయొక్క అభివృద్ధి కాటంకములుగ నుండెనుగాని యీ ఆటంకముల మధ్యనే యిది మెల్లమెల్లగ నభివృద్ధి గాంచుచుండెను.

1846 లో ఎక్కువమంది క్రొత్త సభ్యులు చేరలేదు కాని మూలధనము 252 పౌనుల 7 షిల్లింగుల 1½ పెన్నీలకు వృద్ధిజెందెను. వారమునకు 84 పౌనుల అమ్మకము జరుగుచుండెను.

1847 లో దేశమున కొంత దుర్భిక్షము కలిగెను. వర్తకము క్షీణించెను. అందువలన సంఘసభ్యులకు దారిద్ర్యము దాపురించి కొన్నివాటాలను అమ్ముకొనవలసి వచ్చెను. వర్తకము చెడి సరకులధరలు హెచ్చుట తటస్థించినపుడు మన సంఘమున సభ్యులు తగ్గుటకు మారుగ హెచ్చుట చూడగ నీ సంఘమువారి వస్తునిలయమువలని లాభములు ప్రజలు మెల్లమెల్లగ గ్రహింపగలిగి రనుట స్పష్టము.

పుట్టి తొంబదిరూపాయల చొప్పున ధాన్యమునకు విలువగలిగి యకరము రెండువేల రూపాయలుచొప్పున అమ్ముచుండినంతకాలము దుర్భిక్షమనగా నేమో మన మూహింప లేకుంటిమి గాని అనేకకారణములవలన 1930 సంవత్సరమున వర్తకము పడిపోయి వస్తువులధరలు సగమునకు సగము తగ్గిపోయినంతనే దుర్భిక్షమువలన కలుగు యిక్కట్టులు కొంతవరకు మనకు అనుభవసిద్ధములైనవి. అందువలన రూపాయలను చిల్లపెంకులవలె వాడినవారికే రూపాయి కరవగుట తటస్థించినప్పుడు బీదవారిమాట చెప్పవలయునా? ప్రజలు సహకారవస్తునిలయములో వాటాల గొనియుండినచో కొంచెము సొమ్ము వెనుకవేసికొనిన వారగుటయేగాక దానివలన కొంత సద్యఃఫలముకూడ పొందగలుగుటయు తటస్థించును. కఱవు

దినములలోనే దీనిలాభము ప్రజలు గ్రహింపగలుగుట సహజము. 1848 లో కూడ ఆర్థికపరిస్థితులు బాగుపడలేదు. అందువలన మన సహకారసంఘమువలని లాభములను పొందగోరి చాలమంది సభ్యులైరి. సభ్యులు వస్తునిలయమునకే తఱచుగ వచ్చుచున్నందున యింటింటికి తిరిగి చందాలను పోగు చేయుపద్ధతిపోయి వస్తునిలయకార్యాలయమగు అంగడి దగ్గరనే వసూలుచేయుటకు వీలు కలిగెను. సభ్యుల సంఖ్య 140 కి పెరిగెను. మూలధనము 397 పౌనులయ్యెను. వారమునకు 80 పౌనుల అమ్మకము జరుగసాగెను. దేశములోని ఆర్థికపరిస్థితులుగాని పరదేశమందలి సంక్షోభములుగాని మన సహకారసంఘము వారి వ్యాపారమునకెట్టియాటంకమును గలిగింపలేకపోయెను. వీరు బాడుగకు పుచ్చుకొన్న క్రిందిభాగ మిరుకుగ నున్నందున మేడయొక్క మూడులంతస్థులను ఇరువదియొక్క వత్సరములకద్దెకు పుచ్చుకొనిరి.

1849 లో మరికొంతమంది సభ్యులు చేరిరి. రెండవ అంతస్థులో కార్యాలయమును పెట్టిరి. ఇదిగాక వార్తాపత్రికలు, పుస్తకములు, విక్రయించుటకొక ఉపసంఘమును ఆగష్టు నెలలో నెలకొల్పి విక్రయమువలన వచ్చు లాభముతో సభ్యుల పఠనమందిరమున పుస్తకములను, వార్తాపత్రికలను అలంకరింపజేయుటకు తీర్మానించిరి. 1849 వ సంవత్సరాంతమునకు 390 సభ్యులు చేరిరి. పౌ 1193 షి 19 పెల మూలధనము సమకూరెను. వారమునకు 179 పౌనుల అమ్మకము జరుగసాగెను.

రాక్డేలు పయినీర్ల సంఘమున 1850 వ సంవత్సరమున నొక విపరీతపుశత్రువు పొడసూపెను. సాధారణముగ నలుగురు చేరుచోట మతభేదములు తలయెత్తుట సహజము. అట్టి తఱి భిన్నములగు క్రైస్తవమతాచారములు గల తెగలకు చెందిన కొన్నివందలమందిగల సహకారసంఘమున నిది తలయెత్తుటలో నాశ్చర్యములేదు. అందులో కొంతమంది సభాభవనము నాదివారమునాడు మూసివైచుటకును, మతమును గూర్చిన చర్చలను నిషేధించుటకును పూనుకొనిరి. విశాలభావములుగల సహకారులకు కొందఱ కిది యిష్టము లేకపోయెను. పరస్పర సాహాయ్యము చేసికొని స్వయంకృషిచేత బాగుపడదలచుకొనిన ప్రజాసమూహములకు మతభేదము వేరు పురుగు వంటిదనియు, నిది తలయెత్తినచోట అభివృద్ధి సున్న యనియు వీ రెఱుగుదురు. అందువలన వీ రిది యెట్లు పరిణమించునో యని భయపడిరి. 1850 సంవత్సరము ఫిబ్రవరు 4 వ తేదీన ఈ సమస్య చర్చకు వచ్చెను. అంతట ప్రతిసభ్యుడును యుక్తసమయమున క్రమపద్ధతిని సభలో చర్చకు వచ్చిన సమస్తవిషయములను గూర్చియు తన యభిప్రాయములను స్వేచ్ఛగ వెల్లడించవచ్చుననియు క్రమప్రకారము ముపపాదింపబడిన సమస్తవిషయములును చర్చనీయములే యనియు తీర్మానించిరి. ప్రజలస్వాతంత్ర్యమునకు మూలాధారమగు వాక్స్వాతంత్ర్యమును సహకారోద్యమమున చిరస్థాయిగ నెలకొల్పి మన సహకారసంఘమువారు ఖ్యాతి గడించిరి.

అడిగినవారల నెల్ల రను సభ్యులుగ జేర్చుకొనుటవలన నిట్టి చిక్కులు కలుగుచున్నవని సంఘములోని ప్రముఖులు గ్రహించి ఆరునెలలవరకు క్రొత్తసభ్యులను జేర్చుకొనుటను నిలుప వలయునని తీర్మానించిరి. అప్పటినుండి ముఠాల మతభేదము తలయెత్తలేదు. మతభేదములవలన కలుగుకీడు నాంగ్లసహకారోద్యమ నాయకులు బాగుగ గ్రహించియుండిరి. అందువలన 1832 లో లండన్ నగరమున జరిగిన సహకార కాంగ్రెసుమహాసభలో "సహకారోద్యమమున పాల్గొనువారిలో వివిధమతములకును రాజకీయకక్షలకును చెందినవారును గలరుగాన సహకారోద్యమవ్యవహారమునకు సంబంధించినంతవరకు మతభేదములును రాజకీయాభిప్రాయభేదములును ఆటంకము గలిగింపరాదు" అని యేకగ్రీవముగ తీర్మానించిరి. అభిప్రాయభేదములనెల్ల సహించి సంఘీభావముకలిగి వర్తించిననే గాని సహకారము వర్ధిల్లుట దుర్లభము కదా!

మనరాక్డేలు సంఘమునకే పెద్దగండము తప్పినది. 1850 లో 600 మందివరకు సభ్యులసంఖ్య పెరిగినది. సంఘముయొక్క పెట్టుబడి సరకును, రొక్కమును గలిసి 2299 పౌనుల 10 షిల్లింగుల 5 పెన్నీలుండెను. వారమునకు 338 పౌనుల అమ్మకము జరుగుచుండెను. ఇందువలన మన సాలెవారి యంగడి యెల్లు దినదిన ప్రవర్ధమానమైనదియు స్పష్టమగుచున్నది. ఈవస్తునిలయము స్థాపించిన ఏడేండ్లకు 1851 లో వ్రిప్రియాలులో పూర్వమువలె దినమున కొంతకాలముగాక దినమెల్ల యంగడితెరచియుంచు పద్ధతి వచ్చెను. ఇప్పటి

నుండి సభ్యులసంఖ్య వృద్ధిచెందుచుండుటయేగాక మూలధనమును అమ్మకమునుగూడ అభివృద్ధి జెందుచునేయుండెను.

ఈయభివృద్ధి సులభముగనే కలిగిన దని తలంపరాదు. క్రిజల యుద్యమమున అందు ముఖ్యముగ కార్మికులసంఘములందు కలుగు కష్టనిష్ఠురములెల్ల మన సహకారసంఘమువారనుభవింపవలసివచ్చెను. వారి వస్తునిలయమునకు కలిగిన యిక్కట్టులు, గండములు, అవియెల్లగడచి సహకారసంఘము బయటపడి జీవించిన చిత్రకథయు, సహకారసిద్ధాంతము త్వరగ నాటుకొని అభివృద్ధి జెందకపోవుటకుగల కారణములను, మఱియొక ప్రకరణమున వ్రాతము.

# రాక్డేలు సహకారోద్యమ చరిత్ర

## నాలుగవ ప్రకరణము.

సాధారణముగ కార్మికులలో మాత్రమేగాక పదుగురు కలిసి పనిచేయు చోటులందెల్ల, నొకవింత జాతిపురుషు లుందురు. వారికి అనుమానము లధికముగ నుండును. ఒకరితో కలిసిమెలసి యుండుట వీరికి తెలియదు. ఒకరిని నమ్ముటయు వీ రెఱుగరు. అది యేమిపాపమో కాని వారికి సరళముగ ధారాళముగ మాటాడుటకూడ తెలియదు. వారికి తృప్తియనునది యెన్నడు కలుగదు. వారు చూపు సారించినచో అక్కడ జరుగుచున్న చర్చలో నొక వ్యతిరేకపుభావ ముదయించిన దన్నమాటే! నోరు మెదిపినచో సవరణ నుపపాదించి రన్నమాటే! ఏవ్యవహారమందైనను అందులోని లోపములు ఉత్పాతములు మాత్రమె వీరికి కనబడును. ఏ మాటకైనను వారు విపరీతార్థములనే కల్పింతురు. వీరు ప్రతి కార్యమునకును తాముకూడ నడుముకట్టుచుందురు; కాని కబురులకు ఆక్షేపణలకు తప్ప కార్యనిర్వహణమునకు పనికి రారు. ఏమైన లోపము లున్నచో వానిని సవరించి బాగుచేయుటకు మారు వానిని బహిరంగముచేసి పాడుచేయుటయే ప్రధాన కర్తవ్యముగ జూతురు. ఏకార్యముగాని కొనసాగదనియే చాటుచు నది కర్మవశమున పాడైనచో మేము చెప్పలేదా యందురు. ఇట్టివారితో కలిసి ఏ కార్యము జేయ

వలయునన్నను కష్టమే. నిజముగ నిట్టి శల్యసారథ్యము చేయు వారితోఁ గన్న ప్రత్యక్ష శత్రువులతోఁ బెనగుట సులభము. కార్య సాధనమునకు వీరు తోడ్పడరు సరికదా అటంకములు కలిగింతు రనుటకును సందియము లేదు. అట్టితరి పదుగురు కలిసి చేసుకొన వలసిన సహకారసంఘ కార్యనిర్వాహణమునకు అభివృద్ధికి వీరివలన నెంత కీడుకలుగునో వర్ణించుటకు శక్యము కాదు. ప్రతి సంఘములోను కలుగు అంతఃకలహములకు కుట్రలకు నాశనమునకు వీరే కారకులు. ఇట్టివారని తెలియక వీరి నిజస్వభావము తెలియనివారు వీరిమాటలకు మోసపోయి సంఘమునకు చాల హాని కలిగింతురు.

ఇంగ్లీషువారికి విమర్శనదృష్టి యధికము. అధిక్షేప ణము చేయుట, సణుగుట వారి జాతిలక్షణము లని పరదేశీ యుల యభిప్రాయము. అరిషడ్వర్గముల కాలవాలములగు ప్రజాహృదయములందు సమబుద్ధి కలుగుట కష్టము. అట్టితరి ప్రపంచమున ప్రజాసభలయందు అరిషడ్వర్గములు (కామ క్రోధ, లోభ, మోహ మద మాత్సర్యములు) ఏదోరూపమున ప్రత్యక్షము లగుటలో వింతలేదు. ప్రజాస్వామికములందు కనబడు మాత్సర్యదోషము, అవిద్యాంధకారమున మునిగి తేలు కొన్నివందల కార్మికులు చేరినసంఘమున మఱియు నధికముగ కనబడుటలో నాశ్చర్యములేదు. ఇంగ్లాండు దేశ మున పార్లమెంటుసభలయందుకూడ భరతఖండమున బహి రంగసభలయందును కార్యనిర్వాహకసభలందువలెనే పరస్పర హేళనము, దూషణము, అల్లరి మున్నగు దుర్గుణములు

కనబడుచుండును. అట్టితరి కార్మికుల సహకారసంఘసభల యం దిది కలుగుటలో వింతలేదు. కాని రాక్డేలుసహకార సంఘములోని సుగుణ మేమన నితరసంస్థలందువలె అభిప్రాయభేదములు, క్రోధమాత్సర్యములు, నీ సంఘవిచ్ఛిత్తికి కారణములుగా పరిగణింపలేదు. కార్యనిర్వహణమున కాటంకమును కలుగచేయలేదు.

రాక్డేలుసంఘసభ్యులలో "బెన్" అనునాతని కనుమాన మధికము. ఏకార్యమునను నతనికి తృప్తి లేదు. ప్రతివ్యవహారము నతడసంతృప్తితోను అనుమానముతోను చూచుచు తల పంకించును. కాని పల్లెత్తి మాటాడడు. ఇట్లు రెండు సంవత్సరములు గడచెను. ఇంతలో మబ్బు విడినట్లు సంఘము యొక్క గండములు గడచెను. అంతట బెన్నగారికి అనుమానము పోవుటయు, నమ్మకము కలుగుటయుకూడ గలిగెను. తన పెట్టుబడిపైన లాభము క్రమక్రమముగా వృద్ధిజెందుట చూచి అతడు తలనాపుట మానెను. ఎట్టకేలకు మొదటి మారు లాభపుసొమ్ము అతని చేతిలోపడిన నా డతని మోము కలకలలాడెను. నోరు తెరచి మాటాడసాగెను. బెన్నవంటి మానవ్రతుడు గాక సంఘమున నింకొకమాదిరి సభ్యు డుండెను. చీటికిమాటికి నితడు తన అసహ్యవాగ్ధోరణి గనబరచును. ప్రత్యేకముగ నొక్కలోపమునైన వ్రేలుపెట్టి చూపలేకపోయినను వ్యవహారములెల్ల సక్రమముగ జరుగుచున్నవని యిత డంగీకరింపడు. కార్యనిర్వాహకసంఘసభకు వచ్చి లోపము లున్న చెప్పుడని ఆ సంఘసభ్యు లితనిని బతి

మాలిరి. ఒకమారు సంఘకార్యనిర్వాహణము నిత డెంతవరకు చక్క బెట్టునో చూతమని ఇతనిని కార్యనిర్వాహకసంఘ సభ్యునిగ నెన్నుకొనిరి. కాని మొఱుగనేర్చిన కుక్క కఱవ నేర దను సామెత ప్రకార మితఁడు వాక్చూరుఁడేగాని కార్యశూరుడు గాకపోవుటవలన లాభము లేకపోయెను. అతని పీనులు కన్నులుకూడ వక్రగతిని వర్తించు చుండెనో ఏమో కాని అతడు తిన్నగ వినడు, చూడడు. అట్లు విని, చూచి తన అనుమానము తీర్చుకొనుటకై పని తం డంగీకరింపడు. వంక బెట్టుట కేదో యొక సాకున్నగదా? అట్టి నెపమే తీరిపోయిన కలహశీనునకు అశన మెక్కడిది? ఎట్టకేల కీ పురుషుని నిమర్శలు, సణుగులు సంతరించుగాలము వచ్చెను. సంఘము మభివృద్ధి జెంది లాభము చేతిలో పడగనే నితని నోరు మూత పడెను.

ఈ సహకారసంఘవస్తునిలయమువలన సభ్యులకు జ్ఞానాభివృద్ధికూడ గలుగుట కవకాశము కలిగెను. తమ తమ పనులజేసికొనివచ్చి సాయంకాల మచ్చటజేరి సంఘసభ్యులు రాజకీయమతసాంఘికవ్యవహారములను గూర్చి స్వేచ్ఛగ ముచ్చటించుకొనసాగిరి. వ్యాపారము చక్కగ చేసికొనుపద్ధతులును, కార్మికుల కలవడసాగెను. కార్యనిర్వాహకసంఘ వ్యవహారములను బహిరంగముగ జరుపుచున్నందునను, ఎల్లరు నచ్చటికి పోయి స్వయముగ చూడగలుగుచున్నందునను ఎవ్వరికి నెట్టి అనుమానమునకు కారణము లేకుండెను. ఈ వస్తునిలయమున వస్తువులను కొనుటకుమాత్రమే గాక వస్తు

వులు విక్రయించుటలోకూడ తన కధికారముగలదని ప్రతి సభ్యుడును గ్రహించి గర్వమందెను. అయినను సంఘవ్యవహారములెల్లను అవరోధము లేకుండగ జరుగుచుండినవని తలంపరాదు. అజ్ఞానమువలనను అనుభవములేమివలనను అంతకన్నను ముఖ్యముగ బీదవారికుండు ఇతరములగు లోపములవలనను కొన్ని చిక్కులు కలుగుచునే యుండెను. స్వల్పపు పెట్టుబడితో సరకులను కొనునప్పుడు చౌకగ లభింప వని యిదివరకే చూచియుంటిమి. చిన్న అంగడిలో సరకు అంతబాగుండకపోవుటయు కొంత ప్రియముగ నుండుటగూడకద్దు. ఇది బీదవారి కెంత ఆశాభంగమును ఉత్సాహభంగమును కలిగించునో చెప్పనక్కరలేదు. వారికి ప్రతిష్ఠయు కష్టార్జితమగుట దానివిలువ తెలియును. ఒక్క అణా అధికముగ వ్యయము చేయవలసివచ్చిన అనవసరమగు సుంకము తగులుబాటు అయినట్లు తలంచుచుందురు. కొన్నాళ్ళ కా అణా వడ్డీతోకూడ తిరిగివచ్చునన్నను వారికి రుచింపదు. అరు వారు కన్న రొక్కము మూడు మేలని వా రెంచుదురు. అందువలన వారికి సేవచేయవలయునన్నచో వారికి నచ్చచెప్పి జ్ఞానాభివృద్ధి చేయవలయును. ఇట్లుచేయుటకు వలసిన సాధనసంపత్తి తక్కువగ నుండెనేని కార్యసాధన మఱియు కష్టసాధ్యము. తన అంగడిలో తాను కొనునప్పుడు ధరలమాట తలంపనేల యని యందురేమో? అజ్ఞానపుమడిలో ఫలితార్థవివేచన ముదయించుట యెంత దుర్లభము! బీదవారికి దూరదృష్టి యుండుట అరుదు.

టోక్లేనులోని పెద్ద అంగళ్లముందు మన చిన్న యంగడి నేతగాండ్రుస్త్రీలకన్నల కాగలేదు. కొందఱు పురుషులకుకూడ ఈ యభిప్రాయము కలిగెను. కాని మెల్లమెల్లగ నీయంగడి తమదే యను భావము వృద్ధిజెంది ఇందు రొక్కమిచ్చి కొనుటలోనుండు గౌరవమును వారికి తెలిసి సరిపుచ్చుకొనిరి. ఈ వస్తునిలయమున నొక డొక వస్తువును కొన్నచో అది తనతోడిపనివాడే చేసెననియు దాని క్రయధన మతనికి జీవనాధారమనియు, ఇచ్చట కొనుటవలన తనతోడివారికిని తనకును శ్రేయస్కరమనియు గ్రహింప గలుగు శక్తి సామాన్యకార్మికుల కెల్లప్పుడు నుండదు. వస్తువుల లోపము లెంచువారును బేరములాడువారును, వస్తునిలయము కన్న చౌకగ నమ్మువారు సరకులో నెట్టి కృత్రిమములు చేయుచున్నారో గమనించి బుద్ధితెచ్చుకొనరు.

మానవుల కావశ్యకములగు ఆహారపదార్థములును వస్త్రములును విక్రయించు చిన్నఅంగళ్లు లంకాషైరుజిల్లాలో ఆకాలమున లెక్కకు మీరియుండెను. అందరువు బేరమే యధికముగ నుండెను. ప్రతిఅంగడివాడును నొక తలపీఠీ పుస్తకమున తన కాతాదారులచేత సరకుల పద్దులను వ్రాయించి వారమునకో పక్షమునకో వారికి కూలివచ్చినరోజున వారిచ్చు జమలు పోను వెరసికట్టి వ్రాయించి బాకీని తేల్చుచుండును. ఈ కాతాబాకీ తీరుట యనునది లేదు. వర్తకము పడిపోయి నపుడు ఋణము లత్యధికముగ పెరిగిపోవును. కూలివానికి పనియేపోవుట తటస్థించెనేని యీ అంగడివాని బాకీని తీర్చి

మరియు నింకొక అంగడిలో కాతా పెట్టుకొనవలెను. లేనిచో ఎంతదూరమైన నీ యంగడికే సరకులకొరకు రావలయును. అందువలన ప్రోత్సాహకారులు సరలి మన వస్తునిలయమున రొక్కమిచ్చి సరకులు కొనుట వీరవారి కంటె సులభసాధ్యము కాకుండెను.

ఆ కాలముననే స్థాపింపబడిన "ఫర్గస్ ఓకానర్ ల్యాండుకంపెని" అను సహకారసంఘ మొకటి యుండెను. అది భూములకు సంబంధించినది. మన సంఘమున వాటాదారులుగ నుండిన వారిలో చాలమంది దానిలో వాటాలు కొనినవారే. అందు వాటాలు కొనుట మంచిదని చాల మంది తలచి వాటాదారులుగ నుండిరి. ఆ కారణమువలన మన సంఘమునందలి సభ్యులసంఖ్య త్వరితముగ పెరుగ కుండెను.

ఇంగ్లాండులో గవర్నమెంటువారు చేసిన జాతీయ ఋణముపైన వచ్చు వడ్డీవలన పలువురు బాగుపడుటయు దాని భారము బీదలగు కూలివారిపైన బడుటయు వర్తక సంస్థల వాటాల నమ్ముకొనుచు లాభము తీయు పద్ధతి హెచ్చుటవలన సులభముగ ధనికులగుటయు దివాలాలు తీయుటయు ఆ కాలమునాటి సత్పురుషులయందు విపరీత భావములను కలిగించెను. వడ్డీలను పుచ్చుకొనుట యన్యాయ విత్తసమార్జన మగునను విపరీతాభిప్రాయములు కలుగుటయు వడ్డీ లేకుండగ ధనము సమకూర్చుట కష్టతర మగుట వలనను మూలధనముచేకూరక అనేక సహకార సంస్థలు నశిం

చెను. వడ్డీకాసులు దొరకునను నాసయే లేనిచో ప్రపంచము నందలి మానవులు తా మనుభవింపక ఎంతో కష్టపడి ధనము నేల సంపాదించి యుంచుదురు? అట్లు సమకూర్చనిచో ప్రపంచమున మూలధన మెచ్చట లభించును? సహకార మభివృద్ధి చెందకపోవుట కిదియొక కారణము.

ఇది యొక రాజకీయ విప్లవసిద్ధాంత మని ప్రభుత్వముల వలన ననుమానింపబడి, ధనవంతులకు నష్టము కలిగించుటకు వచ్చిన ఆర్థికసిద్ధాంతమని ధనికులచే ననుమానింపబడి, రాజనీతిజ్ఞులచేత, అర్థశాస్త్రజ్ఞులచేత, మతాచారులచేత మన్నన నందక ఎన్నో ఆటంకములమధ్య సహకారము వర్ధిల్ల వలసి యుండెను. ఎన్నో చిక్కులు కలుగుచున్నను పరిశ్రమల యందును వాణిజ్యమందును సహకారము మెల్లగ ప్రవేశించి అభివృద్ధి జెందసాగెను. మీపరిశ్రమలను యంత్రములవలన చేయవచ్చునని చెప్పి చేతిపనులు చేయువారిచే యంత్రముల నుపయోగింపజేయుట యెంతకష్టమో పోటీల కలవాటుపడిన వర్తకులను పోటీలపద్ధతికి వ్యతిరేకమగు సహకారపద్ధతి కంగీకరింపుడని చెప్పి ఆచరింప జేయుటయు అంతే కష్టమే. ఈ రెంటివలన తుదకు మేలుకలుగుట నిశ్చయమే యైనను సనాతనాచారములను విడనాడజేయుట కష్టసాధ్యము.

అదృష్టవశమున వర్తకుల పోటీవలనగాని వర్తకుల యోర్వలేమివలనగాని రాక్డేలు వస్తునిలయమునకు ఎక్కువ నష్టము కలుగలేదు. దీనికి కారణము లేకపోలేదు. మొదటి మూడు సంవత్సరములలో బాల్యావస్థయందుండిన వస్తునిల

యము వర్తకుల కంతనష్టము కలిగింపనందున వారి అసూయకును పాల్పడలేదు. తరువాత వస్తునిలయ మభివృద్ధి జెందుటవలన సాధారణవర్తకుల చిన్నయంగళ్ళకు లాభము తగ్గసాగెను. మఱియు కొన్ని అంగళ్లు మూయవలసివచ్చెను. కాని వస్తునిలయముపైన పోటీకొఱకు వర్తకులు కొందఱు ధరలుతగ్గించినను మనవస్తునిలయము తనధరలు తగ్గించక ఒకేధర కమ్ముచుండినందువలనను ఇతరవర్తకులు వస్తునిలయమువారిని, వారిదగ్గర సరకులు కొనువారిని హేళనచేసినను సరకుగొనక వారి పోటీపద్ధతులకు వర్తకమునందలి దుర్మార్గములకు లోబడకపోవుటవలనను క్రమక్రమముగ ఇతరవర్తకు లసూయపడుట మానిరి. వస్తునిలయము ఎల్లప్పుడు దామాషాగా నొకే ధరల కమ్ముచు న్యాయముగు వ్యాపారము చేయుచు నితరుల జోలికి పోకుండెను. అట్లని మన వస్తునిలయమువారు లాభము లేకుండ విక్రయించినవారు కారు. జాగ్రత్తకొఱకు న్యాయము కొఱకుగూడ కొంతలాభమునకే సరకుల నమ్మవలెనని సహకారుల వాదన. ఏలన పైకి పంచదారను తక్కువధర కమ్ముచున్నట్లు నటించినచో నింకొక వస్తువులో ఆతేడా లాభము తీయవలసియుండునుగదా! "ఇతరుల పోటీకి నిలుచుటకు అట్లు చేసి మోసముచేయుట మా కిష్టములేదు. న్యాయముగనే కొంచె మధికధరలకే విక్రయింతుము." అని సహకారసంఘ సభ్యులనిరి.

వర్తకులవలెనే పారిశ్రామికులుకూడ మొదట సహకార వస్తునిలయముపట్ల విరోధభావము వహించిరి. తమ కా

ర్మికుల పద్ధతులవలన పాడగుదురను భావము వారికి మొదట కలిగెనుగాని ఈయభిప్రాయము మెల్లగ నశించెను. మొదటి దినములలో నొక యజమానికింద పనిచేయువా డొక డీ వస్తునిలయమున చేరినందున వానిని పనిమాన్పించు డని కొందరు వాని యజమానుని కోరగ వా డేమి తప్పుచేసి నాడు? నే నట్లు చేయనని యత డనెను. ఈ సహకారవస్తు నిలయమున చేరినవారిలో వివిధవృత్తులవా రుండిరి. అందు చాల గౌరవపాత్రులు నుండిరి. పట్టణమున నానా భాగము లందు నీసభ్యు లుండినందువలనను వారికి మంచి పలుకుబడి యుండినందునను సహకారసంఘము మెల్లగ అభివృద్ధి జెంద సాగెను.

మొదటి మూడు సంవత్సరములలో సహకారసంఘ మంత త్వరగా అభివృద్ధి చెందకపోవుట కొక కారణము, కార్మికుల స్థితిగతులను బాగుచేయుటకొరకు స్థాపింపబడిన సంస్థలందు కార్మికులకే తగినంత దృఢవిశ్వాసము లేకపోవుట. మఱియొక కారణము, ఇదివరకు రాక్డేలులో స్థాపింపబడిన సహకార సంస్థల వలన వాని స్థాపకులకు కలిగిన కష్టములు నష్టములు పలువురు కన్నులారగాంచియుండుట. ఇందువలన చాలమందికి ధైర్యము లేకుండెను. చాలమందికి క్రొత్తసంస్థలను స్థాపించుటకు ధైర్యము చాలదు. అరువు పద్ధతివలననే ప్రాతసంఘములెల్ల పాడైన సంగతి పలువురు గమనింపనైరి. ఇది బాగుగ గుర్తెఱుగక పార్లమెంటు సభ్యులుకూడ సహకారమే లోపభూయిష్ఠ మగు సిద్ధాంత మని దూషించుచుండిరి.

అందువలన మన సహకారులను గూర్చి పలువురు పలువిధములుగ దలంపసాగిరి, కొందరు వీరు విప్లవకారులనిరి. కొందరు వీరిని పిచ్చివారనిరి. మెల్ల మెల్లగ లాభములు వచ్చుచు ఎక్కడనో మూలమూలనున్న సహకార సంఘసభ్యులు బాగుపడుటయు ఎల్లప్పుడును సాహుకారుకు బాకీపడి మొగము వ్రేలవేయు సాలెవాళ్ళ చేతులందు ధనము గలగల లాడుటయు చూచి కొన్నాళ్ళకు కార్మికులును పారిశ్రామికులును ఇతర విమర్శకులును కూడ సహకార సిద్ధాంతముయొక్క మంచిని గ్రహింపసాగిరి. అంతట ఆనుమానములో మునిగినవారును ఆక్షేపణల జేయువారును కూడ ఇది మంచిదేయని మేము చెప్పలేదటయ్యా అనసాగిరి. రాక్డేలు పయినీర్ల మార్గమున ఇతరులు సంచరింపవచ్చునని ఎలరును దలంపసాగిరి.

# రాక్డేలు సహకారోద్యమ చరిత్ర.

## ఐదవ ప్రకరణము.

ఇక్విటబుల్ పయొనీర్లు సంఘము ఏడు శాఖలుగ వ్యాపారము చేయసాగెను. కిరాణా వ్యాపారము (Grocery) బట్టల వ్యాపారము (Drapery) కసాయిదుకాణము, జోళ్లు, డొక్కాలు, అనగా పట్టణములోను బండలోను తిరుగు స్త్రీలు ధరించు కర్రిచెప్పులు చేయుట, కుట్టుపని, టోకువర్తకము ఒక్కొక్క వ్యాపారమున కొక్కొక ప్రత్యేకపు దుకాణము ప్రత్యేక జమాఖర్చు లుండెను. మూడు నెలల కొకమారు ఈ వ్యాపారముయొక్క అన్ని దస్త్రముల జమాఖర్చులు సరి చూచుకొనబడి బేరీజు వేయబడుచుండెను. ఇందువలన వ్యాపారస్థితిగతులు బాగుగా తెలియుచుండెను. 1844 లో కిరాణా వ్యాపారము ప్రారంభమై నడిచిన కథ చూచితిమి. 1847 లో చిన్నబట్టలవ్యాపారము ప్రారంభింపబడెను. 1854 లో నది యొక ప్రత్యేకశాఖ యయ్యెను. 1846 లో కసాయి వ్యాపారము నారంభించిరి. ఊరిలోనే మాంసము గొనివచ్చి యమ్మసాగిరి. కొన్నాళ్ళకు వర్తకము నాపి 1850 లో నొక కసాయిదుకాణమును స్థాపించిరి. ఆ దుకాణములో ముగ్గురు పని చేయసాగిరి. వ్యాపారమునకు 3 ఎడ్లను 8 గొర్రెలను ఇంక నితరజీవములను స్వయముగ కొని వధించి 130 పౌనుల విలువగల మాంసమును విక్రయింపసాగిరి. 1852 లో

జోళ్ళ వ్యాపారము నారంభించిరి. ముగ్గురు పనివాండ్రు ఒక పిల్లవాడు పనిచేయుదురు. కొయ్యజోళ్ల వ్యాపారము కుట్టుపని యీ సంవత్సరముననే ప్రారంభింపబడెను.

టోకువ్యాపారపు దుకాణము 1855 లో స్థాపింపబడెను. సంఘసభ్యులకు హెచ్చుసరకు గావలసినచో సరఫరా చేయుటకును లంకాషైరు యార్కుషైరు సహకార సంఘములవారికి మంచి సరకులు చౌకగా కొనిపెట్టి సహాయము చేయుటకు నిది స్థాపింపబడెను. ఆ సహకార సంఘముల మూలధనము స్వల్పమే యైనందున మంచి మచ్చుల దొడ్లకు పోయి సరకును కొనుటకును బజారు వ్యాపారము బాగుగ నెఱిగి, ఏయేసరకు నెప్పు డెక్కడ కొనవలయునో తెలిసిన ఉద్యోగిని నియమించుటకును అవకాశము లేకుండెను. సరకుల నాణ్యము, స్వచ్ఛత, క్రమధర, తూనికలకు టోకు వ్యాపారశాఖ పూచీకలిగి యుండును. అయితే రొక్కబేరమే గాని అరువుబేరము చేయరు. టోకు వ్యాపారశాఖకు రాక్డేలు సంఘమువారు ప్రత్యేక నిబంధనలను జేసికొనిరి. అందులో కొన్నిటిని చూతము. చాల సరకు గొనదలచిన సంఘసభ్యులకు సరకులు సరఫరా చేయుటయే టోకు దుకాణముయొక్క ఉద్దేశము. డైరెక్టర్ల ఉపసంఘము వారీశాఖ కొసగు మూలధనముపైన సాలుకు నూటికైదు వంతున వడ్డీ యిచ్చుకొనవలెను. ఈ శాఖ సర్వహణమునకును వడ్డీకిని ఇతరవ్యయములకు నగు ఖర్చులు పోను మిగతా లాభము మూడు నెలల కొకసారి మూడు భాగములుగ విభ

జింపబడవలెను. అందొకభాగము వ్యాపారమున నెప్పుడయి నను కలుగబోవు నష్టముక్రింద నుపయోగించుటకు ప్రత్యేకింప వలెను. స్థిరముగ నుండవలసిన సరకుల మొత్తము విలువకు సరిసమానమగు వరకు నా భాగ మట్లు ప్రత్యేకింపవలయును. మిగతా రెండుభాగములును ఆశాఖలో సభ్యులు చేసిన వాడకమునకు అనుగుణ్యముగా సభ్యులకు పంచిపెట్టవలెను. **1854** లో లంకాషైరు యార్కుషైరులలోని సహకారసంఘ ములవారు తాము కొనుచున్న సరకులను తయారు సరకులను సమష్టిగా ఖరీదుచేయు విషయమై లీడ్సులో నాలోచించిరి. మరుసటివత్సరములో రాక్డేలులో నొకకార్యాలోచన సభ జరిగెను. దానికి వలసిన మూలధనము నెవరు సమకూర్తురని యోజించిరి. కొన్నిసంఘములు కొంతపైక మిచ్చెదమనెను. కొన్ని అసమర్థము లయ్యెను. రాక్డేలువారు నూటికైదువంతున వడ్డీపుచ్చుకొను పద్ధతిని మూలధనము నొసగుట కంగీకరించిరి. రాక్డేలువా రారంభించిన వ్యాపారములెల్ల జయప్రదములుగ కొనసాగునను ప్రఖ్యాతి యుండినందున మరికొన్ని సహకారవస్తునిలయములవారును కొంత మూలధనము నొసగిరి. ఈ వ్యాపారమున కొన్నియభిప్రాయభేదములు రాకపోలేదు. మూలధనములో చాల మటుకు రాక్డేలువా రిచ్చినందున లాభములో చాలవరకు వారే తీసికొనుట కర్హులని కొందరు తలంచిరి. వారికి వడ్డీపుచ్చుకొను నధికారమేగాని ఇతరవస్తునిలయములవారి వ్యాపారమువలన వచ్చినలాభమున పాల్గొనుటకు వారికి హక్కు

తే దనిరి. రాక్డేలుసంఘమువారు తమవర్తకమును ఇతరవస్తు నిలయముల వర్తకమును కలిపి ఈటోకువ్యాపారశాఖను నిర్వహించిరి. తక్కిన వస్తునిలయములు కొనుసరకులపైన స్వల్ప లాభము మాత్రమే వచ్చుచుండెను. రాక్డేలువస్తునిలయ మనేకసరకులు కొని విరివియగువర్తకము చేయుచున్నందున దీని కధికలాభము వచ్చుచుండెను. వ్యాపారము సాగునో సాగదో యను ననుమానము, భయము, కలసమయమున సొమ్ము పెట్టుబడి పెట్టి టోకువ్యాపార నిర్వాహణమున పాల్గొనినది. 1856 ప్రారంభమున పంచదార, మరబత్తులు, సబ్బులు, (Treacle) హెచ్చుధరలలో కొనిరి. ఆ సరకులు అమ్మునాటికి ధరలుపడిపోయెను. 495 పౌనుల 10 షిల్లింగుల 4 పెన్నీలు నష్టము వచ్చెను. ఈ వ్యాపారమును కట్టిపెట్టు డని ఇతరవస్తు నిలయములసభ్యు లనిరి. కాని ఈశాఖ పార్లమెంటువారి చట్టము ప్రకారము స్థాపింపబడినందున నిబంధనలు మార్పు చేయకుండగా నీశాఖను రద్దుచేయుటకు వీలులేనందునను, నిబంధనలను రద్దుచేయుటకు సంఘములకు ప్రత్యేకసమావేశమున 3/4 వంతుల సభ్యులు సమ్మతి నొసగవలసియున్నందున నిది జరుగలేదు. ఈ శాఖపై నిష్టము లేకపోయినవారేమియు జేయజాలక పోయిరి. 1857 సంవత్సరము నాటికి పైన చెప్పబడిన నష్టము పౌ॥ 141 - 14 - 1 లకు తగ్గుముఖములోనికి వచ్చెను. వ్యాపారము సాగుచుండెను. నిజముగా టోకువ్యాపారశాఖ ఉపయుక్తమైనది. వస్తు నిలయములకు చాల ముఖ్యమైన ఉద్యోగి వస్తువులను ఖరీదు

చేయు క్రియకుడు (Purchaser) ఎంత మంచివాడైనను నమ్మకము గలవాడైనను బజారుపద్ధతులు, సుళువులు, ధరలు, కాలమానములు తెలియని క్రియకుడు వ్యాపారమునకు నష్టకారకుడగును. నేర్పరియగు 'క్రియకు' ని నియోగించ గలుగుశక్తి చిన్నవస్తునిలయముల కుండదు. ఇట్టి టోకు వ్యాపారశాఖ మంచి క్రియకుని నియమించుకొన గలుగును. చాల దూరమున వసించు సంఘసభ్యులు వస్తునిలయముననే తమకు గావలసినసరకుల గొనుటకు ప్రయత్నించి వక్షమున కొకమారు కొని తీసికొనిపోవుచుండిరి. మరికొందరు కలిసి ఒక బండివానిని మాట్లాడుకొని సరకులను తీసికొని పోవుచుండిరి. ఈబాధల జూచి రాక్డేలుసంఘమువారి కేంద్రవస్తునిలయమునకు శాఖలుగా బ్రాంచి దుకాణములను కొన్నిటిని నెలకొల్పిరి. 1856 లో ఓల్డుహాంరోడ్డులో మొకటి బ్రాంచిని స్థాపించిరి. కేంద్రవస్తునిలయమున కిది యొక మైలుదూరము. 1857 లో కాసిల్టను బ్రాంచిని విటువర్థురోడ్డు బ్రాంచిని పిర్‌ఫోల్డుబ్రాంచిని స్థాపించిరి.

టోడ్లేనువీథిలోని భవనము నంతటిని రాక్డేలుసంఘము 1849 లో అద్దెకు పుచ్చుకొనె నని చెప్పియుంటిమి. 1853 లో టోడ్లేనుకు ఎదురుగానున్న మరియొకయింటిని 745 పౌనులకు గొని పిండి, మాంసము, బంగాళాదుంపలు మున్నగు చిల్లర సరకుల నచ్చట విక్రయింప సాగిరి. సంఘమువారి కార్యాలయము సభాభవనము నా గృహముననే యుంచిరి. క్యాలికో, మేజోళ్ళు, బనియనులు మున్నగు వానికని

జోళ్ళకును ప్రత్యేకపు గృహము లద్దెకు యిచ్చుకొనిరి. జోళ్లు కుట్టువారును బట్టలు కుట్టువారును ఆరోగ్యకరము లగు పరిస్థితులలో తమతమ పనులు చేయుదురు. రాత్రిళ్లు అంగళ్లనిండ కొనువారు వచ్చిపడుదురు. అంగళ్లు కలకల లాడుచుండును. 1834 మొదలు సంఘమువా రొక వార్షికపత్రికను ప్రకటించి తమ వ్యవహారముల పరిస్థితులనుగూర్చి నివేదింపసాగిరి.

1855 లో ఒకచట్టముక్రింద, (Industrial Provident Societies Act) నూలు, ఉన్ని, చేతిపనులను వ్యాపారమును సహకార పద్ధతిపైన చేసికొనుట కొక ఉత్పత్తిసంఘమును నిర్మించిరి. 4000 పౌనుల పెట్టుబడితో నీయుత్పత్తిసంఘ మారంభ మయ్యెను. ఇందు 2042 పౌనులు రాక్డేలుసంఘమువా రిచ్చిరి. ఉత్పత్తిసంఘమున 96 యంత్రపుమగ్గములు (Power Looms) 26 గురు పురుషులు, 7 గురు స్త్రీలు 4 గురు పిల్లవాండ్రు, 5 గురు ఆడపిల్లలును పనులు చేయుచుందురు.

రాక్డేలు వస్తునిలయమువారు 1854 లో ప్రకటించిన వార్షికనివేదిక చాల మనోహరముగ నుండెను. సహకారపద్ధతియొక్క ప్రాశస్త్యమును ప్రజలకు బోధింపగలుగు సంగతులన్నియు దానిలో వ్రాయబడెను. మఱియు వస్తునిలయమును గూర్చిన విశేషములును కలవు.

సాయంకాలము ఏడుగంటలకు అంగడిలో అయిదుగురు విక్రయదార్లు అయిదుచోట్ల నిలిచి చాల చురుకుగా వివిధ వస్తువులు విక్రయింపసాగెదరు. కొందరు సరకులు

తూచుచుందురు ఇద్దరు యువకులు సామానులు తూచుచు అయిపోయినసరకులు మరల తెచ్చి నింపుచుందురు. సరకుల కొరకు సంఘసభ్యులభార్యలు పిల్లలు బిలబిలలాడుచు వచ్చె దరు. కొందరు పుచ్చుకొనుచుండగా కొందరు వేచియుం దురు. వీధికి రెండవప్రక్కన అంగడికి సంబంధించిన బట్టల యంగడి యున్నది అక్కడ ముగ్గురు బట్ట లమ్ముచుందురు. తొమ్మిది పదిమంది- ముఖ్యముగా స్త్రీలే- రకరకముల బట్ట లను ఏరుకొనుచుందురు. ఆ యంగడికి దగ్గరగా ఆ ప్రక్కనే పెద్ద దుకాణము కలదు. దానిలో కసాయిదుకాణము కూడ కలదు. అక్కడ మాంసము విక్రయించుచుందురు. పంద్రెండు పదునైదుమంది మాంసముకొరకు వచ్చియుందురు. పిండి, బంగాళాదుంపలు, వెన్నయున్నగు వానిని కొనుటకు వచ్చినవారి కిరువురుద్యోగులు వాని నందించుచుందురు. ఈ దుకాణమునకు ప్రక్కగా జోళ్ళు కుట్టువారు కొయ్య జోళ్ళనుజేయువారు, కుట్టుపనివారు, పనిచేయుచుందురు. కార్యాలయములో సంఘసభ్యుల కాతాలను చూచుచు, తక్కిన పని చేయుచు సంఘముయొక్క గుమాస్తా పనిచేయు చుండును. పచారీసరకు లమ్మదుకాణముపైనున్న యంత స్తులో పఠనమందిరము కలదు. దానిలో ఇరువది మందికి పైగా యువకులు వార్తాపత్రికలను మాసపత్రికలను చదువు చున్నారు. దీని ప్రక్కన గడియారముల దుకాణములో ఏబదియొనిమిదిమంది చందాదారులు తమ చందాల నిచ్చి ఈ వారము లాటరీలో గడియార మెవరికి వచ్చునో యని కుతూ

హాలముతో వేచియున్నారు. పుస్తకభాండాగారము తెరచియే యున్నది. భాండాగారి త్వరితముగా పుస్తకము లిచ్చుచు పుచ్చుకొనుచు చాలా పనిగా నున్నాడు. అక్కడ కూడ సభ్యులు, పిల్లలు, భార్యలు నున్నారు. ఈ సంఘ కార్యాలయము లన్నియు రాత్రి పదిగంటలకు మూసివేయుదురు. ఈ రోజుకు 420 నవరసుల విలువ వ్యాపారము జరిగినది. భాండాగారి 200 పుస్తకము లింద్ల కెరువిచ్చినాడు. రాష్ట్రేలుకు దగ్గరనున్న తాలూకాలలో నీ సంఘమున కిప్పుడు నాలుగు శాఖ లున్నవి. అక్కడ కూడా ఈ పద్ధతుల పైననే వ్యాపారము జరుగుచున్నది.

వస్తువు లమ్మువారు కొనువారు భాతృభావముతో నమ్మకముతో కలిసి మెలసి సమష్టిగా లాభము ననుభవించు నీ విధానమునందలి ప్రాశస్త్యమే, ఇందు గమనింపదగిన ముఖ్యవిషయము. శుచిశుభ్రతలు లేని ఆహారపదార్థములే గతియగుటకు, తొడుగుకొనే పాదరక్షలు నెలరోజులలోనే అరిగి పోవుటకు, చొక్కాలు రవికెలు చినిగిపోవుటకు, అలవాటు పడిన దురదృష్టవంతులు బీదలు నగుపనివాండ్ర జనసమూహములు, లక్షాధకారులవలె బజారుచేసి కొనగలుగుటయు పరిశుభ్రతకు సంబంధించినంతవరకు ప్రభువులవలెనే ఆహారపదార్థములు సంపాదించుకొనగలుగుటయు మహాభాగ్యముకదా! వీరికి కావలసిన పదార్థము లెల్ల తమయంగడిలోనే తయారు చేసికొనగలిగి వాని ప్రాశస్త్యమందేమి, ధరలయందేమి మోసము, నష్టము లేకుండగ జేసికొనిరి. పూర్వపు బజారు

పోటీలలో నిట్టిలాభము వీరికెన్నడు లభించినది? ఇందువలన నైతికముగాకూడ వీరికి లాభము కలుగుటలో నాశ్చర్యమేమి? ఈ వస్తువిక్రియశాల వచ్చినపిదప రాక్డేలులో చాలమంది త్రాగుడు మానిరి. నలుబదేండ్లనుండి ఋణములో మునిగిన సంసారులు బయటపడి జేబులో నాల్గుసూకలు గలగలలాడించుకొనగలిగిరి. తమసొంతయంగడిలో ప్రతిహారము రొక్కమిచ్చి సరకులు కొనగలిగిరి. అచ్చట అనుమానము లేదు. మోసములేదు. కల్తీ లేదు. బేరము లేదు. సర్వత్ర నమ్మకము, న్యాయము. అచ్చట విక్రయించునుద్యోగులు గడబిడచేయరు; హస్తలాఘవము జూపరు; సరకులనుగూర్చి పొగడరు. వారు తాము చేయవలసినకార్యము చక్కగా నిర్వహింతురు. సరియైన పరిమాణము, సరియైనతూనిక, పరిశుభ్రమైన సరకు నిచ్చెదరు. పోటీలో మునిగిన తక్కిన దుకాణములదగ్గర నెన్నినీతులు బోధించిన నీ నీతి యలవడదు.

ఈ వస్తు విక్రయశాలకు ఋణము చేయవలసిన అగత్యములేనందున నష్టము నొందవలసిన ఆవశ్యకతయులేదు. ఈ పదమూడేండ్లలో దీనిఆదాయము 303852 నవరసులు. ఒక్క వ్యాజ్యమైనను లేదు! బజారునుండి సరకులను తెచ్చుటకు పిల్లలనంపినచో అంగడివాండ్రు మోసగింతురని సాధారణముగా బజారుకు పిల్లలను పంపరు. పంపినను 'చూడు! అబ్బాయీ, నెరసిన మీసాలయతడున్నాడే ఆ దుకాణము దగ్గరకు పోయి కొను' మని యనేక ఆనవాళ్ళు చెప్పి పంపుదురు కదా! ఈవస్తువిక్రియశాలకు నిర్భయముగా పిల్లలను పంపుదురు. ఫలానా

వాని దగ్గరకు బొమ్మని గుర్తులు కూడా చెప్పరు. ఏలన అందరును నెరసిన మీసాలవారే; అందరును సరిమైనవారే.

మొదట చాల కొద్దిమంది సభ్యులున్నరోజులలో అంగడిలోనే సభ్యులు సమావేశమగుచుండిరిగాని వారి సంఖ్య పదునెనిమిదివందల మందికి పెరిగిన పిదప పెద్ద భవనములో మహాసభలు చేయవలసి వచ్చెను. అయినను సభ్యులలో సమానత్వము, వాక్స్వాతంత్ర్యము మాత్రము మారలేదు. ఇట్లు ప్రతివారము సమావేశమగుచుండుటవలన పనివాండ్రలో సోదరభావము సహాకారభావము వృద్ధియయ్యెను.

ఎంతయభివృద్ధి గాంచినను ఈ సంఘముయొక్క కార్య నిర్వాహకులు పదమూడేండ్ల క్రిందటివలెనే నిరాడంబరులు నిగర్వులునై నూనెమరకలతో పిండిధూళితో ఉన్న చొక్కాయ టోపీలతో మీరింతటివారా యని పరులకు తోచనట్లు ప్రవర్తించుచుండిరి! 1857 లో 1850 సభ్యులు, పౌ 15142 షి 1 పె 2 మూలధనము, వారమునకు 1491 పౌనుల ఆదాయము, సాలుకు పౌ 5470షి 6 పె 8½ లాభము ఉండెనన్నచో నీ వస్తునిలయముస్థితి తెలియగలదు.

ఈ పదమూడేండ్లలో మొత్తము లాభము.

పౌ 19888 షి 16 పె 11½ లు.

## రాక్డేలు సహకారోద్యమము

### ఆరవ ప్రకరణము.

కార్మికజనులకు వస్తువిక్రయశాలపైన గురి కలిగెను. గిట్టనివా రెన్ని చెప్పినను వారు దానిని వదలలేదు. ఒకషిల్లింగు పెట్టుబడిపెట్టినవారి కేబదిపౌనుల మూలధన ముండుటయు ఋణబాధ తప్పుటయు తమకష్టకాలములో నది తమయాపద గడవబెట్టుటయు దానిలాభము వారికి బాగుగా తెలియవచ్చెను. తుదకు దూరములెక్క సేయక పిల్లలుకూడా ఈయంగడికే వచ్చి సరకులు కొనసాగిరి. కాలముగడచిన కొలదియు దీనివలని లాభము మరిమరి బాగుగ నాటుచుండెను.

ఇతర సంఘములో స్త్రీలను చేర్చుకొనకపోగా నీ రాక్డేలు సంఘములో స్త్రీలనుగూడ చేర్చుకొన సాగిరి. అందువలన స్త్రీస్వాతంత్ర్యమున కిది పునాదియయ్యెను. మగడు త్రాగుబోతైనచో పెండ్లా మీ సంఘమున కొంతసొమ్ము దాపరికము చేసి కుటుంబపోషణము చేయవచ్చును. ఈసొమ్ము కదలించుటకు మగనికి వీలుండదు. మొదట మగనికి కష్టమనిపించినను దిమ్మతిరిగిన పిదప బుద్ధి తెచ్చుకొని బాగుపడును. సంసారము కష్టములోనికి దిగకమునుపు కొంత ఆదాయము చేకూర్చుకొనదలచిన స్త్రీపురుషుల కిది యొక పెన్నిధిగానుండెను.

నిజముగా సంసారము గడుపుకొనుట యొక గొప్పవిద్య యని చెప్పవచ్చును. స్త్రీయొక్క తెలివితక్కువవలన అశ్రద్ధ

వలన ఎన్ని సంసారములైన కూలిపోవును. ఉన్న దానిలో గడుపు కొను తెలివితో జన్మించినయువతియు నీ తెలివి నేర్చుకొనిన యామెయు సంఘమున వారమున కొక పౌనుతో కాలక్షేపము చేయును. ఇది లేనియామె ఇరువదిపౌనులున్నను అప్పులోనే పడును. ఒకబీదసంసారి కష్టపడి తన తెలివి తక్కువ యిల్లాలి కొక వారము వేతనమును ముందుగా చేతులో పెట్టెనను కొనుడు. ఏమిజరుగును? మరుసటివారముకూడా ఆమె పుట్టెడప్పులోనే యుండును. ఏమిదియని యాతడనగా "ఏమిచేయమనెదరు? కుర్ర వానిజోళ్లకు డబ్బుయివ్వలేదు. పెద్దవాని చొక్కాకుట్టినవానికి సొమ్ము బాకీ. పిల్లదానికి పరికిణీ చినిగిపోయినది. పెద్దదానికి జాకెట్టులేక సిగ్గుజేటుగా నున్నది. నామాట చెప్పనే యక్కరలేదు. మీకేమి పొద్దున లేచెదరు, పనికివెళ్ళి సాయంత్రము ఇంటికి వచ్చెదరు. ఉన్నదనియా లేదనియా?" అని సణుగును. మరు సటివార మితడు రెండురెట్లు పనిచేసి మధ్యాహ్నము ఫల హారము కూడా చేయక పొదుపుచేసి యిచ్చిన నిదియేకథ! అప్పు పెరుగును. ఇతనికి విరక్తి హెచ్చును. తాగినను తాగకున్న నొకటిమైనప్పు డేల తాగి యీ దురదృష్టము మరువరాదని దానిలో పడును. ఇక వీనికి పరోపకారచింత యేమి? ప్రజాసేవ యేమి? జోళ్ళుకుట్టేవానికి బట్టలుకుట్టే వానికి దాసుడగు వీనికి స్వాతంత్ర్యపేక్ష యేమి? తనకు వెచ్చము లిచ్చువాని ముఖము చూడలేనివాడు రాజకీయ సంఘమునగాని సాంఘికోద్యమమున గాని ఎట్లు చేరగలడు? తన కుటుంబమునకు గాని గ్రామమునకు గాని వీడెట్లుపయోగా

గింపగలడు? ఇదియే చాలకుటుంబములకథ. పిల్లలకు జబ్బుచేసి నప్పుడుగాని భర్తకు పనిలేకపోయినప్పుడుగాని స్త్రీ యెంతటి బాధనైన ఓర్చుకొనును. పేదవారు కష్టపడగలబాధలో సగ మువంతు స్వతంత్రజీవనము చేయనలయునను పట్టుదలకూడ కే అనుభవించినచో ఇప్పుడు దారిద్ర్యమున పడియున్న పెక్కు కుటుంబములు కొంతవరకు పొట్ట పోసికొన గలుగును. నీ వశ ములోనున్న తరుణమున కొంత ఆకటిబాధకుసహించి నీ కవశ్య మగు తరుణమున నాకటిబాధ కలుగకుండ కాపాడుటకు దూర దృష్టి, ఇంగితజ్ఞానము, ఆత్మవిశ్వాసము కావలెను. ఇట్టితరి ఋణముపాలు గాకుండ జీవించు పద్ధతిని పెక్కుకుటుంబము లకు నేర్పిన రాక్డేలుసంఘముయొక్క శక్తి గణనీయము.

వ్యాపారలాభమును ఆ లాభము నార్జించినవారికే పంచియిచ్చు విధానమును ఈ సంఘములో చార్లెసు హావర్తు అనునతడు ప్రవేశపెట్టెను. ఈసంఘముయొక్క వస్తు విక్రయ శాల కార్యనిర్వహణమున కగువ్యయము పెట్టుబడి ఋణముల పైన వడ్డీ కదపకుండా నుంచు సరకు (Fixed stock) యొక్క తరుగు వాటాల మూలధనముపైన లాభవిభాగములు (Dividends) వ్యాపారము పెంపుచేయుటకు హెచ్చుచేయు పెట్టుబడియు పోగా మిగిలిన దానిలో నూటికి రెండు న్నర వంతున విద్యావిషయికమగు కార్యముల కొరకు ఖర్చులుగా మినహాయించి మూడు నెలల కొకమారు చిల్లరవ్యాపారములో వచ్చు లాభము సంఘసభ్యులకు ఈ మూడు నెలలలో వారు వాడుకొన్న మొత్తములనుబట్టి వారి వారికి పంచబడును.

రాక్డేలు సంఘమువారు "తీర్మాన నిధి" (Redemption Fund) ని చాలాకాలము క్రిందటనే స్థాపించిరి. ప్రతి సభ్యుడు నియ్యవలసిన దరఖాస్తు రుసుము ఒక్కొక షిల్లింగు దీనిలో చేరును. సంఘములోనుండి వెళ్లిపోవు సభ్యుడు తీసికొనిపోవు సొమ్ములో చివర రెండుపౌనులలోను రెండుషిల్లింగులు మినహాయింపబడి తీర్మాననిధిలో చేర్చబడును. సంఘములో సభ్యులు కానివారి వ్యాపారమువలన వచ్చు లాభముకూడా దీనిలో చేరును. కదలింపకుండగ నుంచు సరకుయొక్క తరుగు కొరకు తీర్మాననిధి యుపయోగింపబడును. ప్రతి కార్యనిర్వాహక నివేదికలోను, శాశ్వత మూలధనము యొక్క మొత్తము, ఉన్నదానికంటె తక్కువగా చూపింపబడు చుండును. అందువలన సంఘము విచ్ఛిన్నము చేసినచో ఒక్కొక్క సవరసు పెట్టుబడికి 25 షిల్లింగుల లాభ విభాగము వచ్చుట కవకాశముండును.

ప్రతి సభ్యుడును ఐదు'పౌను' వాటాలను కొనవలెను. 5 పౌనులు పూర్తి యగునవరకు దరఖాస్తుతో ఒక షిల్లింగు వారమునకు 3 పెన్నీలు లేక 3 మాసములకు 3 షి. 3 పెన్నీలు చెల్లించవలెను. ఈ లోపుగా వచ్చు లాభము కూడా వాటా మొత్తముక్రింద జమ కట్టబడును. నూటికైదువంతున వచ్చు వడ్డీలుకూడా దీనికే చేర్చబడును. ఇట్లు సభ్యునికి చాలా అవకాశము లియ్యబడును. సంఘము యొక్క క్షేమమునకు విరుద్ధముగ ప్రవర్తించు సభ్యుని సంఘమువారు తాత్కాలికముగ తొలగింపవచ్చును. సాధారణసంఘసభవారి తీర్మానిని సభ్య

త్వము రద్దు చేయవచ్చును. సంఘసభ్యుని ద్వారా ఏ సహకార సంఘమైనను సరకు యథేచ్ఛముగా కొనవచ్చును.

కష్టదశలో నున్న సభ్యుడు 2 పౌనులకు పైబడి తనకు సంఘనిధిలోనున్న మొత్తములో నెంతయైనను తీసికొనవచ్చును. అయితే హెచ్చుమొత్తమైనకొలది హెచ్చుకాలము ముందుగానే దరఖాస్తు చేయవలెను. 5 పౌనులవరకు 2 వారములు ముందుగా దరఖాస్తుచేయవలెను. 90 పౌనులకొరకు 12 వారములకు ముందు దరఖాస్తు చేయవలెను. 1849 లో వచ్చిన కఱవు దినములలో నిందువలన సభ్యు లెంతో లాభము పొందగలిగిరి. సంఘములో నూరు పౌనుల కన్న హెచ్చువాటాల నేసభ్యుడును కొనరాదు. ఏ సందర్భములోను వడ్డీ మువ్వది పౌనులకు మించరాదు. సంఘసభ్యులలో వచ్చు తగాదాలన్నియు కార్య నిర్వాహక డైరక్టర్ల చేతను సాధారణసభవారి వలనను మధ్యస్థుల వలనను తీర్మానింపబడును. సరకుల నాణ్యమును గూర్చియు ధరలను గూర్చియు సంఘోద్యోగుల ప్రవర్తనను గూర్చియు సభ్యులేమైన ఫిర్యాదు చేయదలచినచో వ్రాతమూలముగా డైరక్టరుల కివ్వవలెను. దానిపైన డైరక్టరులు తమ తీర్మానము తెలుపగలరు. దానిపైన సాధారణ సభవారి తీర్మానము ఖాయము. దానిపైన పునరభియోగము లేదు.

మొదట ఈ సంఘములయొక్క లాభముల పైన ఆదాయము పన్ను విధింపబడకగా 1850 మొదలు 1856 వరకు సంఘములవారు దీనినిగూర్చి పోరాడి తుదకు జయించిరి.

ఈ సంఘము యొక్క ఆదాయములో కొంత విద్యావిషయిక కార్యము కొరకు వినియోగించు విధానమెంతయు కొనియాడదగియున్నది. నిధులను మీరినందుకు విధింపబడు అపరాధములుకూడ ఈ విద్యానిధిలో చేరును. ఉచిత భాండాగారము వృద్ధిచేయబడి 2200 గ్రంథరాజములతో విరాజిల్లుచుండెను. పఠనమందిరమున చక్కని వార్తాపత్రికలు కలవు.

1850 మొదలు 1855 వరకు చిన్నపిల్లలకొరకు పాఠశాల యేర్పరుపబడెను. నెలకు రెండు పెన్నీల చందా. 1855 మొదలు యిరువది ముప్పది మందికి వయోజనవిద్యకొరకు ఆదివారము మంగళవారము నొకగది నుపయోగించు కొరకు నిర్ణయించిరి.

రాక్డేలు సంఘమువారు సహకారవస్తు విక్రయశాలను గూర్చి ఎవరైన ఎరుగగోరిన వారి కెల్లరకు తగు సలహాల నివ్వసాగిరి, ముప్పదిమైళ్ళుకూడ పోయి ప్రజలకు సహకారము బోధింతురు. వీరు ఆలోచనలతో వ్యర్థప్రలాపములతో కాలము బుచ్చు మెట్టవేదాంతులుకారు. త్యాగబుద్ధి ధర్మస్వభావము వీరికి గాఢమగు పరోపకార దీక్షను కలిగించినవి. ఈసహకార సంఘసభ్యుల యభివృద్ధి వీరి వేష భావలవలన నడవడివలన వెల్లడి కాసాగెను.

1856 లో రాక్డేలులో సహకారసభ జరిగెను. ఈసభ వారి సిద్ధాంతము లెంత యుత్కృష్టములుగ నున్నవో చూడుడు.

(i) మానవసంఘమున వివిధభాగభూస్వాములున్నను అందరి యొక్క క్షేమలాభము లౌకికధర్మముపై నాధారపడి

యున్నవి. (ii) నిజమగు కార్మికులు కలిసి మెలసి పని చేయు స్నేహితులుగా నుండవలయును. (Fellow workers). (iii) మన వినిమయపద్ధతి స్వార్థము పైనగాక ధర్మముపైన నాధారపడవలయును.

ఈసభలో రాక్డేలు సంఘమువారు తమపనిని గూర్చి నివేదించుటయే గాక (Society for promoting Working men's Association) కార్మిక సంఘముల నిర్మాణమునకు తోడ్పడు ఒక సమితివారు చేసిన పనినికూడ ప్రశంసించెను. కార్మికుల శ్రేయమునకు సంబంధించిన పెక్కు విషయములను సేకరించి దేశములో ప్రచురించుటయు ఉద్యమమున న్యాయ శాస్త్రమువలన గలుగుచున్న ఆటంకములను గూర్చి పార్లమెంటు సభకు తెలిపి ఆ యడ్డంకులు తొలగించి సహకార సంఘములలో చేరినవారికి కొంత స్వాతంత్ర్యము స్వేచ్ఛయు అభివృద్ధి మార్గములను కలిగించుట, వస్తువిభజనకు ఉత్పత్తికి తోడ్పడు సంఘములకు గావలసిన విధులను నిర్మించుట, కావలసిన న్యాయవాది సలహాలు, అమితధనవ్యయము లేకుండగా పై సంఘమువారి సేవచేత సులభసాధ్యములైన వని ప్రశంసించి ఈసంఘమువారు చూపించిన మార్గముల ప్రకారము రాక్డేలు సంఘముకూడ పనిచేయ సంకల్పించెను. క్రైస్తవ సోషలిస్టు (Christian Socialists) సంఘమువారు కూడ సహకారోద్యమమునకు చాలా సహాయము చేసిరి. నిజముగా ప్రపంచములో గొప్ప భౌతికశాస్త్ర పరిశోధకుల యొక్కయు చారిత్రిక పురుషులయొక్కయు పేళ్ళు ఎట్లు

చరిత్రలో వ్రాయబడుచున్నదో స్వయంసాహాయ్య సహకారశాస్త్రములను చక్కగా ఆచరించి చూపిన ప్రముఖుల పేర్లుగూడ అట్లే లిఖయింపదగియున్నవి.

వారమున కొక్కక అణా చందా నియ్యగలవారు వేయిమంది యున్నచో రు 85-0-0 లు అగుచున్నది. ఇది కాంపౌండు వడ్డీతో పదేండ్లలో నెంత సొమ్మౌ కాగలదో యూహింపుడు. ఇట్టిస్థితిలో 35 కోట్ల ప్రజలలో ఒక కోటి ప్రజలైన నిది చేసినచో ముప్పది వత్సరములలో ఎన్నికోట్ల రూపాయీ లగునో యూహింపుడు. ఈసంగతి సామాన్యులకు చెప్పి వారిచేత నేదైన నొక సమష్టివ్యాపారము చేయింపగలిగినచో నెన్ని కుటుంబములు బాగుపడునో కదా! సహకారోద్యమముయొక్క ఉద్దేశ మిదియే కదా! ఇంగ్లాండులో లీడ్సుపట్టణ సహకారసంఘము పైనచెప్పబడినట్టి అంకెలు ప్రచురించుచు ప్రచారము చేయసాగెను. "కార్మికులారా! మీదారిద్ర్యసముద్రము దాటుటకు ధనికులగు పెట్టుబడిదార్ల యోడలు మీకు సాయముచేయవచ్చునని యాసపెట్టుకొని సముద్రముదరిని వేచివేచి విసిగి వేసరి నాశనము కావలదు. మీరే పెట్టుబడిదార్లు కావచ్చునని గ్రహింపుడు. మీరు స్వయం సహాయ మొనరించుకొనుడు" అని 'పీపిల్సు జర్నలు' పత్రిక హెచ్చరించెను. ఇది చాల మంది పెడచెవిని బెట్టిరి. రాక్డేలు సహకారు లీసూత్రము గ్రహించి ఆచరించి కృతార్థులైరి.

1831 మే నెలలో మాంచస్టరులో మొదటి సహకార సభ జరిగెను. అక్టోబరులో బర్మింగుహాములో రెండవ సభ జరిగెను. "సంఘీభావములేని జనసంఖ్య వృథా. జ్ఞానములేని సంఘీభావమును వ్యర్థమే." అను లోకోక్తితో నీ సంవత్సరములో నొక పత్రికయు వెలువడెను. 1832 లో మూడవ సభ లండనులో సమావేశమగు నప్పటికి రాక్డేలు సంఘ ముద్భవించెను. ఆ సభకు అరువదియైదు సహకార సంఘముల ప్రతినిధులు వచ్చిరి. సహకారవస్తునిలయములలో చాల సంస్థలు నష్టపడెను, నశించెను. రాక్డేలు సంఘము మాత్ర మభివృద్ధి జెందెను. దీనికి కారణ మిది. అరువుబేరము చేయక రొక్కమున కమ్ముటయే యని విదిత మయ్యెను. అరువుబేరముచేసి నష్టపడుచున్నసంఘములు రొక్కబేరము నారంభించి బాగుపడుటయు జరిగినది. "తలపీఠీ కాతా పుస్తకము కార్మికుని పాలిటి దరిద్ర దేవత యని చెప్పవచ్చును. దానిలో చిక్కుపడినవాడు అప్పులో మునిగిపోయి తుదకు నిరాధారు డగును" అని రాక్డేలు సంఘప్రముఖులలో నొకడగు 'స్మితీస్' పలికెను. రాక్డేలు సంఘమువారు 1844 వ సంవత్సరములో చేసిననియమములలో సంఘోద్యోగి అరువునకు కొన్నను విక్రయించినను గొప్ప అపరాధము విధింపబడునట్లు శాసించిరి. లివర్పూలు సహకార సంఘమువారు సభ్యుల వాటాధనములో చెల్లింపబడిన మొత్తములో 2/3 వంతువరకు అరువిచ్చుపద్ధతి మొదలిడిరి ఇందువలన భయములేదు. కాని దీనికి జాగ్రత్తగా జమాఖర్చులు వ్రాయవలసియుండును. రొక్కబేరమే బీదలకు

శ్రేయస్కరము. రాక్డేలు పరిశ్రమలలో కూలిపని చేయు వాడు పెట్టుబడిదారై తీరవలసినదే. పనివారందరు చందా నిచ్చిగాని ఇంకొక విధముగా చెల్లించుకొని గాని సంఘములో ఐదు వాటాలు కొని తీరవలెను. ఇట్లు కొన్న వాటా సొమ్ముమీాద ప్రతి పారిశ్రామికునికి నూటికైదు వంతున వడ్డీ యివ్వబడును. ఈ వడ్డియు, జిల్లాలోని దామాషాగా నివ్వబడుచున్న ప్రకారము కూలియు, వ్యాపారఖర్చులును, పోను మిగతా లాభమెల్ల ఈ పారిశ్రామికు లిక్కడ గడించు కూలి మొత్తమును బట్టి దామాషాగా పంచి యివ్వబడును. వాటాదార్ల వాటాసొమ్ముపైన నూటికైదువంతున వడ్డీ యివ్వగా మిగిలిన లాభము వాటాదార్లకును సామాన్య కూలివారికిని,సమానముగా పంచబడును. వాటాదార్ల వాటాల సంఖ్యలను బట్టి వాటాదారులకు సగమును మిగతా సగము ఆడకూలి మగకూలి యను వివక్షత లేకుండా వారి కివ్వబడు కూలిని బట్టియు విభజింపబడును. వ 1857 సంవత్సరము జనేవరు నెలలో ప్రతికూలివానికిని స్త్రీకి నివ్వబడినకూలిమొత్తము మీాద పౌనుకు ఒకషిల్లింగు ఆరు పెన్నీలచొప్పున లాభవిభాగ ( Dividend ) మివ్వబడెను.

'పాడిహాము'లో ఇంకొక పారిశ్రామిక సహకార సంఘమువా రింకొక లాభవిభజనపద్ధతి నాచరించిరి. అప్పటి పారిశ్రామికులును చిన్న పెట్టుబడిదార్లును కలిసి చందాలు వేసికొని యంత్రములు కొని పనికారిచేత పని చేయించుచు లాభములోని ముఖ్యభాగమును వాటాదారులే పంచుకొనుచుం

డిరి. పనివారికి మాత్రము తక్కిన చోట్లకన్న హెచ్చు కూలి నిచ్చుచుండిరి. అర్థోత్పత్తిచేయు పారిశ్రామికునకుగూడ తాను సంపాదించిన లాభములో భాగమిచ్చుట ధర్మమను సూత్రము రాక్డేలునందు వలె పాడిహాము వారు గమనింపలేదు.

జాగ్రత్త, దూరదృష్టి, తెలివి తేటలు - వీనివలన రాక్డేలు వారు ఆపదలు అడ్డంకులు గడచి విజయముగాంచిరి. ప్యారిసు నగరములో పారిశ్రామిక సంఘములను జూచివచ్చి నివేదిక వ్రాసిన 'కానింగ్హాము' అను పార్లమెంటు సభ్యుడు పారిశ్రామికుల పాలిటి బంధువుగా పనిచేసియుండెను. పిండిమరల దివాలా రోజులలో నితడు రాక్డేలుపిండిమరకు ధనసహాయము చేసెదననియు వారికిగల ఆస్తియొక్క మంచిచెడ్డలు చూచుటకు తన న్యాయవాదికి తమ ఆస్తిని గూర్చిన సంజాయిషీ యివ్వవలసినదనియు కోరగా సంఘకార్య నిర్వాహకులు మాకీ న్యాయవాదులతో పనిలేదని సహాయముపొందుటయే మానుకొనిరి! నిజముగా వీరి ఆస్తి చాలా విలువ గలిగినదయియే యుండెను. మొదటి సంవత్సరములో సంఘము వారు వాటాదార్లకు నమ్మకము కలిగించుకొరకు సంఘోద్యోగుల పైన చాలా కట్టుదిట్టములుచేసి వీనివలనిరక్షణల నందరకు తెలియునట్లు చేసిరి. ప్రతిఉద్యోగియొక్క గల్లాపెట్టెకు ఒక సొరుగుండును. దానిలో సీనారేకుతో ఇత్తడితోచేసిన ఒక్కొక దినుసు కృత్రిమనాణెములు పోసియుండును. ఇతడు విక్రయించిన సరకు విలువ కివ్వవలసిన రొక్కమునకు సరియగు విలువ దెలుపగల కృత్రిమనాణెము లితడు కాతాదారుని కిచ్చును.

అందువలన నిరక్షర కుక్షియగు ఖాతాదారునకుగూడ లెక్క సులభముగా తెలియును!

వస్తువిక్రయశాల పిండిమర పారిశ్రామిక శాఖలకార్య దర్శియు కోశాధికారియు ప్రతివారము తమ నగదుచిత్తాలను సరిజూచుకొని జమాఖర్చు తేల్చుచుందురు. ఇందువలన లెక్కలలోని పొరబాట్లు సులభముగా సవరింపబడుచుండెను.

10 సవరసులు మొదలు 200 సవరసులు వరకు ప్రతి యుద్యోగివద్దనుండియు వారివారి బాధ్యతలను బట్టి జామీను పుచ్చుకోబడుచున్నది. ఈ యంగడిలోని ప్రతి యధికారియు నిప్పటికని పదిసవరసులు జామీను నొసగుచున్నాడు. ఇతర పూచీ లేనప్పుడు ఈ యుద్యోగికి సంఘములోనున్న నిలువ ధనమును సంఘమువశమున నుంచుకొనును. దానిలో తగు మొత్తము లేనిచో వాయిదాల ప్రకారము మతడు నియమిత మొత్తమును పూర్తిచేయవలయును. అట్లు సంఘము వశమున నుండు హామీ మొత్తముపైన వాటాసొమ్ముపైన వలెనే వడ్డీ యొసగుదురు. ఇది చాలా మేలయ్యెను. తన సొమ్ము నిల్వయున్న సంస్థను మోసగించుట తనను మోసగించుకొనుటయే గనుక ఉద్యోగు లప్రమత్తులైరి. మొదటి కార్యనిర్వాహక వర్గము లోని సభ్యులు అంగడిలో పనిచేయువారికి పనులలో తోడ్పడు చుండిరి. ఈవస్తువిక్రయశాలవా రెంతపొదుపరులో చూడుడు. పిండి నమ్ముగది చాల ఎత్తుగా నున్నందున పిల్లలు, ముదుసలి వారు మెట్లనెక్కుట చాలా కష్టముగా నుండెను. అయినను 1854 వరకు వా రాగదిచపటాను పలము చేయరైరి.

# రాక్డేలు సహకారోద్యమ చరిత్ర

## ఏడవ ప్రకరణము.

రాక్డేలు చుట్టుపట్ల బయలుదేరిన సంఘము లింత బాగుగా నేల వృద్ధిజెందలేదని పలువు రడుగుదురు. ఇది సహకారసిద్ధాంతములలో లోపము లుండుటవలన గాదు, కార్యనిర్వహణములలోని లోపములచేతనే. ఓర్పు, పట్టుదల, సంఘీభావము తెలివితేటల వలననే బాగుపడిన సంఘములు చాలాకలవు. వచ్చిన లాభ మెల్ల వాటాదార్ల కిచ్చివేయుటకన్న మరల మూలధనముగా వినియోగించి వ్యాపారమును వృద్ధిచేయుట యుక్తము. ఇట్లు చేసిన సంఘములు తక్కువ. రాక్డేలువారికి తక్కినచోట్ల కన్న సహకారపద్ధతులు బాగుగా పట్టువడినవి. ఈ సహకారులు బాగుపడుటకు గల ముఖ్యకారణములలో నొకటి, వ్యాపారవ్యయములలో చాల జాగ్రత్తగా పొదుపుచేయుట. వారికి వచ్చు రాబడిలో వారిచ్చు జీతములు చాలా తక్కువవంతుగా నున్నవి. నూటికి రెండువంతులలోనే అద్దె, పన్నులు, జీతములు, మున్నగునవెల్ల గడచిపోవుచున్నవని ఒక సభ్యుడు చెప్పినాడు. అద్దెలు వేతనములు చాలా అధికముగా నుండు నగరములలో నింత పొదుపుగా జరుగుట కష్టమే గాని దుస్సాధ్యము మాత్రము కాదు. వస్తువిక్రయశాల ప్రారంభమున సభ్యులిండ్లకు తరుచుగా పోయివచ్చుటకు గాని వారెల్ల రొకచోట సమావేశ మగుటకుగాని ఏర్పాటు చేయవలయును. లేనిచో

చందాలు వసూలై పని సాగదు. మరియు సంఘముయొక్క ఉద్దేశములు స్థితిగతులు ఆవశ్యకతలు వారికి బాగుగా నాటవు. ఇట్లు చేసినచో వారికి వ్యాపారమందు నమ్మకము కుదిరి తమంతట తామే చందాల నిచ్చెదరు. చిన్న గ్రామములోను పట్టణములోను పదిమంది కలిసి యిట్టి పనికొరకు సమావేశమగుటకు గల అవకాశములు పెద్ద నగరములలో నుండవు. ఏలయన, చిన్న యూళ్ళలో వారి నాకర్షించుటకితర వినోదములు క్రీడలు ఉద్యమములు తక్కువగా నుండును. పెద్దచోట్ల నన్నియు వినోదములే, అన్నియు పనులే. ఇటువంటి పనికొరకు వచ్చి కూర్చుండుటకు తీరిక ఉత్సాహము పూని కయు కలుగుట కష్టము. అందులో జనసామాన్యము దూరస్థలమునుండి వచ్చి చేరుట కశక్తు లగుదురు. అందు వలన లండనువంటి నగరములో పారిశ్రామికు లిట్టి సంఘము స్థాపించి నడుపుట కష్టసాధ్యమే. లీడ్సులో పిండిమర సంఘము, పాడిహాము సహకార పారిశ్రామికులు గాల్షీల్సు సహకారులు, రాడ్‌కేలు సహకార వసునిలయముతో పాటు బాగుపడిన సంఘములే. పారిశ్రామికులే స్థాపించి, వారే నడిపి నలుగడలను వ్యాపారమును వృద్ధిచేసి, సహకారోద్యమ వ్యాపనమునకు తోడ్పడుటలో వీరు రాడ్‌కేలుసహకారులతో సమానులా యని నిర్ణయించుట యనవసరము.

పూర్వము కొంచెము శుభ్రమగు దుస్తులను వేసికొనిన కూలివాడు కనబడినచో వీనికూలి తగ్గింపవచ్చు ననుభావము యజమానులలో నుండెడిది. అందువలన పారిశ్రామికులు బాగు

పడుటకుగూడ వెఱచుచుండిరి. కాని ఇప్పుడు శుభ్రముగా సంతోషముగా కనబడుపారిశ్రామికుల యజమానులు వారిని గూర్చి నలువురిలో గర్వపడుదినములు వచ్చినవి. రాజ్యాంగ శాస్త్రజ్ఞులు స్వయంసహాయమునకు తోడ్పడు సహకార సంస్థల ప్రాశస్త్యమునుగూర్చి వ్రాసియున్నారు. జనసామాన్యము విద్యావంతు లగుటకును వీనిని నిర్వహించుటకు పరిశ్రమ, ఇంద్రియ నిగ్రహము, పరస్పర సహాయ గౌరవములు కావలసి యున్నందున ధనార్జనకు గాకపోయినను జ్ఞానసంపాదనకైన నివి తోడ్పడుచున్నవనుటలో సందియములేదని రాజ్యాంగ శాస్త్రజ్ఞులు వ్రాయుచున్నారు.

పనివారే దైన కొంత సొమ్ము వెనుక వేసికొనినను యజమాని దగ్గరనే దాచుకొని అతని వ్యాపారములోనే దానిని వినియోగించినచో నది పెట్టుబడిదార్ల పద్ధతికే తోడ్పడుట యగును గాని పారిశ్రామికుల శ్రేయమునకు తోడ్పడుటలేదు. ఇందువలన యజమానిబలము వృద్ధియగును. ఇంతకును తమ కెంతధన మున్నదో యజమానికి తెల్పుటకు కూలివారిష్టపడరు. దారిద్ర్యము మనుష్యులను ఎక్కువ కష్టించి పనిచేయువారిగా చేయగలదనిగాని ఎక్కువ నాగరకులుగా చేయగలదనిగాని తలంచుదినములు ఐరోపాలో గతించినవని 'జాన్‌స్టూఆర్టు మిల్లు' పలికిన పలుకులు జన సామాన్యమునకు వేదవాక్కుల వంటివి. ఈ కాలమున దరిద్రులు తృప్తిజెంది అసహాయులై కృశించి నశింపవలసిన పనిలేదు. ధనికులు దరిద్రుల నణచియుంచుటకును వీలులేదు. ఈభావము

ఇంగ్లాండులో బీదలందు ధనికులందు గూడ వ్యాపించినది. ఈ భావములను 'కార్లైలు' అను - ఆంగ్లగ్రంథకర్త వేదాంతి ప్రజలకు బోధించినాడు. వ్యాపారము చేయువారి అంగళ్ళు పూర్వము అందముగా లేక చూచుటకు అసహ్యముగా నుండెను. ఇప్పు డవి చాలా అందముగా నున్నవి. ఈ దివ్య భవనములే ఈ మార్పునకు సాక్షులు. ధనార్జన చేసి చేసి కుబేరులైన వణిక్ప్రముఖులకు లలితకళాభిలాష, అందము కావలసివచ్చినవి. అంతట పూర్వము అపరిశుభ్రములుగ అస హ్యములుగా నుండిన పరిశ్రమాలయము లిప్పుడు చక్కగా కట్టబడుచున్నవి. దృష్టి పరిశ్రమాలయమునుండి పారిశ్రామి కులవంక కచిరకాలములోనే తిరిగినది. వానియొక్క దుస్థులను గూర్చి నివసించు గృహములను గూర్చి యజమానులు శ్రద్ధవ హించినారు. ఇట్లు శ్రద్ధవహించిన యజమానులలో మొదటి వాడు 'టైటస్‌సాల్టు.' ఇతనిదగ్గర పనిచేయుటయే మొదట నొక భాగ్యముగా పనివాండ్రు తలంచుచుండిరి. ఈ భావము వృద్ధి జెందగా నేటి యజమానులు తమ పనివాండ్రను గూర్చి చాల శ్రద్ధవహించుచున్నారు.

రాష్డేలు సహకారోద్యమము విజయముగాంచుట కా సంఘముయొక్క నిబంధనలు ముఖ్యకారణములై యున్నవి. రాష్డేలుసంఘములో చేరదలచిన దరఖాస్తుదారుని పాత్ర సభ్యులెవరైన పేర్కొనవలెను. అంతట నతని తాహతు ప్రవర్తనములనుగూర్చి చర్చజరుగును. సాధారణ సంఘసభలో అధికసంఖ్యాకులచే సభ్యుడుగా అంగీకరింపబడనివాని రుసుము

షిల్లింగు వాని కిచ్చివేయబడును. చేర్చుకోబడిన సభ్యుడు రెండు నెలలలో వచ్చి చేరనిచో నతనిషిల్లింగు సంఘమునకు జెందిపోవును. ప్రతిసభ్యుడును ఐదు పౌనువాటాల గొనవలసి యుండెను. ఒక్కొక పౌనుచొప్పున మాత్రమే వాటాలను నిర్ణయించిన వస్తు నిలయములు చందాదార్లవల్ల సొమ్ము వసూలుగాక మూలబడి యుండెను. ఇది మేలయ్యెను. ప్రతి దరఖాస్తుదారుడు స్వయముగా వచ్చి తన సమ్మతిని తెలుపవలెను. ప్రతిసభ్యుడును ఐదువాటాలకు తక్కువగాకుండగను ఏబదివాటాలకు హెచ్చుగాకుండగను కొనవలెను. సంఘము యొక్క మూలధనము పౌను వాటాలవలననే సమకూర్చబడవలెను. ప్రతిసభ్యుడును 5 పౌనులు పూర్తియగువరకు వారమునకు 3 పెన్నీలు చెల్లింపవలెను. అనగా మూడు నెలలకు మూడు షిల్లింగుల మూడు పెన్నీలు. అనారోగ్యమువలన గాని దుస్థితివలనగాని నిరుద్యోగమువలనగాని అశక్తుడైననే తప్ప ఇది క్రమముగా చెల్లించితీరవలెను. లేనియెడల 3 పెన్నీలు అపరాధము నిచ్చుకొనవలెను. ప్రతిసభ్యుని వాటాధనములో రెండుపౌనులు శాశ్వతనిధిగా నుండవలయును. మిగతా మూడు పౌనులు కార్యనిర్వాహకవర్గమువారి యిష్టమునుబట్టి సభ్యుడు తీసికొనవచ్చును. ఐదు పౌనులకు పైబడి నిలువయున్న సొమ్ములో నుండి ఎంత మొత్తము నైనను తిరిగి తీసికొనవచ్చును గాని ఈ క్రింది విధముగా ముందుగా దరఖాస్తు చేయవలెను. ఒకపౌను ఐదు షిల్లింగుల మొదలు రెండు పౌనుల పది షిల్లింగులవరకు ఒక వారము ముందుగాను హెచ్చు

మొత్తములకు హెచ్చురోజులు ముందుగాను, నలుబది మొదలు నలుబదియైదు పౌనులకు పండ్రెండువారములు ముందుగాను తెలుపవలెను. జనేవరు, ఏప్రిలు, జూలై, అక్టోబరు నెలలలో మొదటి సోమవారమునాటి సభలే త్రైమాసికసభలు. ఆ సభలలో సంఘోద్యోగులు తమ త్రైమాసిక నివేదికను దాఖలుచేసి సంఘమునకు గల మూలధనమును నిలువసరకు విలువను విస్పష్టముగా తెలుపవలయును. ఈ సంఘముయొక్క ఉద్యోగు లేనెపముపైన గూడ ఏవస్తువును రొక్కమునకు తప్ప అరువున కమ్మరాదు, కొనరాదు. ఈ నిబంధనకు విరుద్ధముగా వర్తించు నుద్యోగి పది షిల్లింగుల అపరాధము చెల్లించుటకు పాత్రు డగును. మఱియు తన ఉద్యోగము నిర్వర్తించుట కనర్హు డగును. సంఘమునకు వచ్చినలాభ మీ క్రిందివిధముగా విభజింప బడవలెను. సాధారణసభనాటికి ముందు మూడునెలల క్రిందటివరకు సభ్యులవలన వసూలు కాబడిన వాటాధనముపైన నూటికి ఐదు వంతున వడ్డీ యివ్వబడవలెను. మిగతాసొమ్ము ఆయా సభ్యులా మూడుమాసములలో కొనిన సరకుల విలువ మొత్తముల ప్రకారము దామాషాగా పంచిపెట్టబడనలెను.

రాష్డేలు సంఘము స్థాపింపబడిన కాలమున న్యాయశాస్త్రవిధులం దట్టి సంఘములకు తగిన రక్షణ లేకుండెను. సభ్యుల హక్కులు నిర్ధారణ చేయుబడి యుండలేదు. వారికి అపరిమితమగు బాధ్యత యుండెను. పరులతోగాని బండారులతోగాని ఒడంబడికలు చేసికొనుటకు శాస్త్ర మంగీకరింప

దయ్యె. తుదకు ధనమందన మపహరింపబడినను దానికి దిక్కు లేదు! సంఘము తనపేరున భూమిని కొనుటకుకూడా వీలులే కుండెను. ధర్మశాస్త్రము మారి సహాయము వచ్చిన పిదప గూడ సభ్యులు కొద్దిమొత్తములు మాత్రమే నిధియం దుంచు కొనుటకు వీలుండెను. వారు దాచుకొనిన రక్షణ నిధు లందలి సొమ్మును తమ విద్యాభివృద్ధి కొరకు పయోగించు కొనుటకు గూడ వీలులేకుండెను. ఈ యాటంకములెల్ల క్రమ క్రమముగా పోయెను. ఇట్టి యడ్డంకులలో రాక్డేలు సహ కారులు పని చేసి అభివృద్ధి గాంచి రనగా వారిశక్తి యేమని పొగడవలెను? మనుష్యులకు క్రొత్త సంగతులు నేర్పు చున్నట్లుగా కనబడకుండగ నేర్పవలెను. మరచిన పాతవానినే సూచించునట్లుగా ప్రతిపాదింపవలెను. అన్నియు ననుమాన ములే, అన్నియు నాటంకములే!

1891 నాటికి సభ్యులసంఖ్య 11647 కు పెరిగెను.

మూలధననిధి 370792 పౌనులు.

ఆసాలుకు వ్యాపారము 296025 పౌనులు.

సాలుకు లాభము వడ్డిసహా 52198 పౌనులు.

రాక్డేలు విద్యానిధి చాల ప్రాముఖ్యత వహించెను. కొన్ని వత్సరములు శాస్త్రజ్ఞులు అనుభవజ్ఞులు సభ్యుల కుపన్యాసము లిచ్చిరి. వారివ్యయము వస్తు నిలయమె భరించెను. తరువాత 1878 లో ఫ్రెంచిభాష తరగతులు ప్రారంభింప బడెను. గణితము, భూమితిరేఖాగణితము,

మెకానిక్సు, (Theoretical mechanics) శరీరశాస్త్రము, వృక్షశాస్త్రము లోహచుంబకత్వము (Magnetism) విద్యుచ్ఛక్తి, (Inorganic chemistry) రసాయనశాస్త్రము, డ్రాయింగు (Freehand and Model) (Geometry & perspective accoustics) వెల్తురు, వేడిమి, ఫ్రెంచిభాషయు ఇప్పుడు నేర్పబడుచున్నవి. సభ్యుల కొమాళ్ళు, కొమార్తెలు తరగతులలో చేరి వీనినే నేర్చుకొనుచున్నారు.

| 1891 లో చదువుచుండిన | విద్యార్థులు. | పరీక్షచేయబడినవారు. |
|---|---|---|
| శాస్త్రతరగతులు | 157 | 124 |
| కళాభ్రబోధనము (Arts) | 46 | 27 |
| హస్తకళ (Technology) | 33 | 28 |

గ్రంథ భాండాగారములో 1890 - 91 లో
అన్నిరకముల గ్రంథములు కలిపి 14791
ఇండ్లకిచ్చిన పుస్తకముల సంఖ్య 35498

19 ఉపశాఖా భాండాగారములు కలవు. వీనిలో 2153 గ్రంథములు కలవు.

రాడ్క్లెలు సంఘమునకు పేరుదెచ్చిన ముఖ్యలక్షణములు పదునాల్గు.

1 తామే స్వయముగా పెట్టుబడి పెట్టి వస్తునిలయము స్థాపించుట.

2 తాము సంపాదింపగలిగినంత పరిశుద్ధవస్తువులనే సరఫరా చేయుట.

3 పరిపూర్ణమైన పరిమాణము తూనికలతో సరకునమ్ముట.

4 ఒకే వెలకు బజారు ధరలకు అమ్ముట; తక్కిన అంగళ్ళ వారి ధరలతో పోటీచేసి హెచ్చుతగ్గుధరల కమ్మకుండుట.

5 అరువు పుచ్చుకొనరు, ఇవ్వరు. పనివారలలో ఋణము లేకుండ జేసిరి.

6 సభ్యులు కొన్నసరకుల మొత్తము కిమ్మతుల ప్రకారముగా లాభమును వారికే పంచిపెట్టుట. లాభము గడించినవారా లాభములో పాల్గొనుట కర్హులను సూత్రమును స్థాపించిరి.

7 సభ్యులకు వచ్చిన లాభమును సంఘముయొక్క రక్షణనిధిలోనే నిల్వయుంచునటుల జేసి పొదుపును ప్రోత్సహించుట.

8 పరిశ్రమ వ్యాపారముకూడ లాభకరములుగ నుండునట్లు రెంటికిని నూటికైదువంతున వడ్డీ నేర్పరచి పెట్టుబడిని ఫలవంతముగ జేయుట.

9 కష్టించి లాభము సంపాదించిన పారిశ్రామికులకు వారి వారి వేతనముల ననుసరించి ఆ లాభములను వారికి గూడ పంచిపెట్టుట.

10 అన్ని విధములగు లాభములలో నూటికి రెండున్నర వంతులు విద్యకొరకు సభ్యుల యభివృద్ధికై వినియోగించుట.

11 అన్ని ఉద్యోగముల విషయమున తీర్మానముల విషయమున కూడ వీ రేర్పరచినవా రందరికి సమానముగా సమ్మతుల నిచ్చు సార్వజనిక నియోజనవోటుహక్కు ప్రజాపరిపాలనకు మార్గదర్శి యయ్యెను. ముఖ్యముగా స్త్రీలకు నియోజనాధికార మొసగబడు గొప్ప సంస్కరణము చాలాకాలమునకు పూర్వమే ఈసంఘమున నెలకొల్పబడెను.

12 నేరములు పోటీయు లేని సంఘముగల పారిశ్రామిక నగరనిర్మాణము గావించు ఉన్నతాదర్శముతో సహకార పరిశ్రమ వాణిజ్యము నభివృద్ధిజేయు ఉద్దేశము.

13 టోకువిక్రయ సంఘమును (Wholesale Buying Society) స్థాపించుటలో పరిశుభ్రమగు వస్తువులను సభ్యుల కందజేయు ప్రధానోద్దేశము సఫలమయ్యెను.

14 పాటుపడు ప్రతివ్యక్తికి సుఖజీవనము కలిగింపగలట్టియు స్వయంసహాయ పద్ధతిని నీతిని ధర్మమును సాంఘికజీవనమందు స్థిరీభూతము లగునట్లు జేయు ఆదర్శముకూడా ప్రశంసింప దగినది.

# సహకార వస్తునిలయోద్యమము

## తృతీయ భాగము.

### ౧

### సహకార వస్తునిలయముల సమ్మేళనము.

రాక్డేలు సహకారులు వస్తునిలయమునే పరమావధిగా వించుకొనినవారు గారు. దాని మూలమున అంతకన్న ముఖ్యములగు ఆశయములను సాధింపదలచిరి. తమ సంఘ సభ్యులకు వసతుల గల్పింపదలచిరి. నిరుద్యోగ సమస్య పరిష్కరింపదలచిరి. తక్కువగా నున్న కూలిని హెచ్చింప దలచిరి. తమవారికి గావలసిన వస్తువులను తయారుచేయదల చిరి. భూమిని సంపాదించి తమవారికి వ్యవసాయమునకు వీలు కలిగింపజూచిరి. తాగుడు మాన్ప బ్రయత్నించిరి. సమష్టిలాభములతో జీవింప వీలగు నొక నివేశన మండలము నేర్పరుపదలచిరి.

సహకార వస్తునిలయములు లాభము లార్జింప మొదలిడగనే వానికి చేతినిండ ధన ముండెను. వస్తువులను చౌకగా సంపాదింపగలిగెను. ఇదిచూచి సామాన్య వర్తకులకు కన్నుగుట్టెను. అందువలన వస్తునిలయములు టోకు బేరము చేయదలచినప్పుడు వారిలో వారికి పోటీలవలన ధరలు సరసముగా నుండుట దుస్తరమయ్యెను. మరియు ఒక్కొక ఉద్యోగి వెళ్లి వస్తువులు కొనుటలోకూడా సరకుల నాణ్యమును చూచుట కష్ట

మయ్యెను. ఈ వస్తునిలయము లన్నియు గలిసి ఒక టోకు సంఘమును స్థాపించుట యావశ్యక మయ్యెను. అంతట ఇంగ్లాండులో రాకీడేలుసంఘములోని గ్రీనువుడ్డుగారును క్రిస్టియనుసోషలిస్టులును గలిసి వస్తు నిలయముల నెల్ల ప్రోత్సహింపగా (North of England Co-operative Wholesale Society) ఉత్తర ఇంగ్లాండు దేశపు సహకార టోకు సంఘము స్థాపింపబడెను. 1863లో నిది సహకార టోకుసంఘము(Co-operative Wholesale Society) అను పేరున రిజిస్టరు చేయబడెను. స్కాట్లాండులోని చిల్లరవస్తునిలయములుకూడ ఇట్టి ఒకసంఘముగా చేరి రిజిస్టరు చేయించు కొనెను. (Scotland Co-operative Wholesale Soceity).

సహకార టోకుసంఘముయొక్క పెట్టుబడి దానిలో చేరిన సంఘములు వాటాలు కొనుటమూలముగా చేకూరెను. దానిలో వ్యక్తులు సభ్యులుగా చేర్చుకొనబడరు. వ్యక్తులకు వస్తువు లమ్మరు. సంఘములకు బజారుధరలకే అమ్మి వారి కొనుగోలు మొత్తములపైన లాభము పంచిపెట్టబడుచుండెను. 1864 లో నొక అద్దెయింటిలో వ్యాపార మారంభింపబడెను. కొన్నాళ్ళలోనే ఒక స్థలము కొని 1869 లో నొక భవనమును గట్టుకొనగలిగెను. వ్యాపారము వృద్ధిజెందిన కొలది భవనము పెంపుచేయబడెను. లండను లోను న్యూకాసిల్ ఆన్ టైన్‌లోనుకూడా శాఖలు స్థాపింపబడెను. క్రమక్రమముగా ఇంగ్లాండు ఐర్లాండులలోనేగాక అమెరికాలో

న్యూయార్కులోను మాంట్రియిలులోను ఇతరచోట్లను సరకుల కొనుగోలునకు ఏంజెంట్లుకూడా నియమింపబడిరి.

బ్యాంకింగు : 1871 లో ఒక బ్యాంకింగుశాఖ యేర్పరుపబడెను. సంఘము లీ శాఖద్వారా తమ బ్యాంకివ్యాపారమును జరుపుకొనసాగెను. 1920 లో బ్యాంకివ్యాపారము విలువ 64,57,72,632 పౌనులుగా నుండెను. దీనివలన వచ్చులాభము కూడా ఆయా సంఘముల బ్యాంకివ్యాపారమును బట్టి పంచిపెట్టబడుచున్నది. చిల్లరసంఘములయొక్క వ్యక్తిసభ్యులు కూడా ఈ బ్యాంకిలో తమ సంఘముల ద్వారా ఖాతాలు పెట్టుకొనవచ్చును పెక్కు వ్యాపారకట్టడిసంఘములు (Trade Unions) కూడా ఈ బ్యాంకితో వ్యాపారము జరుపుచున్నవి.

వస్తునిర్మాణము : 1873 లో నీ సంఘము చిన్నసంఘములకు గావలసిన వివిధసరకులను సరఫరాచేయుటకు వస్తువులను తానే తయారుచేయ నిశ్చయించెను. బిస్కట్లు, పెప్పరమెంట్లు, మాంచెస్టరు దగ్గర క్రెంప్షెల్ (Crumpshell) లో స్థాపింపబడెను. లీష్టరులో నొక జోళ్లకార్ఖానా కొనిరి. ఈ టోకుసంఘముయొక్క వస్తునిర్మాణవ్యవహారము త్వరలోనే అభివృద్ధిజెందెను. ఇంకా రెండుచోటులలో కార్ఖానాలు స్థాపించిరి. ఫ్లానలు,ఉన్నివస్త్రములు,బనియన్లు, మేజోళ్లు,ఊరవేసినపందిమాంసము, క్రొవ్వు, ఊరగాయలు, నిలువయుంచుపండ్లు, పొగాకు, వస్త్రములు, కొయ్యసామాను, కుంచెలు, మున్నగు

వివిధవస్తువులు చేయుకార్ఖానాలు చాలాచోటుల స్థాపించిరి. పిండిమరలు చాలాచోటులందు నిర్మించిరి. కొన్నిచోటుల కొనిరి. మాంచెస్టరులో 1895 లో ముద్రాక్షరశాలను దెరచిరి. వీరు కీగ్లీ ఇనుపకార్ఖానా, డడ్లేబకెటు కెండరు సంఘము, చెర్ల్సీనాశేకుసంఘమునుకూడా కొనివేసిరి. 1916 లో ఒకనూనెమరను, 1917 లో నొకబొగ్గుగనిని కూడా సంపాదించిరి. 1876 నుండి మాంచెస్టరులో బొగ్గుత్రవ్వ పరిశ్రమను సహకార పద్ధతిపైన జరుపు ప్రయత్నములు జరిగియుండెను. మొదట నష్టము వచ్చెను. టోకుసంఘము దానిని తీసికొని పనిచేసి నష్టపడి 1882 లో అమ్మివేసియుండెను.

పొగయోడలు:—1876 లో సీటోకుసంఘము తన సరకుల ఎగుమతి దిగుమతులకొరకు పొగయోడలను నిర్మించు పని మొదలిడెను. కొన్ని ఓడలను కొనెను. తరువాత రెండు ఓడలుతప్ప తక్కినవానిని అమ్మివేసెను.

భూసంపాదనము:—రోడెన్ జమీందారీ భూములను టోకు సంఘము కొని వ్యవసాయముకొరకు, పండ్లతోటల కొరకు వినియోగించెను. ఇట్లేఇంకాఇతరభూములనింగ్లాండులో సంపాదించెను. 1913 లో కెనడాలో 10, 240 ఎకరములను కొనెను. పశ్చిమ ఆఫ్రికాలోకూడా భూమిని సంపాదించెను.

ఆరోగ్యాశ్రమములు:—జబ్బుపడిలేచినవారు విశ్రాంతి దీసికొని రక్తము పట్టుపరకు నుండుటకు రోడెనులో నొక

ఆరోగ్యాశ్రమమును స్థాపించిరి. ఇంక నితరచోట్లగూడ నెల కొల్పిరి. దీనివలన నీ సంఘముల సభ్యులకు చాలా లాభకర ముగ నుండెను.

భీమా:— టోకు సంఘము 1904 లో సాముదాయిక భీమాపద్ధతి నేర్పరచెను. ఇందువలన వివిధసంఘములు తమ తమ సభ్యులందరి జీవితములకు కలిపి ఒకటే భీమాపట్టా పొందవచ్చును. కొన్నాళ్ళు ఈ వ్యవహార మొక ప్రత్యేక సంఘము జరిపెనుగాని 1912 లో దీనిని టోకుసంఘములోనే కలిపిరి. ఆంగ్ల టోకుసంఘము స్కాట్లాండు టోకుసంఘము కలిసి సమష్టిగా ఇప్పుడొక భీమాశాఖ నేర్పరచి జీవితపు భీమా, అగ్నినష్టపుభీమా, నమ్మకపుభీమా (Fidelity), ఆకస్మిక విపత్తుభీమా, సామాన్యభీమా మొదలగు శాఖలుగా వ్యవహారము జరుపుచున్నారు.

కట్టడముల శాఖ:— కార్ఖానాలు, అంగళ్ళు టోకుసంఘముయొక్క ఇతర కట్టడములను నిర్మించుకొనుటకు ఈ శాఖ ఉపయోగపడుచున్నది.

ఆడిటు - స్టాకు టేకింగు శాఖ:— టోకువ్యాపార సంఘము లెక్కలు తనిఖీకొరకొక ప్రత్యేకశాఖను నెలకొల్పెను. ఏసంఘమైనను ఈ శాఖయొక్క ఉద్యోగులచేత తన లెక్కలను తనిఖీచేయించుకొనవచ్చును; లేదా వారి సరకును సరిచూచు కొనవచ్చును.

మాసపత్రికల ప్రచురణము:—ఈ సంఘము మాస పత్రికలను చాలాకాలమునుండి ప్రచురించుచున్నది. 1896 లోనే వీట్షీఫ్ (Wheat sheaf) అను పత్రిక సహకారవార్తలను ప్రకటింపసాగెను. ఆ యా సంఘములు స్వల్పపురుసుము నిచ్చినచో స్థానిక వ్యవహారములనుకూడా ముద్రించి పత్రికలో చేర్చి వానిని సభ్యులకందించెను. సహకారప్రయాసను గూర్చి తరగతులను గూర్చిన వ్యవహారము లిందు ప్రకటింపబడును. బాలశాఖయను నొకభాగమున పిల్లలకు పనికివచ్చు విషయము లుండును. ప్రొడ్యూసర్ అనబడు వార్తాపత్రికలో సహకారోద్యోగులకు కార్యనిర్వాహకసభ్యులకు పనికివచ్చు విషయము లుండును. ఇట్లే 'స్కాటిష్ కో-ఆపరేటర్' అను పేరిట స్కాట్లాండు సహకారపత్రిక నడుపబడుచున్నది.

స్కాట్లాండుటోకువ్యాపారసంఘము 1868లో గ్లాస్గోలో స్థాపింపబడి ఇంగ్లాండు సంఘమువలెనే పనిచేయుచున్నది. పిండిమరలు, కుట్టుపనులు మాత్రమే గాక ఔషధములు చేయుశాఖ యొకటి సీనారేకుల తయారుచేయు కార్ఖానా ఎగుమతి దిగుమతి పనికి బండ్లు, ముద్రాక్షరశాల, మినరల్ వాటరు అనబడు సోడాపానీయములు, వర్షములో తడియకుండ కాపాడుటకు రబ్బరు దుస్తులు, కొయ్య సామానులు సరకులు చేయుకార్ఖానాలు కలవు. డండీలో నొక జనుపనార కార్ఖానా కొనిరి. క్షీరజయంత్రాలయములు, ఎండుచేపల కార్ఖానాకూడ కలవు. ఈ సంఘముకూడా భూములు కొని వ్యవసాయముచేసి తోటలు పెంచి పనిచేయుచున్నది.

ఇంగ్లాండుస్కాట్లాండు దేశములలోని రెండుటోకుసంఘములు కలిసి కొన్ని సముష్టికార్యములను సాధించుచున్నవి. లటనులో కోకోతోటలను, సింహళములో తేయాకుతోటలను, లండనులో తేయాకు కాఫీ గిడ్డంగులను నెలకొల్పి చాలమందికి పనికల్పించి విశేషధన మార్జించి సహకారసంఘములకు లాభములు కలిగించుచున్నవి.

ఈరెండు టోకు సంఘముల కార్ఖానాలు చాల విశాలములై మంచిగాలి, వెల్తురు కలిగియున్నవి. పరిశుభ్రము లగు ఆహారము నొసగు మంచి భోజనశాలలుకూడ కలవు. పనివారికి వినోదమందిరములు, క్రీడాశాలలు, పఠనమందిరములుకూడా నెలకొల్పబడినవి. ఇతర కార్ఖానాలయందుకన్న వీనిలో పనిచేయు గంటల కాలపరిమితి తక్కువగా నుండును. ప్రతిపనివానికిని ప్రతిసంవత్సరము పూర్తిజీతము పైన రెండు వారముల సెలవు నొసగెదరు.

వేతనములు, కూలికూడా తక్కిన కార్ఖానాల కన్న అధికమే. ఆరునెలలు పనిలోనున్న ప్రతి కార్మికునికిని ప్రావిడెంటుఫండుకూడ ఏర్పాటు చేయబడినది. స్కాట్లాండు టోకు సంఘములోని పనివారా సంఘములో వాటాలుకూడా కొనవచ్చును. సంఘవ్యవహారములందు పాల్గొని వోటు నియ్యవచ్చును. ఇదియే ఆంగ్లసంఘమునకు దీనికిని గల తేడా. తక్కిన విషయములలో రెండు నొక్కటే విధముగా పని చేయుచున్నవి.

బజారు టోకుధరల ప్రకారమే ఈ సంఘములు తమ సరకులను సహకారవస్తునిలయములకు విక్రయించును గాని నికరలాభ మిందు వాటాలు కొనిన సహకారసంఘములకు వారు వారు కొను సరకులకిమ్మత్తును బట్టి పంచిపెట్టబడును. దీనిలో వాటాలుకొని సభ్యులుగా చేరని సంఘములకు కూడా సరకు అదేధరలకు విక్రయింపబడును. పూర్వము వానికి సగము లాభమే ఇవ్వబడుచుండెను. గాని ఇప్పుడు పూర్తి లాభ మొసగబడుచున్నది.

ఈ రెండు టోకుసంఘములలోను చిల్లర సంఘములే సభ్యులగుటకు వీలుకలదు. చిల్లరసంఘములు టోకుసంఘము యొక్క మీటింగులలో పాల్గొనుటకు ప్రతినిధుల నంపును. ఆంగ్లసంఘములో వాటాలవిలువనుబట్టియు స్కాట్లాండు సంఘములో క్రిందటి మూడు నెలలలోని కొనుగోలువిలువను బట్టియు ప్రతినిధులసంఖ్య నిర్ణయింపబడుచున్నది. ఆంగ్ల సంఘములో సభ్య లమితముగా నున్నందున ఒకే దినమున వివిధ కేంద్రములలో ఫిర్కా (డివిజనలు) సభలు సమావేశ పరుపబడి ఒకే ఎజెండా (సభా కార్యక్రమము) చర్చింప బడును. అన్ని సభలలో నివ్వబడినవోట్లు కలిపి లెక్కబెట్టి తీర్మానము గెలుపొందినట్లో త్రోసివేయబడినట్లో నిర్ణ యింపబడును. ఈ ఫిర్కాసభలు జరిగినవారముదినములతరు వాత కడపటి సాముదాయికసభ జరుగును. దానిలో హా జరు కాదలచినప్రతినిధు లెల్లరు హాజరు కావచ్చును. రెండు టోకుసంఘములలోను కార్యనిర్వాహకవర్గమును

(డైరెక్టరుల బోర్డును) ఉపసంఘములను (కమిటీలను) ప్రతినిధులే ఎన్నుకొందురు. వివిధ శాఖలయొక్కయు కార్ఖానాలయొక్కయు వ్యవస్థాపకులను డైరెక్టరుబోర్డువారు నియమింతురు. కార్యనిర్వాహక బోర్డువారుకూడ వివిధ శాఖలపై తనిఖీకొరకు వేరువేరు ఉపసంఘములు లేక కమిటీలుగా ఏర్పడుదురు. సరకులు జాగ్రత్తగా పరిశోధించి లెక్కలు పరిశీలింతురు. బాగా హెచ్చుమొత్తములను ఋణనిధులుగా ప్రత్యేకించుచుందురు. ఇదిగాక అగ్నిభయము సముద్రవిపత్తులవలని నష్టములకైన తమసంఘములోనే భాగాభీమా చేసి ఆలాభముకూడా శ్రేయనిధిగానే యెంచుకొనుచున్నందున అనుకొనని నష్టములెల్ల కప్పబడిపోవుచుండును. సంఘము యొక్క నివేదికలు బాలన్సుషీట్లు పరిశీలింపబడి బోర్డువారి సూచనపైన ప్రతినిధులసభలో ఆడిటర్లు నియమింపబడుదురు. ప్రతినిధుల సభలుచేయు సూచనలు జాగ్రత్తగా గమనింపబడును. సభ్యులెల్లరు టోకువ్యాపారముపట్ల తమకుగలబాధ్యతలను బాగుగా గ్రహించి ఈ ఉద్యమమును జయప్రదముగా నెరవేర్చుటకు తోడ్పడుదురు. మొదటలో కొద్దిపాటి నష్టములు వచ్చినను మొత్తముమీద ఈ రెండు సంఘముల యొక్క చరిత్రయు చాల జయప్రదమైనదని చెప్పవచ్చును.

ఆంగ్లసంఘము 1913 లోను స్కాట్లాండు సంఘము 1919 లోను సంఘస్థాపన జూబిలీఉత్సవమును జరిపెను.

ఐర్లాండు దేశములో 1897 లో టోకువ్యవసాయ సంఘము స్థాపింపబడి కృషిసంబంధవ్యాపారము జరుపసాగెను.

వివిధసంఘములకు విత్తులు, ఎరువు, పరికరములు సరఫరా చేసి పంటలకు చక్కని బేరములు తెచ్చి అమ్ముటయే దాని ఉద్దేశము. ఇదిగాక ప్రచారీసరకులు ఇతరపదార్థములు కూడా టోకుగా క్రియవిక్రియములు చేయును.

సహకారోద్యమము అభివృద్ధిజెందినపిదప వ్యాపారము కొరకేగాక సంఘనిర్మాణపద్ధతులనుగూర్చిన సలహాల విషయమునను, విద్యనుగూర్చియు, సమష్టిప్రయత్నముల కొరకు సంఘములు పరస్పరము తోడ్పడుటకు సమ్మేళనము కావలసిన ఆవశ్యకత కనబడెను. అంతట 1869 లో నొకసమితి స్థాపింపబడి పనిచేయసాగెను. 1889 లో దాని సంఘవ్యవస్థ పునర్నిర్మాణము చేయబడెను. ఇది ఆంగ్లస్కాట్లాండు దేశములలోని సహకారసంఘములరక్షణ, అభివృద్ధి ఏకీకృత్యములకు తోడ్పడుట కేర్పడెను. విద్యావిషయిక వ్యవహారములలో పాల్గొనుటకు పరిషుసంఘములుకూడా వీనిలో చేరెను. అన్ని సంఘముల ప్రతినిధులు కలిసి టోకుసంఘములందువలెనే దీని కార్యనిర్వాహకవర్గము వారి నెన్నుకొందురు. వీరికి సెంట్రలు బోర్డు అనిపేరు. ప్రతిసంవత్సరము జరుగు ప్రతినిధులసభకు సహకారకాంగ్రెసు అనిపేరు. సెంట్రలుబోర్డు విద్యాశాఖోప సంఘమును ఇంకా కొన్ని కమిటీలను నియమించును. ఒకకమిటీ సామాన్యవ్యవహారము నిర్వహించును. ఒక కమిటీ పార్లమెంటులో సహకారోద్యమ క్షేమలాభములను గనిపెట్టి చూచుచుండును. మఱియు శాసనములనుగూర్చియు ప్రభుత్వ

మువారి ఆజ్ఞలనుగూర్చియు సంఘములకు సలహా లిచ్చును. ఇదిగాక పారిశ్రామికఉపసంఘము (Labour Committee) సహకారోద్యమమునకు సంబంధించినంతవరకు కూలి పరిశ్ర మల కాలపరిమితి, (సంఘ) యజమానులకును కూలివారికిని వచ్చు వివాదలు మున్నగు కార్మికసమస్యలనుగూర్చి వ్యవ హరించును.

'స్త్రీల సహకార గిల్డు' అను పేరిట ఒకసమితి 1883 లో ఏర్పడినది. ఇది స్త్రీలలో సహకారవిద్యను వృద్ధి జేసి వారికి సహకార సంఘములందు ఉద్యోగములు అధికారము సంపాదించుట కేర్పరుపబడినది. 1921 లో స్కాట్లాండులో కూడా ఇట్టి సమితి ఏర్పరుపబడెను.

అట్లే పురుషులలో సహకార విజ్ఞానము కలిగించి తో డ్పడుటకు 'నేషనల్ మెన్సు కో-ఆపరేటివు గిల్డు' అను పేరిట నొకసంఘము స్థాపింపబడెను.

## ౨

## ఐరోపాలోని సహకారవస్తునిలయములు.

సహకార వస్తునిలయముల వలని లాభము లనేక ములు కలవు. ఇవి ప్రజలలో పొదుపును వృద్ధిచేసినవి. సం ఘమునందలి బీదలకు, కూలివారికి చాలఉపకారము చేసినవి. వ్యవహార నిర్వహణమునకు స్వపరిపాలనా విధానమునకు ప్రజలను శక్తిమంతులుగా చేసినవి. జనసామాన్యము తమ

కొద్దిపాటిగడనలో నుండి తమంతతామే కొంతవెనుక వేసి కొనదలపరు. అట్టివారికి తాము దాచకుండగనే లాభముల నుండి కొంతసొమ్ము దాపరికముచేసిపెట్టి వస్తునిలయము మహోపకారము చేయుచున్నది. ఇందువలన ప్రజలు విజ్ఞానము ను నీతిని అనుభవమువలన నేర్చుకొనగలుగుదురు. వ్యవహార పద్ధతులందు స్త్రీ పురుషులు కూడా తర్ఫీతు పొందగలిగి సంఘీభావము, సమష్టిప్రయత్నము, నిర్మాణశక్తి, అలవరచు కొని పౌరజీవనమున బాగుగా పాల్గొనగలుగుచున్నారు. ఇట్లు విని యోజక సహకారము ప్రజలకు చాల ప్రయోజన కారిగ నున్నది.

ఈ ఉద్యమము ఇంగ్లాండునుండి జర్మనీ, డెన్మార్కు, ఇటలీ, హంగెరీ, హాలెండు, ఫిన్లాండు, రష్యా, అమెరికా, ఐర్లాండు దేశములకు ప్రాకినది. కొన్ని దేశములలో సహకార వ్యూటకూ టిండ్లు, ఫలాహారశాలలు స్థాపింపబడెను. ఫిన్లాండు, డెన్మార్కు హాలెండు దేశములలో నిట్టివి కలవు. ఇంగ్లాండులోనివస్తునిలయ ముల కిట్టి శాఖ లేర్పడినవి. బెల్జియములో ఔషధశాలలు నెల కొల్పబడినవి. ఇవి బెల్జియముదేశపు కార్మికులకు చాలా ఉపయోగించినవి. ఔషధములధర నూటికి 50 వంతున తగ్గిం చుటయేగాక నూటికి నూరువంతున లాభములుకూడా పంచి పెట్టినవి. కొన్ని వస్తునిలయములకు ఔషధశాలలు శాఖ లుగా ఏర్పడినవి.

ఐరోపా దేశములోని వస్తునిలయములుగూడా ఇంగ్లాండు వానివలెనే వివిధ సరకుల నమ్ముచున్నవి. అయితే అక్కడ సారాయముకూడా అమ్మబడుచున్నది. ఇది చాలా దేశములలో కార్మికోద్యమమునకు తోడ్పడుచున్నది. బెల్జియములో 'సోషలిజం'కు అనుకూలముగా నున్నది. డెన్మార్కులో నిది పట్టణములందుకన్న గ్రామములలో పాదుకొనినది. ఫిన్లాండులో గ్రామములందే వేళ్లుబారినవి. అన్ని దేశములలోను వస్తునిలయములు తమకు సరకులను సరఫరాచేయుటకు టోకుసంఘముల సమ్మేళనములుగా నేర్పడినవి. చాలాగ్రామములందు కుటుంబములకు కావలసిన వస్తువులు వ్యవసాయమునకు గావలసిన వస్తువులు సరఫరాచేయుటకు ఒకే సంఘములు పూనుకొనుచున్నవి. అవి రెండు వేరుచేయుట చాలా కష్టసాధ్యమైనందున పెద్ద పెద్ద మొత్తములు క్షేమనిధులుగా ప్రత్యేకించుకొనుట యావశ్యక మయ్యెను.

## 3

### వస్తునిలయముల వృద్ధిక్షయ కారణములు.

1. పాశ్చాత్య వస్తునిలయములు జయప్రదములగుటకు కారణములు చాలకలవు. ఇంగ్లాండులోని వస్తునిలయములు పారిశ్రామిక విప్లవము వచ్చినపిదప పుట్టినవి. అప్పటికి పరిశ్రమలు వృద్ధియై వ్యవసాయము కృషియు మూలబడినవి. ఇందువారు తమ ఆహారపదార్థములకొరకు పరదేశములపై నాధారపడనలసినవారైరి. అందువలన రేవుపట్టణములే దేశ

మున కంతకు ఆహారవస్తువులను దిగుమతిచేయు స్థలము లయ్యెను. సరకు రేవునుండి కొనువాని చేతిలో పడులోపల మధ్య మజలీలలో చాలామంది వర్తకులు దలారీలు నుండిరి. ఒక్క మధ్యవాడు తగ్గినను కొంత ధర తగ్గును. అందువలన వస్తునిలయమువలన కొనువాడు లాభము పొందగలుగుచుండెను.

2. మన దేశమునందువలెగాక పాశ్చాత్యదేశము లందలి జీవితవిధానము చాలా సౌఖ్యప్రదమైనది. అచ్చటి కూలివారికి జనసామాన్యమునకు బిస్కట్లు చాకలెట్లు పండ్లమురబ్బాలు జాములు, డబ్బాలలో పెట్టబడి అమ్మబడు ఆహారపదార్థములు సామాన్యోపయోగకరములుగ నున్నవి. మఱియు వారుపయోగించుజోళ్ళు సబ్బులు తలనూనెలు మొగము మెరుగులు పౌడర్లుకూడా మనసంసారులకు కూలివారికి గగనకుసుమములే. అందువలన మనము వస్తునిలయములలో కొనుసరకులు చాల తక్కువగా నుండును. అచ్చట చాలా అధికముగా నుండును.

3. ఈ దేశమునందువలెగాక పాశ్చాత్యదేశములందు టోకుధరకును చిల్లరధరకును చాల తేడా యుండును. ఇంగ్లాండులోని వస్తునిలయమువారు నూటికి 15 మొదలు 25 వంతున లాభము గడించి నూటికి 12½ వంతున తమకాతాదారు సభ్యులకు లాభవిభాగములు పంచిపెట్ట గలుగుచున్నారు. మన దేశములో ప్రఖ్యాతివహించినతిరువళిక్కేణిసహకార వస్తునిలయమువారు గడించు లాభమే నూటికి 7-8 కన్న అధిక

ముగా లేదు. అందువలన నూటికి 4-5 వంతున మాత్రమే కొనువారికి పంచిపెట్ట వీలగుచున్నది.

4. మన దేశమునందుకన్న పాశ్చాత్యదేశములలో వివిధ తరగతులుగా తయారైన తినుబండార వస్తువుల అమ్మకము హెచ్చుగా నున్నది. రొట్టె, ఉప్పనివెన్న, పుల్లని మద్యసారము (Vinegar) మున్నగు వస్తువు లెన్నో తయారు కాబడి విక్రయింపబడును. మనము బియ్యము, గోధుమలు, పాలు, చింతపండు కొని యిండ్లలోనే పచనము చేసికొందుము. అచ్చట రొట్టె చేయుటకు గోధుమలు విసరు మరయంత్రము. వానికేగాక రొట్టెలు చేయువానికిగూడ కూలి నివ్వవలెను. అందువలన నీ తేడా వారికి గిట్టును. మనకు గిట్టదు!

5. ఆ దేశములలోని జీవితమె చాలా వ్యయదాయకమైనందున ఒక సరకుతో సంబంధించిన ఒక్కొక మధ్యవ్యాపారి, దలారీయు పుచ్చుకొను లాభము కూడా చాలా హెచ్చుగా నుండును. ఒక్కని లాభము తగ్గినను ధర తగ్గినట్లే కదా!

6. అచ్చట పారిశ్రామికాభివృద్ధి యత్యధికముగా నున్నందున కూలి మన దేశమునందు వలె హీనముగా నుండదు. ప్రతివారమును కూలి సంపాదించుచు రొక్కమిచ్చి సరకుల కొనువారి సంఖ్య చాలా అధికముగా నున్నది.

7. అచ్చటి జనసామాన్యము కూలివారు ఒకే జీవిత విధానమున కలవాటుపడి ఒకే విధమైనసరకులను ఉపయోగింతురు. అందువలన వస్తునిలయము లొకే విధమగు సరకులలో వ్యాపారము చేయవచ్చును.

8. అచ్చట కార్మికులయొక్క పారిశ్రామిక సంఘముల వలనను ఇతరసాముదాయిక పురుష ప్రయత్నముల వలనను రాజకీయ విజ్ఞానము వలనను వస్తునిలయములను స్థాపించి దానిలాభము పొందుతలంపు పూనిక కార్మికుల యందు కలిగెను.

9. మన దేశమునందువలెగాక ఆ దేశములందు ఇండ్లకు గావలసినవస్తువు లెల్ల కొనుటకు స్త్రీలే బజారునకు పోవుదురు. అందువలన సహకారోద్యమమున వారు పాల్గొనుచున్నారు.

10. సామాన్య వర్తకులు అంగడివారు తమవ్యాపారమును తెలివితేటలతో పాదుకొనజేసి వస్తు ఉత్పాదకులను లోబరుచుకొని వ్యాపారమును హస్తగతముచేసికొనక పూర్వము చాలకాలముక్రిందటనే ఆ దేశములలో వస్తునిలయములు బయలుదేరెను. టోకువ్యాపారము బాగుగా స్థాపింపబడినందున చిన్నవస్తునిలయములకు బలము కలిగెను. డెన్మార్కులోని కోడిగుడ్లు, జున్ను, వెన్న, పందిమాంసముల వ్యాపారమును సహకారటోకువ్యాపార సంఘము కాపాడియుండనిచో నది సాహుకారులచేతులలో బడియుండెడిది. పై పరిస్థితులేగాక విజ్ఞానవంతులగు వ్యక్తులు సంఘములుకూడా కార్మికుల యోగక్షేమములపట్ల శ్రద్ధవహించి ఈ యుద్యమమునకు తోడ్పడిరి. ఉదాహరణమున ఇంగ్లాండులోని క్రిస్టియన్ సోషలిస్టులు రాక్డేలు సహకారోద్యమమునకు జేసిన సేవను పేర్కొనవచ్చును.

మన దేశములో నీ పరిస్థితులు లేవు. మన గ్రామము లోని కర్షకులే తా ముపయోగించు ముడివస్తువులను పండించువారుగా నున్నారు. ఇక వారికి గావలసినది ఉప్పు కిరసనాయిలు గ్రామములో దొరకని ఆవాలు మెంతులు మొదలైన పచారీసరకులు మాత్రమే. అందువలన వ్యవసాయ సంఘమునకే అవకాశముకలదు గాని వస్తువిక్రయశాలకు తావులేదు. కొన్ని పట్టణములలో వర్తకులలోనే పోటీవలన టోకుధరకు చిల్లరధరకు హెచ్చు తేడాలేక తక్కువధరలున్నను సరకులో కల్తీయు తక్కువతూనికలు తప్పవు. ఇట్టిచోట్ల వస్తువిక్రయశాలలు మంచిసరకు సరియైనతూనికలు తూచి యివ్వవచ్చును. టోకుధరకు చిల్లరధరలకు తేడా యున్నచో లాభముకూడా ఆర్జింపవచ్చును. కాని వస్తునిలయము బాగు పడుటకు ఈపద్ధతియొక్క ముఖ్యోద్దేశమును సహకారసభ్యులు బాగుగా గ్రహించుట యావశ్యకము. వస్తునిలయముయొక్క మొత్తము వ్యాపారము బాగుగా వృద్ధిజెందువరకు వ్యాపార వ్యయములు చాలా తక్కువగా నుంచుట యావశ్యకము. వస్తు నిలయముయొక్క కార్యనిర్వాహకవర్గము వారు చాలజాగ్రత్త వహించి కనుగలిగి మెలగవలెను.

## ౪

## భారతదేశములోని వస్తునిలయములు.

భారతదేశమున సహకారవస్తు నిలయము లభివృద్ధి జెందలేదని చెప్పవచ్చును. అక్కడక్కడ నొక్కొక్క వస్తు నిలయము బాగున్నను దానికి కారణము అచ్చట ఇతరవర్త

కుల పోటీలేకపోవుటయో తక్కువ రైలుచార్జి సౌకర్యము సంపాదించియుండుటయో లేక అద్దెలేకుండ ఇల్లుదొరకుటయో ఇతరస్థానిక కారణములో అయియున్నవి. యుద్ధసమయమున తినుబండార ధాన్యముల కంట్రోలులో వస్తునిలయములు వర్ధిల్లినవిగాని తరువాత నివి వర్తకుల పోటీకి నిలువలేక క్షీణించినవి. 1928 లో వస్తునిలయములసంఖ్య : మద్రాసు 99, మైసూరు రాజ్యము 70, వంగదేశము 58, బొంబాయి 35, పంజాబు 21, అస్సాము 19, సంయుక్తరాష్ట్రము 13, మధ్యపరగణాలు, బేరారు 8, బర్మా 7. వస్తునిలయములు పాడగుటకు ముఖ్యకారణము బజారులోని తక్కువ అంగడులందు కన్న ఈ వస్తునిలయములందు చౌకగా వస్తువులు కొనవచ్చునని ప్రజలు తలంచుట. ఇది చాలా పొరబాటు. ఇట్టి దురభిప్రాయముతో రాక్డేలు సహకారులు తమ వస్తునిలయమును స్థాపించినచో నది యిప్పుడే నశించియుండెడిది. మధ్యలాభములు తీయు దలారీవర్తకుడు లేకుండగాజేసి వస్తువులను సరఫరాచేయు పణ్యచక్రమును హస్తగతము చేసికొను ఏయొక్క సంఘసభ్యులకో మాత్రమేగాక వస్తువు లనుభవించు వినియోజక సంఘమున కంతకును గూడ లాభము కలిగించుటయే వస్తువిక్రయశాల యుద్దేశము. ఈసూత్రమును గ్రహించియే ఐరోపాదేశములోని ప్రజలు సహకారవస్తునిలయములందు సభ్యులై తాత్కాలికముగా తమకు కొంచెము అసౌకర్యము కలుగుటకైన నొప్పుకొని మునుముందు కలుగులాభము దలచి కొంచె మధికధరలకు గూడా సరకులు గొన

నిచ్చగింతురు. ఇంకొక కారణము అరువు కాతా వ్యాపారము. సరకులను తమ తమ యిండ్లకు తెచ్చి యప్పగించవలెనని సభ్యులు కోరుచుండుట. జపానులో కూడా ఈ లోపము కనబడుచున్నది. టోకుధరలకును చిల్లరధరలకును గలతేడా చాలా తక్కువగ నుండుటయు వస్తునిలయములు పాడగుటకు కారణముగ నున్నది. మఱియు వస్తునిలయమున కగు ఖర్చులధికముగనున్నవి. వస్తునిలయముల మేనేజరు అసమర్థుడగుటయు నొక్కొకచోట దాని వినాశమునకు కారణమగుచున్నది. ఇది వస్తునిలయములకేగాక పరపతిసంఘములకు గూడ వేరుపురుగే. నిజముగా యోజించినచో మానవుడు స్వతస్సిద్ధముగా అవినీతిపరుడుకాడు. అవకాశమే వానిని దుర్మార్గునిగా జేయును. అందువలన కార్యనిర్వాహక సంఘము జాగ్రత్తగా కనిపెట్టి చూచుచున్నచో మోసములు తగ్గును. అరువుబేరమువలని నష్టము లెల్లరకు విదితమే. అరువుబేరము సరకులయొక్క ప్రాశస్త్యమునకు ధరలకుగూడ నష్టదాయకమే. రొక్కవ్యాపారమువలన దుబారా తగ్గును. అనవసరవ్యయము తగ్గును. అరువుబేరము చేయువాడు కావలసినదానికన్న హెచ్చుసరకుగొని వ్యర్థముచేయును. అరువు వ్యాపారము చేయు వస్తునిలయము టోకువర్తకులకు రొక్కమిచ్చి సరకుల గొనజాలదు. అందువలన మంచి సరకు చౌకగా రాదు. నగదు బేరములకు వచ్చు తగ్గింపులు రావు. అరువుకాతాలో దాని సొమ్మంతయు దిగబడిపోయినందున సొమ్ము వడ్డీకి బదులు తేవలసివచ్చును. ఇందువలన వడ్డీనష్టము తగులును. అరువు

కాతాలలో దివాలాతీసిన సభ్యులయొక్కయు ఇంక నితరులయొక్కయు రాని బాకీలు నష్టముగా పరిణమించును. ఈ నష్టములన్నియు ఎవరినెత్తిపైననో వేయవలయునుకదా! అందువలన నిదియంతయు హెచ్చుధరల రూపమున కాతాదారులనెత్తిన బడును. అరువుకాతాలవలన చాలా లెక్కల పుస్తకములు పెట్టవలసివచ్చును. ఖర్చు అధికమగును. ఋణగ్రస్తులను బాకీలు తీర్చవలసినదని తొందరచేయక తప్పదు. అందువలన వారిమనస్సులకు కష్టముకలుగును. మంచి కాతాదారులకు మాత్రమే మేనేజరు నివ్వును. సభ్యులలో కొందరికి మాత్రమే పక్షపాతము జూపుచున్నాడని కొందరికి కోరకొంలాడును. ఇట్టి కష్టము లుండుటవలననే రొక్కలు వస్తునిలయమునం దరువుబేరము వర్జింపబడెను. తిరువళిక్కేణి సహకార వస్తునిలయము చాల ప్రసిద్ధిజెందినది. ఇది 1904 లో స్థాపింపబడెను. టి. కె. హనుమంతరావుగారును ఇంక 13 మందియు నాటి సభ్యులు. 1929 లో దీని సభ్యులసంఖ్య 5781. మొత్తము వ్యాపారము విలువ 11 లక్షల రూపాయిలు. చెన్నపట్టణములో పలుతావుల 25 శాఖలు స్థాపింప బడెను. 1929 లో దానియొక్క చెల్లింపబడిన పెట్టుబడి (Paid up Capita]) రెండులక్షల రూపాయలు. లాభములో 1921 వరకు నూటికి 25వంతునను, తరువాత 10చొప్పునను క్షేమనిధి కొరకు ప్రత్యేకింపబడుచు వచ్చెను. కొంతసొమ్ము కొనువారికి బోనసుగా పంచిపెట్టబడి మిగతా మొత్తము సాముదాయిక వినియోజన నిధిలో నుంచబడుచున్నది. 1929 లో సీనిధి

86 వేల రూపాయిలు. క్షేమనిధి 84000 రూపాయి లుండెను. దీని కొక అప్పుల శాఖ కలదు. 50 రూపాయిలవరకు రొక్కము అప్పులివ్వవచ్చును. ఇప్పు డీ వస్తునిలయములోని సిబ్బందిసంఖ్య 140. దీనికి సాలుకు రు. 45000 వ్యయమగుచున్నది. దీనిలోని ఉద్యోగులకు కనివారికి ప్రావిడెంటుఫండు ఏర్పరచబడినది. దీని ప్రధానకార్యాలయమునకును శాఖలకును సంబంధించిన పఠనాలయములు కలవు. ఈ వస్తునిలయములో బియ్యము, అపరములు, నెయ్యి, నూనెలు, బెల్లము, పంచదార, తేయాకు కాఫీ, సబ్బులు, అయిదారు పేటెంటు ఔషధములు విక్రయింపబడుచున్నవి. బట్టలఅంగడిని బట్టలు ఉతుకు అంగడిని పెట్టుటకు చేసిన ప్రయత్నములు కొనసాగలేదు. ఈ వస్తునిలయములో ఎవరు కొన్నసరకులు వారే తమతమయిండ్లకు తీసికొని పోవలెను. కాని సరకు నిండ్లకు పంపరు. నగరములోని సంసారులే చాలవరకు ఈవస్తునిలయమునకు కాతాదారులుగా నున్నారు.

చెన్నపట్టణములోని ఒకపేట యింకొకపేటకు చాలా దూరముగానుండును. కొన్నిచోటుల తప్ప తక్కిన భాగములో జనులు క్రిక్కిరిసి బొంబాయియందువలె వసింపరు. సంసారుల యిండ్లమధ్య అక్కడక్కడ అంగళ్లున్నవేగాని క్రిక్కిరిసిలేవు. పోటీతక్కువ. టోకుధరలకును చిల్లరధరలకును తేడా హెచ్చుగనేయున్నది. అంగడివారు బొంబాయిలోవలె సరకుల నింటికితెచ్చి యప్పగింపరు. జనులు సాధారణముగా ఒకేమాదిరి వస్తువుల నుపయోగింతురు. ఒకటి కొంచెము

చౌకబారుది, రెండవది ప్రశస్తమైనదిగ నున్న రెండురకములబియ్యమే అమ్ముదురు. బొంబాయిలోకన్న చెన్నపురిలో వేతనములు చాలాతక్కువగా నుండును. మొదట నీవస్తునిలయమున మేనేజరునకు వస్తువులమ్మువానికి గలిపి నెలకు 16 రూపాయీలే ఖర్చు అగుచుండెను.

బొంబాయిలో వస్తునిలయములను స్థాపించు ప్రయత్నములు వ్యర్థములయ్యెను. అచ్చటి పరిస్థితులు చెన్నపురి కన్ని విషయములలోను విరుద్ధములుగానున్నవి. బొంబాయిలో జనులు క్రిక్కిరిసి నివసింతురు. ప్రతి మూరుమూలబజారులోను అంగళ్ళుకలవు. అంగడివాండ్రు సరకు లిండ్లకు దెచ్చియిత్తురు. అక్కరలేనివానిని వాపసుతీసికొనుచుందురు. చిల్లరధరకు టోకుధరకు తేడాతక్కువ. బొంబాయిలో కొన్ని కొనుగోలు సంఘములు (Buying Clubs) కలవు. ఈసంఘములు సమష్టిగా వస్తువులను కొని హెచ్చులాభము సంపాదింపకపోయినను సరియైన తూనిక, ప్రశస్తమైన సరకును సభ్యులకివ్వగలుగుచున్నవి. అసలు వస్తువు లుత్పత్తిచేయుచోటనే వానిని కొనుపద్ధతిని వస్తునిలయ మేర్పరచినచో బొంబాయిలోకూడా వస్తునిలయము లాభము పొందుట కవకాశము లేకపోలేదు.

మైసూరులోని వస్తునిలయము లభివృద్ధిగాంచినవి. బెంగుళూరు నగరవస్తునిలయము ప్రసిద్ధిజెందినది. వీనియభివృద్ధికి కారణము మైసూరు రైల్వేపై న వీనికి సరకులంపుటకు చౌక కేవుండుటయే. మఱియు మైసూరుసర్కారువారు యంత్రాగారములవారు వీనిని ప్రోత్సహించి సహాయము చేయుచున్నారు.

హుబ్లీలోని సహకారవైద్యాలయము సహకార సంఘము చట్టముక్రింద రిజష్టరు కాబడకపోయినను ప్రజలకు చాలా ఉపకారిగానుండి మార్గదర్శిగా నున్నది. ఆపట్టణ వైద్యులందరు కలిసి దీనిని నిర్వహించుచున్నారు.

## ౫

## భారతదేశపు ఉత్పత్తి - పారిశ్రామిక సంఘములు

ఉత్పత్తి సహకారముకూడ మనదేశమున బాల్యావస్థయందేయున్నది. చేతిపనులు చేయువారికిని గృహపరిశ్రమలకును సహకారపద్ధతులుపయోగించు ప్రయత్నములు జరిగినవి. ఇట్టి పనులు చేయువారు మూడురకములు. (1) సొంతముగా వస్తువులుచేసి అమ్మువారు. (2) ఒక వలాలికొరకుగాని వర్తకుని కొరకుగాని వస్తువులు తమయింటిదగ్గర చేయువారు (3) చిన్నచిన్న కార్ఖానాలలో ఒక యజమానిక్రింద పని చేయువారు. వీరందరును వడ్డీలపైన జీవించు షాహుకారు చేతులలోపడియున్నారు. వీరికి కావలసిన సహాయము (i) పెట్టుబడికి ఋణము (ii) ముడిసరకులు పరికరములు కొనుటకు సహాయము (iii) తమవస్తువులను లాభమున కమ్ముకొనుటకు సహాయము. మనదేశములో వీరికి చేయబడిన సహాయము పరపతి సంఘములస్థాపన మొక్కటే.

నేతపరిశ్రమ మనదేశములో చాలాప్రాముఖ్యత జెందిన గృహపరిశ్రమగా నున్నది. అందువలన కొన్ని నేతగాండ్ర సహకార సంఘములు బయలు దేరినవి. పంజాబులోని

సంఘములు అమృతసరం పారిశ్రామిక బ్యాంకి క్రింద శాఖలుగా చేరినవి. ఈ బ్యాంకిగాక ఆపరగణాలలో ఆ యాప్రాంతముల గల ఆరుసమితులు క్రింద శాఖలుగా చేరినవి. అమృతసరం పారిశ్రామిక బ్యాంకి నేతగాండ్రకు ముడిపత్తి కొనుటకు అవకాశములు కలిగించుచున్నది. ఈ బ్యాంకికి లాహోరులో నొకవ్యాపారశాఖ అంగడి కలదు. అచ్చటనుండి బజారుధరలు వివిధసంఘములకు తెలుపుచుండును. వారికి కావలసిన ఇండెంటు జాబితాల ప్రకారము అమృతసరములో నేగాని అహమ్మదాబాదు బొంబాయిలోగాని సరకు కొనుచుండును. తక్కిన ఆరుసమితులును లాహోరు విక్రయడిపోకు సహాయకారులుగా నున్నవి. తయారుసరకు లాయాసంఘములే విక్రయించుకోవలెనుగాని బ్యాంకికిగాని సమితులకుగాని నిమిత్తములేదు. అయితే యీ డిపో సరకులకు ఆర్డరులు సంపాదించి పెట్టును. మఱియు సరకును ధరావతులపైన నిలువయుంచుటకు తోడ్పడును. ఇంకను బజారులోనే యేనమూనాలకు గిరాకి కలదో చెప్పి సహాయపడును. బొంబాయి మదాసు రాజధానులలోకూడా నేతగాండ్రసంఘము లున్నవిగాని ఇవి ఉత్పత్తి సంఘములుగా అభివృద్ధి జెందలేదు.

౬

సహకారగృహనిర్మాణ సంఘములు :

ఇవి అన్నిపరగణాలలోను అభివృద్ధి జెందినవి. ఇప్పటి వరకును గుమాస్తాలు, ఉద్యోగులు, ప్లీడర్లు మొదలగు

సామాన్య సంసారులకు యిండ్లు కట్టుకొనుటకే ఈ సంఘములు తోడ్పడినవి గాని, కార్మికులకు నివసించుటకు ఇండ్లు నిర్మించుటకు తోడ్పడలేదు.

ఈ పద్ధతిక్రింద నివేశనస్థలమునే పెట్టుబడిగా గైకొని నాలుగువేల రూపాయలవరకు సొమ్ము బదులిచ్చి సరసమగు వడ్డీతో నిరువదేండ్లలోపల తీర్చుకొనులాగున నేర్పాటు గావింతురు. ఇదివ్యక్తిస్వామ్యపద్ధతి. ఇట్లు గృహము నిర్మించిన వాడాఇంటిని పరుని కమ్మవచ్చును. ఇందువలన సహకార సిద్ధాంతమునకు నష్టమని సమష్టిస్వామ్యవిధానము అను నొక క్రొత్త పద్ధతిని బొంబాయివారు ప్రారంభించినారు. దీనిలో సంఘ మొక పెద్ద నివేశనస్థలమును 99 సంవత్సరముల కౌలుకు గాని క్రయమునకు గాని పుచ్చుకొని రోడ్లువేసి కాపురముండువారి కొక సమష్టి వినోదమందిరమో క్రీడాస్థలమో వదలిపెట్టి మిగతా స్థలము చిన్న చిన్న నివేశనములుగా విభజించి, సభ్యులకు కౌలుకో క్రయమునకో ఇచ్చును. వారు ఇండ్లు వేసిగాని వేయకగాని విక్రయింప దలచినచో ముందుగా సంఘమునకే గాని సంఘము పేర్కొనిన వారికి గాని విక్రయింపవలెను. ఈ షరతులతో సభ్యులు పెట్టుబడి పెట్టిన సొమ్మునకు రెండురెట్లు 10,000 రూపాయిలకు మించకుండా ప్రభుత్వము ఋణమిచ్చును. అన్నియిండ్లు నిర్మింపబడిన పిదప సంఘము ఆస్తిని కాపాడుచు సభ్యులకు మునిసిపాలిటీకి వచ్చు తగవులు తీర్చుచుండును. కాపురస్థుల భాగస్వామ్యసంఘములో ఆస్తి ఇండ్లసంఘమువారిదే. సభ్యులకు

వ్యక్తిస్వామ్య ముండనేయుండదు. సంఘముయొక్క మూల ధనములో $\frac{1}{6}$ వంతు మొదలు $\frac{1}{4}$ వరకు భరించవలెను. మిగతాది సంఘము గవర్నమెంటువద్ద ఋణము తెచ్చును. బొంబాయి ప్రభుత్వమువారిపద్ధతికి హర్షించి నూటికి $5\frac{1}{2}$ వంతున వడ్డీనిచ్చు పద్ధతిని నలుబదేండ్లపైన తీర్చునట్లు దీర్ఘవాయిదా ఋణము నిచ్చుచున్నారు. ఇతర పరగణాల ప్రభుత్వమువారు నూటికి 6 రూపాయిల చొప్పున వడ్డీ పుచ్చుకొందురు.

# సహకారవస్తునిలయోద్యమము

## చతుర్థభాగము.

## ౧

### కృషిసంబంధసహకారము.

కృషివ్యవహారములందు సహకారపద్ధతు లుపయోగించినచో కర్షకులకు చాలా లాభములు కలుగునని పాశ్చాత్యదేశములే నిదర్శన మిచ్చుచున్నవి. కొనుట, విక్రయించుట, బజారులో పెట్టుటకొరకు ముడిపదార్థములను బాగుచేయుట, మంచిధర రాబట్టుటకు ధరవచ్చువరకు సరకులను నిలువచేయుట, కోళ్లు, బాతులు, గొఱ్ఱెలు మొదలగు జీవముల జాతిని శ్రేష్ఠతరముగా జేయుట, రైతుల ఆస్తికి అగ్నిభయము మున్నగు విపత్తులవలని నష్టము రాకుండ భీమా చేయుట. అన్నివిధములైన వ్యవసాయపు పనులకును కావలసిన పెట్టుబడికి సొమ్మునిచ్చుట, మున్నగు కార్యములలో సహకారపద్ధతి ఉపయోగింప బడుచున్నది. కొన్ని దేశములలో సమష్టిగా ఎఱువులను పరికరములను తయారుచేసికొనియు గృహోపకరణములను ఆవశ్యకములను సంపాదించుకొనుటకును, తమదినుసులను నిలువజేసికొనుటకు గిడ్డంగులను నిర్మించుకొనుటకును, దానిని బజారుకు పంపుటకును రైతులు సహకారపద్ధతుల నుపయోగించుకొనుచున్నారు.

ద్రవ్యము సంపాదించుకొనుటకు, పరికరములను సంపాదించుకొనుటకు, సరకును విక్రయించుకొనుటకు, ఆయాపద్ధతుల కావశ్యకమగు రీతి నాయాదేశములవారు సహకారము నుపయోగించుకొనుచున్నారు. డెన్మార్కులోని జనసామాన్యము విద్యావంతులు. అందువలన ఆయాకార్యముల కొరకు వేరు వేరుగా సంఘములు నిర్మాణము చేయబడెను. జర్మనీ దేశములోని గ్రామములందలి జనులు విద్యావిహీనులు. చాలా బీదవారు. వారికి వ్యవహారజ్ఞానము తక్కువ. అందువలన వేరువేరు సంఘములు స్థాపింపబడినచో వానిని నిర్వహించుటకు గావలసిన కార్యనిర్వాహకవర్గము దొరకుట కష్టమయ్యెడిది. అందువలన అప్పులిచ్చుటకు క్రయవిక్రయములకు వస్తుఉత్పత్తి నిర్మాణములకు ఇవియవియననేల రైతులకు గావలసిన సమస్త కార్యముల కుపయోగించుటకొరకు ఒకే సంఘ ముపకరించు పద్ధతిని రెయిఫీసెన్ మొదలిడెను. స్విజర్లాండులో మొదట జున్ను చేయు సంఘములు బయలుదేరి అన్నివిధములగు శాఖలును బలసిలుదేరెను. ఇటలీదేశములో (రక్షణనిధి) సేవింగ్సు బ్యాంకి సంఘముల రూపమున బయలుదేరి నానాముఖములయ్యెను. ఇట్లు ఐరోపాదేశములో వ్యవసాయిక సహకారోద్యమము మొదట చిన్నదిగా ఒకేకార్యముకొరకు బయలుదేరినను శీఘ్రముగనే సర్వతోముఖమయ్యెను.

సహకారకృషి, కర్షకసహకారము ననునవి రెండు తెగల సహకారమని చెప్పవచ్చును. మొదటిది సహకారపద్ధతిపైన

సాగుచేయుపద్ధతి. రెండవది కర్షకులకు సంబంధించిన సమస్త కార్యములకొరకు చేయు సహకారము. మొదటిది ఇటలీ రుమేనియా రష్యా దేశములందుమాత్రమె ఆచరణలోనున్నది. రెండవది చాలా దేశములలో కలదు. వ్యవసాయము కొరకు అప్పులిచ్చు పరపతిసంఘముల సంగతి అందరకు తెలియును. ఇక ఉత్పత్తి సరఫరా క్రయవిక్రయములనుగూర్చి యోజింతము. రైతులసంసారములకు గావలసిన వస్తువుల సరఫరా క్రయ విక్రయములకు వస్తునిలయములుపయోగించునుగదా! ఇదిగాక కృషిసంబంధవస్తువుల సరఫరా క్రియ విక్రియములు గూడా వస్తునిలయముల ద్వారా జరిగించుకొని వేరేఖర్చులు లేకుండా చేసికొనిరి అప్పులిచ్చుటకు సంబంధించినంతవరకు సంఘసభ్యులతోమాత్రమె వ్యవహరించుకొనుచున్నను తక్కిన వ్యవహారములు ఇతరులతోకూడా జరుపబడు చున్నవి. అయితే సంఘసభ్యులతో హెచ్చు వ్యాపారము జరుగుచుండును.

సహకారోత్పత్తి: వస్తుఉత్పత్తి సరఫరా క్రియ విక్రియము లందలి సహకారమునకు సహకారవ్యాపార మని వ్యవహరించ వచ్చును. ముడిపదార్థముల విషయములోను పంటల ఉత్పత్తి విషయములోను పైన చెప్పబడిన సమష్టి కృషి సంఘములుతప్ప వేరేసంఘములు లేవు. ఇక డెన్మార్కులోని జీవముల పెంచుసంఘము లైనను సమష్టిగా పెంచుట లేదు. రైతులు తమతమ జీవములను తామేపెంచి పెద్దవానిని జేసి వానిసరఫరా క్రియ విక్రియములలో సహకారము చేసి

కొనుచున్నారు. ఎగుమతికొరకు వెన్న జున్ను పాలు నుత్పత్తి చేయు క్షీరజయంత్రాలయములు, ఎగుమతికొరకు పంది మాంసమును పదునుచేయు యంత్రాలయములు, సారాయములు మద్యములు తయారుచేయు కార్ఖానాలు ఉత్పత్తిసంఘములని చెప్పవచ్చును. ఏలన యంత్రసహాయమున పాలు పండ్లు ద్రాక్ష బంగాళాదుంప వీనిస్వరూపమున మార్పు చేయబడుచున్నది. ధాన్యఫలాదినములు కొడిగుడ్లు బాగు చేసి వానిపాత్రశస్త్వపరిమాణములనుబట్టి వర్గీకరణముచేసి బజారులలో పెట్టుసంఘములుకూడా ఉత్పత్తిసంఘము లని కొందరు చెప్పుదురు. ఇట్లే ప్రత్తివిత్తులు విడదీసి దూదినిత్రొక్కి బేళ్లుగా (మేకుబండీ) ప్యాకుచేయు సంఘముకూడా ఉత్పత్తికిందికే వచ్చును. ముడిసరకును దానియథాస్వరూపములోనే విక్రయించుటకన్న దానిస్వరూపమును పరిమాణమును మార్చుటవలన గాని దానిరకములు వేరుచేయుటవలనగాని దానివిలువ హెచ్చవచ్చును. పదిమందికి పనికలుగును. మఱియు ఆహారములకు సంబంధించిన ఇతర పరిశ్రమలను నూనె పరిశ్రమకు తెలికపిండి పరిశ్రమవలె క్రొత్తవగు ససంబంధిక పరిశ్రమలను కలిగింపవచ్చును.

సహకారసరఫరా:—నలుగురు కలిసిచేయు కొనుగోలువలన మంచినాణ్యమైన సరకులు దొరకును. చౌకగా దొరకును. సరకుల సరఫరాతోనే రెయిఫీసెను జర్మనీలో సహకారోద్యమమును ప్రారంభించెను. ఫ్రెంచివారు సరకులుకావలసిన వారివలన ఆర్డరులు పుచ్చుకుని చాలా ఆర్డర్లు

చేర్చి వర్తకులకు బంపి దానిపైన కమీషను పుచ్చుకొను వ్యాపారపద్ధతితో సహకార మారంభించిరి. ఏపద్ధతి సరఫరాలోనైనను బజారు పరిస్థితులను ధరలను జాగ్రత్తగా గమనించుట యావశ్యకము. అక్కర గిరాకీ లేనిసరకు చేతిలో దిగబడిపోకుండ జూచుకొనవలెను.

ధరలు మందగించినప్పుడు కొనుగోలుచేయుటకొరకు బజారుధరల వాటము చూచుకొనుచుండవలెను. సంఘములో ఋణము మంజూరుచేసి దానిక్రింద రొక్కమునకు బదులుగా సరకు నిచ్చుటమూలముగా సహకారసరపతికి సహకార సరఫరా జతపరిచినచో చాలామేలుగా నుండును. ఐరోపాలో చిన్నచిన్న సంఘములు కలిసి ఒక సమితిగా చేరి వస్తునిర్మాణము పరికరముల సరఫరా ఎఱువుల సరఫరా బాగుగా చేసికొనుచు లాభము పొందుచున్నవి.

అమ్మకము:—రైతులకుగల ముఖ్యకార్యము తమ పంటలను తగిన ధరలకు అమ్ముకొనుటయే. చిల్లర చిల్లరగా పండించు పంటలనెల్ల ఒక్కరాశిగా చేర్చుట, ఉత్పత్తిచేయు చోటనుండి అమ్మకము చేయుచోటులకు రవాణాచేయుట, మంచి ధర రాగల బజారులలో బెట్టి అమ్ముట, ఇందుకొరకు రకములనుబట్టి సరకును ప్రత్యేకించుట, గిరాకీ కాలమును ప్రదేశమును నిర్ణయించుకొనుట, అనునవి అమ్మకములో జరుగు పనులు. ప్రశస్తమైన సరకు క్రమానుసారముగు సరఫరా అనగా ఎడతెగని కాతాగా సర కందిచ్చుచుండుట. దీనినిబట్టి వ్యాపారమునకు మంచి గౌరవము, ఒకే

ధరయు లభించును. సభ్యులెల్లరు దీనికి తోడ్పడవలెను. ఏదో ఒక కొద్దిలాభముకొరకు కానపడి అందాజు పోటీ జూదపు వ్యాపారము చేయరాదు. ఈ కార్యములకొరకు సంఘీభావము తోడ్పాటు అవసరము. రకమువారీగా సరకు నిలువ బోయుటకు గిడ్డంగులు నిర్మించిగాని అద్దెకు పుచ్చుకొని గాని యుంచుకొనవలెను. ఇది రైతులకు సాధ్యముకాదు. ఐరోపా దేశములోని రైలుకంపెనీలవారు ఓడలకంపెనీలవారు బ్యాంకులు వర్తకులును ప్రభుత్వమును సహకారబ్యాంకులు (Financing Banks) నిట్టి గిడ్డంగులను నిర్మించి రైతులకు సహాయము చేయుదురు.

ఇక రవాణావిషయములోకూడా ఐరోపా దేశములలోని సహకార క్రయవిక్రయములకొరకు కంపుసరకునకు రైళ్లు ఓడలు సర్వసాధారణముగా చౌకరేట్లు నొసగుచు చేయూత నొసగుచున్నవి. డెన్మార్కులో సరకుల రవాణాను ప్రోత్సహించుటకు ప్రభుత్వమువారు "సబ్సిడీ" లనబడు సహాయ ద్రవ్యముకూడా ఇచ్చుచున్నారు.

సరకును బజారునకు తెచ్చినప్పుడొక్కొకమారు నిలుకడలేని బేరగాండ్రు పుచ్చుకొనిన జట్టీబేరములకు వారు క్రయధనము పెగల్చకపోవచ్చును. లేదా ధర పడిపోయినందున నష్టము రావచ్చును. ఇట్టినష్టములను నివారించుకొనుటకు మంచినమ్మకమైన బేరగాండ్రకు లైసెన్సు లిచ్చుటయు గిరాకిని బట్టి సరకును సరఫరాచేయు క్రమపద్ధతియు సరియైన మార్గములు. ఈ రెండును ప్రభుత్వసహాయము శాసనరూపము

దాల్చనిదే వీలుపడదు. ఐరోపాదేశ ప్రభుత్వము లిదిచే
యుచు (పణ్యచక్రమును) బజారుయొక్క నుండలమును వృద్ధి
చేయుచున్నవి. ఆకస్మిక విపత్తులు రాకుండ బజారుయొక్క
స్థితిగతులను జాగ్రత్తగ పరిశీలించుట, బేరగాండ్రను క్రమ
శిక్షణమునసుంచి అక్కరకు సరఫరానుసమన్వయముచేయుట,
ప్రభుత్వముయొక్క కర్తవ్యమని బాగుగాగ్రహించి అమె
రికాసర్కారువారట్లు తోడ్పడుచున్నారు.

సరకుల క్రయ విక్రయములు బాగుగా జరుగవలె
నన్నచో జాగ్రత్త ఋజువృతి మంచిపెట్టుబడి వ్యవహార
పద్ధతులు పరస్పర విశ్వాసముగల సంఘసభ్యులు నుండవలెను.
ఇది అన్నివిధములగు సహకార ప్రయత్నములందు నావశ్య
కమే. వ్యవహారపద్ధతులనగా వ్యాపారలక్షణములు. బజా
రులో మంచిధర రావలెనన్నచో చిల్లరబేరమునకునలె కొద్ది
పాటిసరకున్నచో వీలుపడదు. అందువలన నానాప్రాంతముల
నున్న సరకు నొక్కచోటికి రైళ్లపైన ఓడలపైన బండ్లపైన
రాశీకరణము చేయవలెను. సరకుయొక్క ప్రాశస్త్యము
నాణ్యము రకములకు వర్గీకరణమునకు ఒకేమాదిరిగా సర
ఫరా చేయుటకు జవాబుదారీ యుండవలెను.

అట్లున్ననే మచ్చులనుబట్టి అమ్మి మంచిధర రాబట్టు
టకు వీలగును. ఇదిగాక ఒకప్పు డుండుట ఒకప్పుడు లేకపో
వుటగాక మొడతెగకుండా కాతాగా సరకు నందించవలెను.
ఇదియుగాక వీలునుబట్టి ఇష్టప్రకారము సరకుధరలు పెంచి
తగ్గించు పద్ధతి గాక నిలుకడధర నుంచవలెను. వివిధ విక్రయ

స్థలములతో సంసర్గము నేర్పరచుకొని ఇదివరకే ఆ సరకుతో నిండినబజారులోనే ఇదియుకూడ పడవేసి ఉక్కిరి బిక్కిరి చేయక అక్కరయున్నచోటికి సరకునుబంపుపద్ధతి యుండవలెను. చిల్లరఅమ్మకము చిల్లరవర్తకులను రెచ్చగొట్టుటకే ఉపయోగించును గాని లాభమును దెచ్చుట కుపయోగింపదు. కనుక నది మానవలెను. కోడిగుడ్లు పాలు నిలువయుండవు గనుక టోకుగా మాత్రమే అమ్ముటకు వీలైన పదార్థములు గావు. అందువలన వానిలో చిల్లరవ్యాపారము చేయక తప్పదు. సరకు పూర్తిగా నిలువజేసికొని బజారు స్థితిగతులు బాగుగా అవగాహనమైనగాని వాయిదాబందీవ్యాపారము (Terminal Marketing) ప్రారంభింపరాదు. మరియు ప్రారంభమున కొని అమ్మ జట్టీవ్యాపారపు పద్ధతికన్న సరకును కమీషనుప్రతినిధి వ్యాపారము చేయుటయే శ్రేయస్కరము. ఆవశ్యకమైనప్పుడెల్ల సరకును ఏరి వేరుచేయుట, రకమువారిగా వర్గీకరణముచేయుట మంచిది. చౌకబారు సరకునకే ధరతగులుట బజారులో రివాజుగా నుండుట కలదు. అందువలన సరకుల తరహా నాణ్యము నభివృద్ధి చేయుటకు ప్రయత్నించవలెను. సహకారవ్యాపారము పాడగుట కొన్నొక్కప్పుడు అతిసాహసము, ఆర్థికసిద్ధాంతములు వాని ఆచరణము బాగుగా తెలియక పోవుట, సంఘసభ్యులందుగాని చిన్నచిన్న సంఘములందుగాని కలుగు ఓర్వలేమి, నాయకత్వము లేకపోవుటయు, సహకారవ్యాపారము పాడగుటకు కారణములుగా నుండును. అందువలన ముందుగా

జాగ్రత్తపడవలెను. "పూల్" వ్యాపారము అమెరికా దేశములోని రైతులు పండించు సరకు లన్నిటిని గనము వారీగా ఒక్కొకరాశిగాచేసి వ్యాపారమార్గమున బెట్టి రవాణాచేసి తగ్గుధర రాబట్టు పనికొరకు పూల్ (Pool) పద్ధతియని యొకటి కలదు. దీనిప్రకార మూ పని యొక సహకారసంఘమే చేయును. ఖర్చులు పోను రైతులకు వారి వారి సరకుల తరహా మొత్తములను బట్టి వచ్చిన సొమ్ము పంచియివ్వబడును. ఈపద్ధతివలన సరకు లమ్మునట లోని బాధలను రైతులు పొందనక్కరలేదు. తమ కాలమును శ్రద్ధను ఉత్పత్తికొరకే వినియోగింపవచ్చును. సరకుల క్రయ విక్రయములను గూర్చిన పనియెల్ల 'పూలు వ్యాపారసంఘమే నిర్వహించును. 'పూలు' వ్యాపార కంట్రాక్టుకాలము సరకులయొక్క స్వభావమునుబట్టి హెచ్చుగాగాని తక్కువగాగాని యుండును. పండ్లు, కూరగాయలు, గుడ్లు మొదలగు వస్తువులు త్వరగా పాడై పోవును గనుక వారము మొదలు పదునైదుదినము లీయుమ్మడి వ్యాపారము నిర్ణయించు కొందురు. ధాన్యము, ప్రత్తి మొదలగు వస్తువులకు ఒకసంవత్సరము వరకు ఉమ్మడిగను వుండును. చాలామంది పూలు కంట్రాక్టులకు ఐదు సంవత్సరముల వరకు వాయిదా నిర్ణయించుకొందురు. ఈపూలు వ్యాపారమును గూర్చి ప్రభుత్వము చట్టములద్వారా కట్టుదిట్టములు చేసినది. ఐచ్ఛికసమాఖ్య పరస్పరసహాయము బజారులో జాగ్రత్తగా క్రయవిక్రయ కార్యములు జరుపుట, మంచిబేరసారములు

జరుపుట, సరియైన ధరరాబట్టి సంఘసభ్యులకు పంచియిచ్చుట, పూలువ్యాపారము వలని లాభములు. ఈ వ్యాపార నిర్వహణములో ఒక్కొకసభ్యుని కొక్కొక 'వోటు'ండును. దీనిలో అందరు సభ్యులు కావచ్చును. అందరికి నిది సేవచేయును. సరియైన తూనిక, కొలత, టోకు ఉత్పత్తిలో పొదుపు నీపద్ధతివలన సమకూరుచున్నవి.

క్రయ విక్రయములను బాగుగా జరుపుకొనుటకు అమెరికాలో పత్తి నుత్పత్తి చేయువారొక సహకార ఉత్పాదక సంఘముగా చేరినారు. వీరి సంఘ నిర్మాణ పద్ధతులు చాలా బాగుగ నున్నందున తక్కిన సరకులవారు దీని ననుకరించుచున్నారు.

వీరి పద్ధతులు:

1 సంఘ వ్యవస్థను సరకుపైననే ఆధారపరుచవలెను.
2 ఆ సరకు నుత్పత్తిచేయువారు తప్ప ఇతరులను సభ్యులనుగా జేర్చుకొనరాదు.
3 సభ్యులందరిని బంధించు మంచి కంట్రాక్టుతో వారి నందరిని అరికట్టియుంచవలెను.
4 బజారులో నిది గణింపతగినదిగా నుండునంత రాశి మొత్తమగు వరకును సరకును చేత నుంచవలెను.
5 సరకుయొక్క పారిశుద్ధ్యము, తరమునుబట్టి రకములవారిగా వర్గీకరణముచేసి పూలువ్యాపారము చేయవలెను.
6 పనులను చేయుటకు సామాన్యులను గాక ప్రవీణులను నియోగింపవలయును.

ఈ సంఘమువారు తమకు గావలసిన ద్రవ్యమును సులభముగా సేకరించుకొన గలుగుటకు సంఘములో బ్యాంకి ఉద్యోగులను జేర్చుకొనినది. ఈ సంఘము ధరలను పెంచుటకు గాని ప్రత్తి వ్యాపారము ఇజారా పొందుటకు గాని ప్రయత్నింపదు. సక్రమ వ్యాపారము సరసమగుబేరము చేయును. బజారు నిండించి పాడుచేయను.

తక్కిన వ్యాపారమునందు వలెనే సహకార వ్యాపారమునందును సరకులయొక్క స్వభావమునుబట్టియు వానికి దేశములోనే గిరాకి యుండునో ఇతర దేశములయందు గిరాకి యుండునో ఆ సందర్భములను బట్టియు స్థానిక దేశీయబజారు స్థితిగతులు దేశాంతర వ్యాపారస్థితిగతులు గమనించుట యావశ్యకము.

ఐరోపా దేశములందు సహకార వ్యాపారములకే గాక వ్యక్తులు చేయు వ్యాపారమునకు సైతము రైళ్ళు, ఓడలు అనేక విధములుగా సహాయము చేయుచుండును. చౌక రవాణా రేట్లు నిచ్చును. సరకులు పాడుగాకుండగా "కోల్డుస్టోరేజి" అనబడు పద్ధతిప్రకారము రవాణాలో కాపాడును. ఆయా దేశముల ప్రభుత్వములు మునిసిపాలిటీలు చట్టములజేసియు గిడ్డంగులను నిర్మించియు సహాయము చేయును. మఱియు నాయా దేశముల బ్యాంకులు వ్యాపారములో వానికి గావలసిన సొమ్ము పెట్టుబడి పరపతి విరివిగానిచ్చి పోషించును. జర్మనీ, ఇటలీ, స్విజర్లాండు, అమెరికా, సంయుక్తరాష్ట్రములు, కెనడా, ఫ్రాన్సు,

డెన్మార్కు, ఆస్ట్రియా హంగెరీ మున్నగు దేశము లన్నియు కృషిసంబంధ సహకారమునం దత్యంతాభివృద్ధి గాంచినవి.

౨

భారతదేశ కృషిసంబంధ సహకారము.

భారతదేశములో సహకార క్రయవిక్రయమున చాలా ఆటంకములు కలవు రైతులుబీదలై నందున వారిదగ్గర చాలా చిన్నచిన్న మొత్తముల సరకు దొరకుచున్నది. పంటబజారునకు తయారుగాకమునుపే రైతు దానిని సాహుకారునకు కుదువపెట్టుట తటస్థించుచున్నది. పంటల హామీపైన సొమ్మును అడ్వాన్సు నిచ్చు కాయిదాదార్లు కమీషనుదార్ల ద్వారా సరకు విక్రయింపబడుచున్నది. సరకును నిలువజేసి యుంచుటకు తగినగిడ్డంగులు లేవు. రవాణాకుగాని, నిలువయుంచి మంచిబేరము దెచ్చుటకుగాని ఇతరపనులకుగాని కావలసిన సొమ్ములేదు. నిలుకడయైన బజారులుగాని శాస్త్రబద్ధములగు పణ్యచక్రములు మచ్చులదొడ్లును గాని లేవు. మఱియు శాస్త్రక్రిమానుసారములగు బేరసారములును లేవు. గ్రామములమధ్య రాకపోకలకు ఉత్తరప్రత్యుత్తరములకు తగినన్ని సంసర్గమార్గములును లేవు.

కాని యీ లోపములు మెల్లగా సవరింపవచ్చును. ఇప్పుడు దేశములో పలుగ్రామములందున్న పరపతిసంఘములనే సరకులు రాశీకరణముచేయు కేంద్రస్థానములుగా ఏర్పరుపవచ్చును. ఆ సంఘసభ్యులకే ఇట్టి వ్యాపారావసరముల కొరకు తగినద్రవ్య మప్పీయవచ్చును. పంటలపైన సరకుల

పైన ఇంకను విరివిగా అప్పు లిచ్చుచు వాని సరఫరాకు వీలు కలిగింపవచ్చును. ఫైనాన్సింగు సెంట్రలు సహకార బ్యాంకు లును జిల్లాబోర్డులు మునిసిపాలిటీలు ప్రభుత్వము వారును తగిన గిడ్డంగులు నిర్మింపవచ్చును. గిడ్డంగి రశీదులు అనగా వానిలో సరకు నిలువయుంచబడినట్లు చూపుచీట్లను వినిమయయోగ్య పత్రములవలెనే బదలాయింపుచేయు పద్ధతి నాచరణములో బెట్టి క్రయవిక్రయవ్యాపారమునకు మంచిపలుకుబడి కలిగింప వచ్చును. ఇది అమెరికా జర్మని జపాను దేశములలో విరివిగా జరుగుచున్నది. మన దేశములో ప్రభుత్వము తగినంత శ్రద్ధ పుచ్చుకొని తగిన శాసనములు చేసినగాని అన్ని లోపములు తీరి వ్యాపార మభివృద్ధిగాంచదు. జర్మనీయందువలెనే మన దేశ ములోకూడ కృషిసంబంధ వ్యాపారమును ఫైనాన్సింగు బ్యాం కులు ప్రారంభించి దారిచూపినగాని రైతులు దానిలో స్వంత ముగా ప్రవేశింపరు. ఇతర వ్యాపారసంఘములు బయలుదేరినను అట్టిబ్యాంకులతో కలిసి పనిచేయవలెను. దీనికిగూడ సర్కారు వారు తగినరీతిని పూనుకొనినగాని వ్యవహారములు బాగు పడవు.

కర్షకులకు చౌకరేట్లపైన సరసమగు షరతులపైనను అప్పులు కావలసియుండుటయే గాక, నీటిపారుదల సౌకర్య ములు, చిన్న చిన్నమళ్లుగానున్న పొలములను ఏకఖండ ములుగా చేసికొనవలసిన యావశ్యకత, పారిశుద్ధ్య ఆరో గ్యమార్గముల యభివృద్ధి, పొలములకు మంచి ఆవరణలు (Fencing) పశువులభీమా, పాడి దినుసులయుత్పత్తి (Dairy),

కృషిపరికరముల సరఫరాయు, పండిన పంటలకు దిను సులకు సరియైనధర రాబట్టుటకు విక్రయపుటేర్పాటులుగూడ రైతుల కత్యంతావశ్యకములగు కార్యములుగా నున్నవి. అందువలన సహకారులీమార్గములందు సహకారము నుపయోగించి లాభము కలిగింప దలచి కొన్ని కొన్ని చోట్ల నీపద్ధతుల నాచరించి చూచుచున్నారు. కొన్నిచోట్ల నివి లాభకరములుగ నున్నవిగాని కొన్నిచోట్ల నివి నష్టకరములుగనే పరిణమించుచున్నవి.

మార్కెటింగ్ లేక విక్రయ సౌకర్యసంఘములు: వంగరాష్ట్రమున పండిన జనుమును వరిని విక్రయించుట కొరకేర్పడినసంఘము లభివృద్ధిజెందుటలేదు. కాని బొంబాయిలో గుజరాతు కర్నాటక జిల్లాలందలి ప్రత్తి విక్రయసంఘము అభివృద్ధి గాంచుచున్నది. ఇట్లే బెల్లము పొగాకు మిరపకాయలు, వరిధాన్యము, ఉల్లిపాయలు, వక్కలు, విక్రయించుటకును సహకారసంఘము లేర్పడినవి. పంజాబులో వివిధసరకులు నిలువయుంచి అమ్ముటకు సహకారకమీషను వ్యాపారపుకొట్లు స్థాపింపబడినవి. మదాసులోకూడా కొన్ని చిన్నసంఘములు కలవు. ఈసంఘములవలని లాభము లేమన: (1) తూనికలో మోసము లేకుండుట, (2) సరకులకు సరియైన మంచిధరలు వచ్చుచుండుట, (3) అగ్నిభయము లేకుండ సరకు భీమాచేయబడుట, (4) విక్రయధనము ఆసామికి వెంటనే చెల్లింపబడుట, (5) సరకు విక్రయింపబడువరకును సొమ్ము సర్దుబాటు చేయబడుట, (6) బొంబాయి బజారుధరల తప్సీలు

అనుదినము తెలుపబడుచుండుట, (7) సంచులను సరఫరా చేయుట, (8) నికార్సుఅయిన విత్తనములు సంపాదించియిచ్చుట (9) బోనసు లాభవిభాగము పంచిపెట్టబడుట.

చిన్న చిన్న మళ్ళను ఏకఖండములుగ జేయు సంఘములు (Consolidation of Holdings Societies):—
చిన్న చిన చీలికలుగా నున్న పొలములు నెల్ల ఏకఖండములుగా జేసి వ్యవసాయము చేయించిన లాభకారియని అందరెఱుగుదురు. కాని ఇది మన కుటుంబములలో సులభసాధ్యము కాకున్నది. గ్రామస్థులలో ఐకమత్య మున్నచో నిది సులభము. లేదా లాభముకొరకు వ్యక్తులు భాగస్వామ్య వ్యాపారము జేయునట్లే ఈ సహకారకార్యమునందు పాల్గొని భూమి నేకముజేసి ఏకఖండముగా విభజించుకొనవచ్చును. పంజాబులో 1920 న సంవత్సరమున నీయుద్యమము ప్రారంభమైనది. చాల కష్టముపైన పంజాబులోని యూనత్తు సాగుభూమి 3 కోట్ల ఎకరములలో 1930 జూలై నెలాఖరు నాటికి 2,63,462 ఎకరము లేకీభూతముచేయబడినవి. ఇది చేయుటకు ఎకరమునకు రు 2-5-0 లు వ్యయ మైనది. ఇందువలన వ్యవసాయము బాగుపడినది కొత్తవాగ భూపయోగింప బడినవి. క్రొత్తపైరులు వేయుట కవకాశము కలిగినది. చవిటినేలలో నుండి ఇసుక తీసివేయబడినది. చెట్లు విత్తనములు నాటబడినవి. కౌలుభూమి శిస్తులు హెచ్చినవి. వ్యాజ్యములు తగ్గినవి. పంటలు హెచ్చినవి. క్రొత్తభూములు సాగుచేయబడినవి. క్రొత్తనూతులు త్రవ్వబడినవి. పాతవానిని బాగుచేసిరి.

రోడ్లకు దారులు వేయబడినవి. ఫలవృక్షములు నాటబడినవి. మధ్యరాష్ట్రములలో చట్టిసఘర్ డివిజనులో కూడా ఈ పని కొంత జరిగినది. 1928 లో నొక శాసనము కూడా చేయబడి నది. బొంబాయిలో నొక చట్టము ప్రవేశపెట్టబడెను గాని ప్యాసు కాలేదు. సంయుక్త పరగణాలలో నిట్టి సంఘములు 11 కలవు. బరోడాలో 11 కలవు.

నీటిపారుదల సంఘములు (Irrigation Societies): బంగాళాదేశమునం దిట్టి సంఘములు 1919 లో ప్రారంభమై ఇప్పుడు 1,000 కలవు. ఇందు 20,000 సభ్యులు కలరు. చెల్లింపబడిన మూలధనము రెండులక్షల రూపాయిలు. వర్కింగు పెట్టుబడి 4 లక్షలు. వీని పనులు, క్రొత్త జలాధారములు నిర్మించుట. పాతవానిని బాగుచేయుట. సుందర బన్సులో నివి వృద్ధిజెందినవి. మురుగునీటి పారుదలను గూర్చియు వరదలవలన నష్టము కలుగకుండుటకు గట్లు మున్నగు వానిని వేసియు నివి పని చేయుచున్నవి.

పాలసంఘములు: ఇవి కూడా వంగదేశమునం దధిక ముగా నున్నవి. పాలవ్యాపారము కూడా చేయురైతులు సభ్యులుగా నున్న 108 గ్రామసంఘములు పాలు సరఫరా కొరకేర్పడియున్నవి. కలకత్తా పాలసమితి, ఈ పాలను కావల సినవారి కందజేయుచుండును. ఈసమితికి చాలాచోట్ల డిపోలు కలవు. ఇట్టి సమితులైదు గలవు. వీనిలోనొకటి డార్జిలింగులో నింకొకటి డక్కాలోను కలవు.

గ్రామపునర్నిర్మాణ సంఘములు:— సహకారోద్యమ ములో నీకార్యము పొందవలసినంత ప్రాముఖ్యత పొందలేదు. ఇది దేశాభిమానముగల యువకులకృషివలననే వర్ధిల్లినది. పంజాబులోని గుర్గాన్ (Gurgoan) లో నొక గ్రామ పునర్నిర్మాణ కేంద్రము కలదు. విద్య, పారిశుద్ధ్యము, వైద్య సహాయము, వ్యవసాయాభివృద్ధి, స్త్రీ విద్య, బాలెంతల సంరక్షణము నచ్చట జరుగుచున్న పనులు. పంజాబులో లయల్పూరులో కూడా కొన్ని సంఘములు, పశువులను పెంచుట, పశుపాలనము, వ్యవసాయాభివృద్ధి, నయోజన విద్య, పొదుపు, శ్రేష్ఠతరజీవనము, తగవులను మధ్యస్థ తీర్మానముచే పరిష్కరించుకొను పద్ధతు లవలంబించి గ్రామ పునర్నిర్మాణోద్యమమునకు దారిజూపుచున్నవి. వంగదేశ మున రవీంద్రనాధటాగూరుగారి విశ్వభారతిలో నొక శాఖ యీపనికి పూనుకొని బీర్భంజిల్లాలో ఆరు సహకార సంఘములను స్థాపించినది. సుందరభవన ప్రాంతములందు సర్ డాయల్ హామిల్టన్‌గారు నిందులకు పాటుపడుచున్నారు. మద్రాసులో రాష్ట్రీయ సహకారసమితి (P. C. U.) వారు 8 గ్రామపునర్నిర్మాణ కేంద్రములను స్థాపించి పనిచేయు చున్నారు. కాశీలోకూడా నొక కేంద్రము కలదు. బంగాళ ములోని మలేరియా నివారణ సంఘములుకూడ ఇట్టివే. మధ్యరాష్ట్ర ప్రభుత్వమువారు 1929 వ నవంబరునుండి పిహా రియా జిల్లాలో నొకచోట నీ ప్రచారము సాగించినారు. నిమర్ బెతుల్ జిల్లాలలోని కొన్ని గ్రామములందు నీ పనులు

చేయ ప్రియత్నించుచున్నారు. బొంబాయిలో తాలూకా అభివృద్ధిసంఘములు నిందుకొరకేర్పడినవే. దీనిలో ప్రభుత్వ వ్యవసాయ సహకారశాఖలు కలిసి పనిచేయుచున్నవి.

శ్రేష్ఠతరజీవనసంఘములు (Better Living Societies): ఇవి తమసభ్యులకు సౌఖ్యము కలిగించుట కేర్పడినవి. ఇట్టివి పంజాబులో 300 కలవు దీనికి చందాగాని, విరాళము గాని లేదు. అయితే ఇంకలి సభ్యులు తమయిండ్లలో కలుగు శుభాశుభకార్యములందు వ్యయము తగ్గించునట్లు ప్రమాణము చేయవలెను. ఇది మీరినవారీ సంఘనిబంధనల ప్రకారమపరాధ మిచ్చుకోవలసియుందురు. ఈ సొమ్ము గ్రామస్థులయొక్క సమష్టిక్షేమము కలిగించు కార్యములకు వినియోగింపబడుచుండును. ఈసంఘములు గ్రామ పారిశుద్ధ్యమును సౌఖ్యమును పెంపొందించుచున్నవి.

విద్యాసంఘములు: పంజాబులో వయోజనవిద్యకొరకు కొన్నిసంఘములును పిల్లలవిద్యకొరకు కొన్ని సంఘములును గలవు. మొదటిరకపు సంఘములోని సభ్యులు ఉపాధ్యాయుల జీతముకొరకు స్వల్పపుప్రవేశరుసుమును స్వల్పపు నెలజీతము నిచ్చెదరు. ఊరిలోని ప్రైమరీ స్కూలు ఉపాధ్యాయుడే అదనపువేతనమునకు పెద్దవారికి చదువు చెప్పుచుండును. కొన్నాళ్లకీ పాఠశాలలను జిల్లాబోర్డు తన

మేనేజిమెంటుక్రిందికి తీసికొనును. ఇట్టిపాఠశాలలు 200 బయలు దేరినవి. 150 నిర్బంధ విద్యాబోధన పాఠశాలలుకూడా స్థాపింపబడి పిల్లలకు విద్యాబోధనము చేయుచున్నవి. పంజాబు వలెనే సంయుక్తపరగణాయు నీయుద్యమము కొనసాగించుచున్నది. బీహారు - ఒరిస్సాపరగణాలో పరపతిసంఘములే యీ యవకాశమును సభ్యులకు కలిగించుచున్నవి. అనగా వాని యాజమాన్యముక్రింద పాఠశాలలు స్థాపించవచ్చును. వంగదేశమున చాలాసంఘములు విద్యకొరకు సొమ్ము వ్యయముచేయును. కొన్ని రాత్రి పాఠశాలలను స్థాపించినవి. ఒక జిల్లాలోనే 38 పాఠశాలలు, 2 ఉన్నతప్రాథమిక పాఠశాలలు, నేర్పడినవి. గంజాయిపంటలసంఘములును తను లాభమును విద్యకొరకే వ్యయముచేయుటవలన 3 ఉన్నతపాఠశాలలు 87 ప్రాథమిక పాఠశాలలు స్థాపింప వీలుకలిగెను. బొంబాయి సంఘములును పాఠశాలలకు విరాళములు విద్యార్థి వేతనములు నిచ్చుచున్నవి.

మలేరియా నివారణసంఘములు (Anti Malaria Societies):— వంగదేశములో మలేరియాజ్వరము లధికముగా నున్నవి. అందువలన గ్రామపారిశుద్ధ్యమును బాగుచేయుటకును, మలేరియా నివారణ మార్గములు, చికిత్సలు విరివిగా చేయుటకు నాపరగణాలో సహకారసంఘములు స్థాపింపబడి

నవి. 1918 సం॥రం మార్చిలో నిట్టి సంఘము మొదట స్థాపింపబడెను. మరుసటి వత్సరమున కేంద్రసంఘములు స్థాపింపబడెను. ఇప్పుడు 600 సంఘములు కలవు. ఈ సంఘముల చందాలవలన ప్రతిసంఘమునకునొక వైద్యుడు నియమింపబడును. ఆతడాసంఘసభ్యుల కుటుంబముల కుచితముగా వైద్యము చేయును. ఈ సంఘములకు పరోపకారులు దానములు విరాళములు నొసగుచుందురు. గవర్నమెంటుకూడా వార్షిక విరాళము లిచ్చును.

# సహకార వస్తునిలయోద్యమము

## పంచమ భాగము.

## ౧

## సహకారసంఘముల వర్గీకరణము

### సహకారసంఘము లెన్ని విధములు?

సహకారసంఘములను పలువురు పలువిధములుగా విభజించియున్నారు. కొందరు గ్రామసంఘములు పట్టణసంఘములనియు, కొందరు ఉత్పత్తి వినియోజకసంఘము లనియు, మరి కొందరు పారిశ్రామికకృషిసంఘము లనియు, విభజించిరి. సంఘవ్యవహారములను బట్టి పరపతి, ఉత్పత్తి, క్రయము, విక్రయము, అను నాలుగు తరగతులుగా ఏర్పడినవి. ఫ్రెంచిసహకారులు ప్రొఫెసరు వాష్‌గారును మూడువిధములుగా విభజించిరి. ఒకటి **మూలాధార సంఘములు:** (Resource) తమసభ్యుల వృత్తివ్యాపారములకు ముఖ్యముగా గావలసిన మూలాధారనిర్మాణమే ప్రధానోద్దేశముగా గల సంఘములు. ఈ ఆధారము పరపతిసంఘములందు రొక్కరూపము దాల్చును. విత్తులు ఎరువు, పరికరములు, సరఫరాకొర కేర్పడిన సంఘములందు వస్తురూపముదాల్చును. ఏలనన సభ్యుల సరకులకు బదులుగా నవి రొక్కమిచ్చునుగదా. రెండవ తరగతి సంఘములు: ఉత్పత్తిసంఘములు. ఇందు వస్తుఉత్పత్తికొరకు వ్యక్తులు కలియుదురు. ఇందు సాధారణ

ముగా పారిశ్రామికసంఘములు హెచ్చుగా నున్నను సాము దాయికకృషిసంఘములు సాముదాయిక కార్మికసంఘములు నిందు చేరును. వ్యక్తి స్వామ్యము వ్యక్తిసంబంధప్రవ్య మును లేకుండ జేయుటయే దీని యుద్దేశము. మూడవరకము వినియోజకసంఘములు. అన్ని వస్తు విక్రయశాలలు వస్తు నిలయములు( Stores )దీనిక్రిందికి వచ్చును. వస్తువినిమయ సాధనములను ఉత్పత్తి సాధనముల నొక్కచోట జేర్చి, పెట్టు బడి పోటీపద్ధతులకు బదులు సాముదాయిక విక్రయ పద్ధతు లను నెలకొల్పుటయే వీని యుద్దేశము. పైన చెప్పబడిన విభ జన ప్రకారమే బొంబాయి సహకార చట్ట మూపరగణాల లోని సంఘములను విభజించినది.

భారతదేశమున పరపతిసంఘములే విరివిగా బయలు దేరినందున ఇక్కడ "పరపతి సహకారము పరపతీతరసహ కారము" అను రెండు తరగతులుగా విభజింపబడుచున్నది.

"దేశీయ దేశాంతర సహకారము" అను గ్రంథమున సి. ఆర్. ఫే గారు (1) సహకారబ్యాంకులు, (2) సహకార కృషిసంఘములు, (3) సహకార పారిశ్రామిక సంఘములు, (4) వస్తునిలయములు అను నాలుగు తరగతులుగా విభజించి నారు. "నానా దేశ సహకారము" అను గ్రంథమును రచి యించినవా రొక క్రొత్తపంథాను త్రొక్కి సహకారప్రయో జనమునుబట్టి ఉత్పత్త్యర్థ సహకారము వినియోజనార్థ సహ కారము అని రెండు పెద్ద తరగతులుగా విభజించినారు. మొదటిదానిని మరల నిట్లు విభజింపవచ్చును.

వస్తువుల ఉత్పత్తికొరకు చేరుసంఘములు:

౧. సహకారమార్గములపైన ఉత్పత్తి చేయు సంఘములు.

(i) అపక్వ పదార్థములు ఉత్పత్తి చేయు సంఘములు. ఇందు సహకారకృషి (సాగు) చేరును.

(ii) తయారు సరకులు ఉత్పత్తిచేయుస్వతంత్రములగు అంగళ్లు.

౨. వ్యక్తులే ఉత్పత్తిచేసిన సరకులను ఉమ్మడిగా విక్రయించు సంఘములు.

(i) అపక్వపదార్థములు, ధాన్యములు, గుడ్లు, కోళ్ళు, జాతులు, పండ్లు మొదలగు వానిని విక్రయించునవి.

(ii) అపక్వపదార్థములను తయారు సరకులుగా మార్చునవి. ఉదాహరణమునకు క్షీరజయంత్రాగారములు.

(iii) తయారు వస్తువులు, చేతిపనులవలన జేయునరకులమ్మునవి.

3. అపక్వపదార్థములను ఉత్పత్తిచేయు సాధనములను తమ హస్తగతముగా జేసికొనుటకు ఉత్పత్తిదారులు చేరుసంఘములు. ఉదాహరణము: వస్తునిలయములకు సంబంధించిన ఉత్పత్తిశాఖలు.

౪. పైన చెప్పబడినట్టి టోకు ఉత్పత్తి సంఘములు; అందుకొరకు భూమిని, ఆస్తిని సంపాదించిన టోకు సంఘములు.

(ఆ) ప్రజాసేవ సాధనము లుత్పత్తిచేయు సంఘములు. ఉదాహరణము: వార్తాపత్రికల ముద్రణ సంఘములను పేర్కొనవచ్చును.

II. వినియోజనకొరకు చేరుసంఘములు.

(అ) వస్తువుల వినియోజన అనగా అనుభవము కొరకు ఏర్పడినసంఘములు

౧. గృహమునకు వలయునవి. ఇవి కేవలము వస్తునిలయమునకు సంబంధించినవి.

౨. వర్తకమునకు సంబంధించినవి:

i ముడిపదార్థముల నుత్పత్తిచేయువారివి. ఉదాహరణము: కర్షకులసంఘములు.

ii తయారు సరకు లుత్పత్తిచేయువారివి ఉదాహరణము: చెప్పులకుట్టువారిళ్ళసంఘములు.

iii ప్రజాసేవసంఘములు. ఉదాహరణము: బళ్ళవాండ్రు, గుఱ్ఱములను బండ్లను కొనుటకు చేరు సంఘములు.

(ఆ) వృత్తులయొక్క ప్రజాసేవను పొందుట కేర్పడినసంఘములు.

౧. పరపతి.

i వ్యక్తి పరపతి; దీర్ఘవాయిదా స్వల్పవాయిదా.

ii భూసంబంధ లేక తనఖా సంఘములు.

iii భవననిర్మాణ సంఘములు. దానికొరకు అప్పులిచ్చు ఆంగ్లదేశ పద్ధతివి.

౨. భీమా (౧) పంటలపైన (౨)జీవములపైన (కోళ్లు బాతులు వగైరా) (3) మనుష్యుల జీవితములపైన ఆస్తిపైన చేయబడు భీమా.

3. గృహసేవలు లేక గృహసౌకర్యముల సంఘములు (Domestic services)

i పాలిపద్ధతిని అద్దెకుండువారి సంఘములు.

విద్యుచ్ఛక్తి సరఫరాసంఘములు

iii టెలిఫోను సంఘములు

iv బట్టలుదుకు సంఘములు

సహకార సంఘమును ప్రాథమిక సంఘములు సమ్మేళనములని రెండుగా విభజించవచ్చును. ప్రాథమిక సంఘములో వ్యక్తులు, ప్రాథమిక సంఘసమ్మేళనములు, చేరును. సమ్మేళనములు నాలుగు విధములుగ విభజింపబడు చున్నను పైన చెప్పబడిన సంఘముల స్వభావమును బట్టి ఆయా తరగతికి జెందినవిగా యూహింపవచ్చును.

సమ్మేళనములు:

i సంఘ నిర్మాణము (Organization) పర్యవేక్షణ (Supervision) ప్రచారము (Propaganda) కొరకేర్పడినవి. ఉదాహరణము: సమితులు, యూనియనులు (Unions) సహకార అభ్యాసన పాఠశాలలు (Institutes)

ii పరపతి లేక ఋణదానము కొరకేర్పడినవి. బ్యాంకింగు యూనియన్లు, సెంట్రలు బ్యాంకులు లేక జిల్లా బ్యాంకులు.

iii వ్యాపారముల కొరకేర్పడినవి. సరఫరాకొరకు గాని విక్రయముకొఱకుగాని ఏర్పడిన (టోకు) సంఘములు.

iv పైన చెప్పబడిన పనులలో నేరెండైనగాని హెచ్చుపనులనుగాని నిర్వహించుట కేర్పడినవి.

చిన్నచిన్న స్థానిక సమ్మేళనము లెల్ల చేరి స్థానికసమితులు (Unions)గాను, అట్టివి చేరి జిల్లాసమ్మేళనములుగాను, అట్టివి చేరి రాష్ట్రీయ సమితులుగాను చేరును. టోకువర్తక సంఘములు బ్యాంకులుకూడ నిట్లే పైయధికారముగల సంఘములక్రింద చేరును. ఇటీవల అంతర్జాతీయసహకారసమ్మేళనములుగూడ బయలుదేరినవి.

భారతదేశప్రభుత్వమువారు తమ వార్షికనివేదికలందు సెంట్రలు బ్యాంకులు ప్రాథమికసంఘములు సమితులని మూడు

తరగతులుగా సహకారసంఘములను విభజించుచున్నారు.

ఇట్లు సహకారసంఘముల తరగతులవిభజనము చాలా కష్టసాధ్యమైన పని. ఏలన సహకారసంఘములు సాధించు కార్యము లేదో యొకవిధమునకు జెందినవిగాక నానావిధములై అమిశ్రములై యున్నవి.

౨

రెయిఫీసెన్ బ్యాంకులు - పరస్పరపతిసంఘములు.

మన దేశములో నిప్పుడు విరివిగా గ్రామములయందు కనబడుచున్న సహకార పరపతిసంఘములు జర్మనీ దేశీయుడగు రెయిఫీసెన్ గారు (Raiffeisen) స్థాపించిన బ్యాంకులవంటివే. రైతులకు అందుబాటులో నొక అప్పులిచ్చు బ్యాంకియు సరకు నందించు అంగడియు స్థాపించుట, అతడు దాపరికము చేయదల చిన ఎంతచిన్న మొత్తమైనను నిక్షేపముగా సంగ్రహించి వానికి పొదుపు సలవాటు చేయుట, అనవసరవ్యయములకొరకు కాత డప్పుచేయకుండ నివారించుట, రైతునకు విద్య, విజ్ఞానము, ఐహికసౌఖ్యము, కలిగించుటయు జర్మనీబ్యాంకుల యొక్క ముఖ్యోద్దేశములు. మన దేశములో అప్పులిచ్చు ఉద్దేశము బాగుగా నెరవేరినది గాని తక్కినయుద్దేశములు నెరవేర లేదు. పరపతిసంఘములు ప్రజల కితరవిధములుగా తోడ్ప డుట లేదు.

జర్మనీ బ్యాంకులయొక్క ముఖ్యలక్షణములు.

1. సంఘము జరుపు వ్యవహారమండలముయొక్క వైశా ల్యము నిర్ణీతమై పరిమితమై యుండును. అందు మన

సభ్యు లొకరినొక రెఱుగుటకు మంచి చెడ్డలు తెలిసి కొనుటకు వీలుండును.

2. సభ్యుల వాటాలు చాలా స్వల్పమొత్తములై యుండును. అందువలన బీదలు కూడా చేరుటకు వీలుండును.

3. శాశ్వతమును అవిభజనీయమును నగు క్షేమనిధి యుండును.

4. సభ్యుల బాధ్యత అపరిమితము; అనగా సంఘము యొక్క యావత్తు బాకీలకు ఆ సభ్యుడు పూచీపడ వలసియుండును.

5. ఋణము వస్తుఉత్పత్తి కార్యములకును క్షేమలాభము లకునై యుండవలెను. ఆ ఋణ మట్లు ఖర్చుపడినదా లేదా యని కూడ సంఘము కనిపెట్టి చూడవలెను.

6. ఋణములు సభ్యులకు మాత్రమే యివ్వబడవలెను.

7. ఒక సంవత్సరము మొదలు మూడేండ్లవరకును పర పతి లేక గడువుపైన వాయిదాలపైన తీర్మానించు కొనుటకు వీలుండును.

8. ప్రతి సాలున సాధారణసంఘము సమావేశమై ఒక్కొక సభ్యు డెంత అప్పు పుచ్చుకొనుటకు తగునో ఆసంగతి, సంఘములో నిక్షేపించతగిన ధరావతు మొత్తము, సంఘము ఇవ్వతగినఋణములమొత్తము నిర్ణయించు చుండవలెను.

9. అప్పు పుచ్చుకొనుసభ్యుడు ఆ సొమ్మును ఇన్నాళ్ళలో ఇంత వడ్డీతో తీర్మానించులాగున ఒక బాండుపత్రమును వ్రాసియివ్వవలెను. మరియు అతనితోపాటుగా ఆ బాకీ తీర్చుటకు పూచీపడుచు ఇంకొకసభ్యుడు జామీను బాండుకూడా వ్రాయవలెను. అది అప్పుగా గాక కరెంటు అక్కౌంటు కాతాగా వ్యవహరింపబడనేని ప్రతి అరసంవత్సరము కాతా పరిష్కరింపబడవలెను.

10. సంఘము లాభమును సంపాదించుప్రయత్నము చేయరాదు. లాభవిభాగము లుండవు. ఇవ్వబడినను, ఋణమూలిచ్చు వడ్డీనిబట్టి ఒకపరిమితి నిర్ధారింపబడవలెను.

11. అధికారవర్గమునకు కార్యనిర్వాహకులకు జీతబత్తెము లుండరాదు. కార్యదర్శికి అక్కరవుండుటకు కొద్దిపాటి గౌరవేతన మొసగబడవచ్చును. పరిపాలనవ్యయము సాధ్యమైనంత తక్కువగా నుంచబడవలెను.

12. సభ్యులకమ్ముటకు వ్యవసాయపరికరములను కొనుటకు, సంఘముసొమ్ము ప్రత్యేకించును. వ్యవసాయముచేయు యంత్రములను పరికరములను దెప్పిసభ్యుల కద్దెకిచ్చును

13. సభ్యులనైతిక ఐహిక అభివృద్ధికొరకు సంఘము తోడ్పడును.

ప్రతిసంఘముయొక్క పరిపాలనమునకు ఒకసాధారణ సంఘసభ, కార్యనిర్వాహకసంఘము లేక మేనేజింగుబోర్డు, ఒక కార్యనిర్వాహకాధికారి, పైతనిఖీకవున్సిలు, నుండును.

మొకటి సంస్థ వడ్డీరేట్లు నిర్ణయించి తక్కిన రెండు ఉపసంఘములను నియమించును. సంఘముయొక్క వార్షిక నివేదికలు లెక్కలు వ్యవహారములు సరిచూచును. రెండవసంస్థ సంఘ వ్యవహారములు నెల్ల జక్కబెట్టును కార్యనిర్వాహకాధికారి వారు చెల్లింపులు చేయును. మూడవసంస్థ మూడు నెలలకొకమారు సంఘవ్యవహారములు లెక్కలు చూచును, సంఘముయొక్క ఆర్థికస్థితి పరిశీలించును, అప్పులు పుచ్చుకొనువారి స్థితిగతులు పరిశీలించును, వారిఆస్తి అంచనాలువేయును. సంఘము ధరావతులపైన నూటికి 3 - 4 వంతున వడ్డీయిచ్చును. అప్పులపైన నూటికి 4-5 ఇచ్చును. సభ్యులుగాక ఇతరుల వలన కూడ ధరావతులు పుచ్చుకొనును. గ్రామసంఘములు జిల్లాబ్యాంకికిక్రిందను యూనియనుక్రిందను ఉండును.

### * సార్వజనిక సహకారము.

అర్థోత్పత్తియందును అర్థవిభజనము నందును, సాంఘిక సేవల నిర్వహణమునందును చాలవరకు, నేటిఆర్థికపద్ధతికి లాభసంపాదనాభిలాష యేపునాదిగా నున్నది. ఈ పద్ధతి వలన కూలి, వేతనములు, వడ్డీ, లాభవిభాగములు, ఇతర విధములగు లాభముల మూలమున ధనాన్వేషణమే మానవ జీవితమునందు ప్రధానపురుషార్థముగా పరిణమించినది.

వ్యాపార మనునది, సరకులను పారిశ్రామికోత్పత్తి సాధనములను చౌకగా గొని ప్రియముగా నమ్ముటయేయైనం

*Co-operative Democracy - Warbasse.

దున ప్రపంచవ్యాపార మొక నిలుకడలేని బేరముగను జూదముగను పరిణమించినది.

పారిశ్రామికోత్పత్తియందు లాభసంపాదనోద్దేశము ప్రబలమై, ప్రజలు కొనగలదానికన్న నధిక ఉత్పత్తికి కారణమైనది. ఉత్పత్తి చేయబడినసరకును భుక్తపరచుకొనుటకు తగిన కొనుగోలుశక్తి పాటుపడువారికి లేకున్నది. ప్రతిదేశమునందు నిట్లు మితిమీరిన యుత్పత్తి యగుచున్నందున సరకులను పరదేశములందు చలామణిచేయుటకు ప్రయత్నములు జరుగసాగినవి. కాని ప్రతిదేశమునందలి సహజసంపదయు ఒక్కొక్క తెగవారిచేతులలో జిక్కి ప్రతిచోటను జనసామాన్యమునకు కొనుగోలుశక్తి తగ్గిపోయినది. ఇందువలన ప్రపంచార్థిక పరిస్థితులకే ముప్పువచ్చుస్థితి సంభవించినది.

లాభసంపాదనాభిలాష పూర్వ మొక సంస్థాపకనిర్మాణశక్తిగానుండెను. నేడది వివిధప్రజలందు స్పర్ధ, విరోధభావమును కలిగించి మానవసంఘవిచ్ఛిత్తికి కారణమగునట్లు చూపట్టుచున్నది. రాజకీయఅన్యాయములకు, దారిద్ర్యమునకు, అపరాధములకు, రోగములకు, అజ్ఞానమునకు, యుద్ధములకును, లాభాన్వేషణము మూలకారణములను గల్పించుచున్నది. సాంఘికజడత్వమువలన వర్తమానపరిస్థితులు చలింపక యట్లే నిలిచియుండుట తటస్థించును. జనసామాన్యమున కింతకన్న మంచిపరిస్థితు లుండుననుసంగతియే తెలియదు. ధనవంతులు విద్యావంతులు పలుకుబడి గలవారు, సాంఘికముగా బలవంతులై వర్తమాన పరిస్థితులవలన లాభమునందుచు ఆర్థిక

విధానమును నేటి సాంఘికవిధానము పైననే శాశ్వతముగా నిలిపి యుంచుదురు. వారే ప్రభుత్వమున పలుకుబడి కలిగి యుందురు. అభిప్రాయప్రకటనము, విద్య, మారకము వారి చేతులలోనే యుండును. లాభసంపాదనపద్ధతికి బదులుగా వేఱొకపద్ధతిని నెలకొల్పుటకు వా రంగీకరింపరు.

దారిద్ర్యమువలన బాధలవలనగలుగు అసంతృప్తి, లాభసంపాద నాభిలాషవలన కలుగు అన్యాయములపట్ల తిరుగుబాటు, మానసికవిప్లవము, క్రమవిద్యాభివృద్ధియు, పారిశ్రామిక పద్ధతులం దింకొకమార్గము నన్వేషించుటకు ప్రజలను పురికొల్పుచున్నవి.

అర్థోత్పత్తి విభజనలందును, ఆర్థికసాంఘికవ్యవహారములందును లాభసంపాదనపద్ధతికన్న సంఘసేవాపద్ధతియే సంఘమున కధికతరప్రయోజనకారియనియు, సాంఘికసేవయే ప్రధానోద్దేశమగు వరకు సంఘము నందలి అక్రమములు అన్యాయములు తొలగిపోనేరవనియు, ప్రజలు క్రమక్రమముగా గ్రహించుచున్నారు.

అర్థ సంపదను వస్తువులను చక్కగా అనుభవింపగలందులకు ప్రజ లేర్పరచుకొను నిర్మాణ వ్యవస్థావిధానములే సహకారోద్యమముగా పరిణమించినవి. సంఘసేవకొరకే వస్తు ఉత్పత్తి వస్తు అనుభవ విధానములను వినియోగింపదలచు రాజకీయేతరసంస్థ యిది యొక్కటే.

ప్రతి దేశములోను జనసంఖ్యలో చాల భాగము సహకారసంఘములుగా నేర్పడుట కవకాశము కలదు. నేడు

లాభసంపాదన కొరకు చేయబడుచున్న పను లన్నియు నీ సంఘములే సంఘసేవ నిమిత్తమై నిర్వహింపవచ్చును. మఱియు ప్రభుత్వములు చేయుచున్న ప్రజోపయోగకర కార్యములను సైతము ఈ సంఘములు చేయవచ్చును. అందు ముఖ్యముగా సాంఘికవాదుల చేతులలో ప్రజాప్రభుత్వ మున్నచో నేయే ప్రజాహితైక కార్యములను చేయదలతురో ఆ యా కార్యముల నెల్ల ఈ సంఘములు చేయ వీలగును. ఇట్లు ప్రభుత్వాధికార ములనెల్ల విఘ్నము లేకుండగనే చేజిక్కించు కొనవచ్చును. సహకారసంఘములు పరిపూర్ణాభివృద్ధి గాంచినచో నేడు ప్రజాజీవనమునందు ప్రధానస్థానము నాక్రమించుచున్న లాభము లార్జించు వ్యాపారవ్యవస్థయు, అధికారమును చలాయించు ప్రభుత్వ వ్యవస్థయు, క్రమక్రమముగా వెనుకకు పోయి ఆర్థిక సాంఘిక సేవలెల్ల సహకారసంఘముల ద్వారముననే నిర్వహింపబడగలవు.

ప్రతిదేశములోని సహకారసంఘములును గలిసి ఒక్కొక జాతీయ సమ్మేళనముగా జేరవలయును. ఈ జాతీయ సమ్మేళనము లన్నియు గలిసి ఒక ప్రపంచసహకార సంఘముగా జేరవలెను. ఇట్లు చేసిననే సార్వజనికసహకారము సిద్ధింపగలదు. సార్వజనికసహకారము ప్రభుత్వ విధానముతో సంబంధములేని ఐచ్ఛికసంఘముగా నుండవలెను. లాభసాటివ్యాపారమునకు అధికారబలయుతమగు ప్రభుత్వమునకు గూడ నిది ప్రత్యామ్నాయమగు సంస్థ కావలెను. అర్థము ననుభవించు వినియోజకులగు జనసామాన్యమునకు

సేవచేయుటయు, సాంఘిక సంబంధములందు స్వయంసాహాయ్యపరస్పరసాహాయ్యపద్ధతులను నెలకొల్పుటయు, దీని యుద్దేశములుగ నుండవలయును.

సంఘనిర్మాణము సంఘమార్పు క్రమాభివృద్ధిచేత సంభవింపవలెను. ప్రజలు సంఘనిర్మాణము గావించుకొనుచు క్రమాభివృద్ధి జెందవలెను. సంఘసేవకు తోడ్పడు విద్యాబోధనము, తర్ఫీతులే ప్రజలవిజయమునకు పునాదులుగ నుండవలయును. అంతేగాని విప్లవమార్గములవలన నీఫలితము నపేక్షింపరాదు. ప్రాతస్వరూపములను నాశనము చేయదలపరాదు. శ్రేష్ఠతరములగు నవీనవిధానము లుద్భవించి వర్ధిల్లనగోలదు, ప్రాతవి వానియంతటనవి మాసిపోవలెను. లాభము నార్జించు వ్యాపారమును రాజకీయ ప్రభుత్వవిధానమును బలప్రయోగములచేతగాని బలవంతముగాగాని మార్పుటకు మాపుచేయుటకు ప్రయత్నింపరాదు. ఈ రెండు సంస్థలకన్నను సహకారమే అధికతరప్రయోజనకారియనియు ఎక్కువ చక్కగా ప్రజాసేవ చేయుగలదనియు, ఆచరణము వలన జూపగలిగినచో నా సంస్థల యుపయోగమే పోయి యవి మెల్లగ కృశించి నశించును.

సహకారసంఘముల యభివృద్ధితోపాటు పరిశ్రమలను పన్నుల భారమునుండి రక్షించుటకును, ధనవంతులు బలవంతులునగు వారిచేతులలోనుండి భూమిని ప్రకృతిసంపదలను వెలికిదీసి మరల వానిని జనసామాన్యమునకు చెందజేయుటకును, సహకారసంఘముల వలన నుపయోగింపబడుటకు,

న్యాయముగా పనిచేయు వ్యక్తులకు కౌళ్ళ కిచ్చుటకును తగుప్రయత్నములు చేయవలయును. నేటి రాజకీయార్థిక విధానముల వలన నష్టముల ననుభవించుచున్నవారే ముఖ్యముగా సార్వజనికసహకారోద్యమముకొరకు కృషిసలుపవలెను. మానసిక సాంఘిక నైతిక కారణములచేత సహకారోద్యమములోని కాకర్షింపబడిన ప్రజాసేవకులుగూడ దీనికొరకు కృషిసలుపవలెను.

మానవ సంఘముయొక్క మూలప్రకృతికి సంబంధించిన మానవస్వభావముపైననే సహకారోద్యమ మాధారపడియున్నది. విభేదములవలన విరోధములవలన యుద్ధములవలనగాక పరస్పరస్నేహము, సాహాయ్యము, పరస్పరసేవలవలననే జీవకోటియొక్క యుత్కృష్టగుణములను బహిర్గతము చేయ వీలు కలదను చారిత్రకసిద్ధాంతమును సహకారోద్యమము వ్యక్తముచేయుచున్నది. మఱియు నీయుద్యమము మానవుని నాశనము చేయుచున్న వైరముల నుండి యుద్ధములనుండికూడ రక్షింపశక్తి కలిగియున్నట్లును స్పష్టమగుచున్నది. సార్వజనిక సహకారోద్యమము స్త్రీ పురుషుల దేహములకు మనస్సులకుగూడ పరిపూర్ణవికాసము నిచ్చి ఆధ్యాత్మిక నైతిక దృష్టిని ధర్మబుద్ధిని ప్రసాదించి వారి జీవితములకు ఆనందమును సౌందర్యము నొనగూర్చుటకు పరిపూర్ణావకాశముల నొసగవలెను.

## ౪

## * భారతదేశ గ్రామపునర్నిర్మాణము - సహకారోద్యమము.

భారతదేశ కర్షకుల దారిద్ర్యము మాన్పుటకు గ్రామ పునర్నిర్మాణ ప్రయత్నములే శరణ్యమని సర్. మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు సూచించియున్నారు. ఇది సహకార సంస్థలద్వారా నిర్వహించుటకు చాల వీలుగలదు.

1931 సంవత్సరపు జనాభా లెక్కప్రకారము భారత దేశజనసంఖ్య 35 కోట్లు. దీనిలో నూటికి 90 మంది గ్రామ వాసులు. 73 వంతులు రైతులు, లేక వ్యవసాయము వలన జీవించువారు. నూటికి తొంబదియొక్క మంది నిరక్షరులై యున్నారు.

| | | |
|---|---|---|
| భారతదేశ గ్రామములలో దామాషా జనసంఖ్య | | 418 |
| బొంబాయి గ్రామములందు | ... | 562 |
| చెన్నరాజధానిలో | ... | 710 |
| వంగరాష్ట్రమున | ... | 512 |
| మైసూరు సంస్థానమున | ... | 309 |

కుటుంబమునకు దామాషాగా 5 మంది యుందురు. రైతుకు సాలుకు ఆరునెలలు పని యుండదు. రైతుయొక్క కుటుంబమునకు వచ్చుఆదాయము మూడురకములుగా నుండును.

* Rural Reconstruction in India
—Sir. M. Visweswarayya.

i వ్యవసాయములో పంటలవలన వచ్చుఆదాయము

ii సహాయక వృత్తులు చిన్నపరిశ్రమల వలని ఆదాయము.

iii పనిపాటలవలన వచ్చు ఆదాయము.

ఈ మూడురకముల ఆదాయమును వృద్ధిచేయుట కొరకు పనిచేయవలెను.

I సాగు విస్తీర్ణము హెచ్చుచేయవలెను. చెరువులు, కాలువలు, నూతులవలనినీటిపారుదలను పెంపు చేయ వలెను. చిన్న చిన్న పొలములను ఏకఖండ ములుగ చేయవలెను. సరసమగువడ్డీషరతులమీద అప్పులిచ్చు పరపతిసదుపాయములు కలిగింప వలెను. ఇంకను లాభకరములుగ నుండునట్టియు వ్యాపారమున కనువగు నట్టియు పైర్లు, పండ్లదినుసులు పండించవలెను. శ్రేష్ఠతరమగు విత్తనములు ఎరువు సంపాదింపవలెను. వీలైనచోట్ల పచ్చియెరువుకూడ సంపాదింపవలెను. చీడలు పురుగులు పట్టకుండా నివారణ చేయవలెను. కృషియందు ధన ఋణ పద్ధతులందు శాస్త్రోక్తవిధానములను సహకారపద్ధతులను విరివిగా నుపయోగింపవలెను.

II ఆయా గ్రామములందు స్థాపించి యభివృద్ధి చేయ తగిన అనుగతపరిశ్రమలు చిల్లరచేతిపనులు (ఖద్దరు) వడుకునూలు నేతపరిశ్రమ, పట్టుదారము

పరిశ్రమ, వడ్రంగము, చర్మముల పరిశ్రమ, కుమ్మరము, ఇటుకరాయి-పెంకు పరిశ్రమ, తివాచీపని, చాపలు బుట్టలు అల్లుట, త్రాడుపేనుట, పెంపుడు జీవములు పశువులు గొర్రెలు మేకలు బాతులు కోళ్లు పెంచుట, చేపలుపట్టుట మొదలగునవి, కంబళి నేత, కమ్మరము, కంచుపనులు, పొగచుట్టలు చుట్టుట, వెదురు పేళ్లపని, పాడిదినుసుల (గవ్య) ఉత్పత్తి మొదలగు గృహాపరిశ్రమలు దీనిలో చేరును. తాతలనాటినుండి మన మెరిగిన ఈ చేతిపనులేగాక విదేశీయులు చేయు కౌశల, హస్తకళలను గూడా మన గ్రామములందు ప్రవేశపెట్టవచ్చును. ఉదాహారణమునకు లేస్ (Lace) అల్లిక చిత్రపుపనులు బుటేదారిపని.

III పనిపాటల విషయములో పనిముట్లు పరికరములు యంత్రములు అద్దెకు తెచ్చి పని జరిగించుకొనవచ్చును. పొలములపైన ఇండ్లయందు పని చేయుట. అద్దెకు బండ్లు తోలుట, ఎరువు వంట చెరుకు విక్రయించుట ఇతర వృత్తులు చేయవచ్చును.

1 గ్రామములోని పెద్దవారు పనిచేయుటయందాసక్తి కలిగినవారి అర్థోత్పాదకశక్తి హెచ్చుచేయవలెనన్నచో వారికి చదువను వ్రాయను నేర్పి లెక్కలుకూడా నేర్పుట యావశ్యకము. ఇందుకు పాఠ

శాలలు, ఉపన్యాసములు ఇతర విధములగు ప్రచారము, మాజిక్కు లాంతరు సినీమా, రేడియో గ్రామోఫోనులు, సంచారగ్రంథాలయములు క్లబ్బులు తోడ్పడగలవు.

(2) i నేడు మన గ్రామస్థులు ఆడుచు పాడుచు పనిచేయుట కలవాటు పడినారు. పనిజేయువారెల్లరు పట్టుదలతోను శ్రద్ధతోను రోజుకు 8 గంటలు వారమున కారు రోజులు పని చేయుట నేర్చుకొనవలెను.

ii పొదుపు దాపరికమును అలవాటు చేసికొనవలెను.

iii ప్రతి గ్రామస్థుడు సత్యవ్రతుడై యుండి త్రికరణశుద్ధిగా ప్రవర్తింపవలెను.

iv పనిరద్దీ సమయములం దిప్పటికన్న హెచ్చు సంఘీభావము సహకారము కలిగి సమష్టికృషి చేయువలెను.

v ప్రతి కుటుంబములోని వ్యక్తులకు నేదో యొక వృత్తియందు నేర్పు, విద్యాకౌశలమును కలిగించుటకు ప్రయత్నింపవలెను. ఇందు కొరకు కృషి ప్రదర్శనపు పొలములు, పారిశ్రామిక కార్ఖానాలు అచ్చటచ్చట నుండవలెను. ఇంత

వరకు నుపేక్షింపబడిన వృత్తి విద్యలు అభివృద్ధి చేయబడవలెను.

vi గ్రామపారిశుధ్యము జాగ్రత్తగా కనిపెట్టబడి ప్రజారోగ్యము కాపాడుప్రయత్నములు వైద్య సహాయములు చేయవలెను.

ఈ విధానము జపానులో చక్కగా జరుగుచు దేశాభివృద్ధికి తోడ్పడుచున్నది. ఈ పనులు చేయుటకు ప్రభుత్వము తోడ్పడవలసి యున్నమాట వాస్తవమే. ఇది రాష్ట్రీయ స్వాతంత్ర్యము వచ్చిన వెంటనే జరుగగలదు. అయితే ప్రతి గ్రామమునందు కలుగుబడిగలగ్రామపెద్దలును ఇతరులును గ్రామోద్ధరణసంఘముగా జేరి చందాలువేసికొని పనిచేయవలెను. నాలుగైదు చిన్నగ్రామములు కలిసి ఒకసమితిగా నేర్పడి పనిచేయవచ్చును. ఈ పను లెల్ల నిర్వహించుటకు సహకారసంఘములుగా జేరి పనిచేయవచ్చును. ఇందులకు జిల్లాబోర్డులు తాలూకాబోర్డులు పంచాయతీలు తోడ్పడవచ్చును.

## X

## భారతదేశ పారిశ్రామికాభివృద్ధి - సహకారోద్యమము.

**1933** మార్చి 1వ తారీఖున ఢిల్లీలో అఖిలభారతపారిశ్రామిక ప్రదర్శనమును ప్రారంభించుచు ఆచార్య, ప్రఫుల్ల చంద్రరాయిగారు ఈ క్రింది యుపన్యాసము నొసంగిరి:

భారతదేశమునకు రాజధానియైన ఇందప్రస్థపురవరమున జరుగు పారిశ్రామిక ప్రదర్శనమును ప్రారంభింప

నియమించి మీరు నా కొసంగిన గౌరవమున కెంతయు సంతస మగుచున్నది. ఇందులకు నేను హృదయపూర్వకముగా వందనము లర్పించుచున్నాను. ఈ మహానగరమున నెన్ని యేని సామ్రాజ్యములు విలసిల్లినవి, విజృంభించినవి, నశించి నవి. ఈ నగరరాజముయొక్క చరిత్ర బహు ప్రాచీన మైనది. ముందుకూడ ఈ నగరము మహాదశ ననుభవింప గలదు. కావున నీ నగరముకన్న నింత గొప్ప ప్రదర్శన మును జరుపుటకు అనుకూలమగు స్థలము వేరొకటి దొరకదు. ఈ ప్రదర్శనము భారతదేశప్రజ లందరి దృష్టిని ఆకర్షింపగల దని నే నాశించుచున్నాను.

## 17-18 శతాబ్దములనాటి భారతదేశ సౌభాగ్యము.

మన దేశ మిప్పుడు పారిశ్రామిక ప్రపంచమునందు చాల తక్కువస్థానము నాక్రమించు చున్నదనుట నిస్సం దేహము. సమస్త సంపదలతో దులదూగుచుండిన భారతదేశ మిప్పుడు గర్భదరిద్రులగు ప్రజల కావాసముగా నున్నది. పెద్ద పట్టణములయొక్కయు, నగరములయొక్కయు, చరి త్రను చదివితి మేని సమస్తసంపదలతో దులదూగుచు, సంతృప్తులగు ప్రజల కాశ్రయమైన దేశ మిప్పు డిట్టి యధమ స్థితికి వచ్చినట్లు స్పష్టము కాగలదు.

పార్లమెంటరీ కమిటీయెదుట సాక్ష్య మిచ్చుచు క్లయివు ప్రభు విట్లు చెప్పెను. "మూర్షిదాబాదు నగరము లండను నగరమంత యున్నది. లండనులో నున్నంతమంది ప్రజలు, లండనునగరమున నున్నంత సంపద, మూర్షిదాబాదు

నందు కలదు. కాని ముర్షిదాబాదులో నివసించుప్రజలు లండనునగరమునందలి ప్రజలకంటె హెచ్చు భాగ్యవంతులై యున్నారని మాత్రము గమనింపదగియున్నది.* లండను నగరమును మించియుండినముర్షిదాబాదుకు బోయిచూచితి మేని పూర్వసంపద యెచ్చటను గానరాదు. 150 సంవత్సరములకు లోగడ ఢక్కాపట్టణముయొక్క వాణిజ్యము కోటి రూపాయలని అంచనా వేయబడెను. రెండులక్షలప్రజ లా మహానగరమున నివసించుచుండిరి. 1787 వ సంవత్సరమున ఆంగ్లదేశమునకు దిగుమతియగు ఢక్కామల్లులు 30 లక్షలు. 1817వ సంవత్సరమున దిగుమతు లాగిపోయినవి. భోగభాగ్యములు కలిగియుండిన కుటుంబములు దరిద్రము లయ్యెను. "కుశలులగు నేతగాండ్రతోడను, రంగు లద్దువారితోడను లక్ష్మి తొలగిపోయినది.* అని ఆర్. పి. మానానిగారు పై మాటల నుల్లేఖించి యున్నారు. ఉపధముగానే జంపఖానా నేత, తివాసీనేత, చెక్కడము, కాగితపు పరిశ్రమ, నగలు చేయుట, శిల్పము, భవననిర్మాణము మున్నగునవి కూడ క్షీణించినవి. ఈమునిసితికి విదేశపరిపాలన యనుగుదిబండ యెంత వరకు కారణమో, ఆంగ్లదేశమునందు తయారయిన వస్తువుల యొక్క పోటీ యెంతవరకు కారణమో యిప్పుడు విచారింప గడంగము. బ్రిటిషుపరిపాలనము వలన నేతగాండ్రును, ఇతర పనివాండ్రును నష్టపడినట్లు మరెవ్వరును నష్టపడి యుండలేదని సర్ జేమ్సు కెయిర్డుగారు వ్రాసిన వాక్యముల నుల్లేఖించిన జాలును.

వంగదేశమునందలి పట్టుపరిశ్రమ.

17 వ శతాబ్దమున మన దేశమునకు వచ్చి చూచిన బర్నియరుగారు ఆకాలమునందు వంగదేశములో నభివృద్ధి యందున్న పట్టుపరిశ్రమనుగూర్చి యిట్లు చెప్పుచున్నారు:— ప్రత్తితోను, పట్టుతోను చేయబడిన వస్తువులు వంగదేశము నందు అత్యంతసమృద్ధిగా నుండుటచే నాదేశము ఒక్క హిందూస్థానమునకు మాత్రమే గాక, ఒక్క మొగలు సామ్రాజ్యమునకు మాత్రమే గాక, పరిసర రాజ్యములకును ఐరోపాఖండమునకును నీ వస్తువులను సరఫరాచేయు భాండార మని చెప్పదగియున్నది. పట్టులవిషయమునను, పట్టుతో చేసిన వస్తువుల విషయమునను గూడ పై మాటలు వర్తించును. ప్రతిసంవత్సరము వంగదేశమునుండి పై కెగుమతియగు సర కెంత యని యూహింపను గూడ నలవిగాదు.

టెవర్నియరు ఇట్లు చెప్పుచున్నాడు:—

వంగదేశమునందలి గ్రామమగు కాసింబజారు ప్రతి సంవత్సరము 2 వేల బేళ్ళ పట్టును, విదేశముల కెగుమతి చేయుచున్నది. ప్రతి బేలు 100 పౌనుల యెత్తు.

జపానుదేశమునుండి యెగుమతియగు ప్రశస్త పట్టు పీతాంబరముల పోటీవలనను, కృత్రిమపట్టు దిగుమతి వల నను ఈ వ్యాపారమంతయు నాశమైనది. వ్యాపారము బాగుగా జరిగిన సంవత్సరమున 4 కోట్ల రూపాయల విలువ గల కృత్రిమ పట్టు అచ్చటికి దిగుమతియైనట్లు గ్రహింప

వగును. నే నీమాటలు వ్రాయు సమయమున 'మాల్టా పుర వాసి' అని సంతకముచేసి కలకత్తా దైనికపత్రికయం దొకరు ఈ విధముగా విలపించుట చూడగంటిని.

"ఈ రెండు సంవత్సరములనుండి మాల్టా ప్రజలు దుర్భరమగు ఆర్థిక దురవస్థ ననుభవించుచున్నారు. వంగదేశమునందు పేరుప్రోగిన మాల్టాపట్టుపరిశ్రమ నామమాత్రమైనది. పట్టుపురుగులకు ఆముదాలఆకులను సప్లయిచేయు భూములు భిగాకు వెయ్యిరూపాయల చొప్పున నమ్మివేయబడినవి. ఇప్పుడు ఆభూములనే 10 రూపాయలకు కొనుదిక్కులేదు."

'టోపాగ్రఫి ఆఫ్ డక్కా' యను గ్రంథములో టేలరు గారు డక్కామజిలీనులనుగూర్చియు, వీనివలన ఆ మహానగరము గాంచిన ఔన్నత్యమును గూర్చియు నిట్లు వ్రాయుచున్నారు:—

"నూలంతయు తీరిక సమయములయందు స్త్రీలచే తీయబడుచున్నది...అది పూర్వము జిల్లాలోని అన్నిరకముల ప్రజలకు, అన్నితరగతులవారికిని పని కల్పించుచుండెను. 1824 వ సంవత్సరమున ఆంగ్లనూలు మొదట దేశములోనికి దిగుమతి యైనప్పుడు దీనికి దెబ్బతగిలెను. 1828 వ సంవత్సరములో నీవృత్తి క్షీణదశలో నుండెను."

"నూలుతీయుపనియందు ప్రతికుటుంబమును పూర్వము నిమగ్నమై యుండెను. కాని ఆంగ్లనూలు చాల చౌక

యగుటచే నిప్పుడు రాట్నములపై నూలు తీయుట వారు మానుకొనిరి. అనాదినుండియు అసంఖ్యాకులగు పారిశ్రామికులకు పనికల్పించియుండిన రాట్నపరిశ్రమ, నేతపరిశ్రమ 60 సంవత్సరములలో తమ హస్తములనుండి జారిపోయినవి."

దీనికనేక కారణములు కలవు. ఇప్పుడు వానిని లెక్క-పెట్టుకొనుచుండుటవలన నేమి ప్రయోజనము? పరిశ్రమలయందు మనము చాలవెనుకబడి యున్నామనుట సత్యము. అకస్మాత్తుగా మనము ప్రపంచపోటీలో చిక్కుకొని ఊపిరి తిరుగకుండ నున్నాము. మనము మెల్లమెల్లగా అభివృద్ధియగుచుండగా ఇతరదేశములు చాలశీఘ్రముగా నభివృద్ధియై మనలను వెనుకకు త్రోసివేసినవి. మనబండ్లు, ఎడ్లు మున్నగు వాని స్థానే మోటారులు బస్సులు మున్నగునవి నెలకొనినవి. ఇందువలన వేలు లక్షల ప్రజలవృత్తి పోయినది. నూతన యంత్రముల నుపయోగించుట కూడదని నేను చెప్పుచున్నట్లు మీరు తలపవలదు. నిస్సహాయమగు మనదేశములోనికి వీని నన్నిటిని దిగుమతిచేసి మనద్రవ్యమును లాగుకొనుచున్నారు. మోటారు కారులను, బస్సులను, ఇతర వస్తువులను మనమే చేసినచో నిప్పుడు దేశాంతరమునకు బోవుద్రవ్య మిచ్చటనే యుండును గదా! మనవారికి అనేకపనులు కల్పింపబడును గదా! చక్కని దేశీయవస్తువులకు బదులు పనికిమాలిన విదేశీయవస్తువులు వ్యాపించుచున్నవి. ఈ దిగుమతుల వలన వడుకువారు, నేయువారు, కుమ్మరవాండ్రు, కమ్మరులు, వడ్రంగులు, వేయేల! అందరును పనిని గోల్పోయి

నష్టపడియున్నారు. ఇందువలన నందరు భూమిమీాద బ్రదుక వలసినవా రగుచున్నారు. భూమి యెంతరికని అన్నము పెట్ట గలదు? భారతదేశమంతటిలో ఐదవ భాగముపు ప్రజలకు తినుటకు సరిగా అన్నము లేదని 1880 లో సర్ విలియం హాంటరు గారు వ్రాసిరన్న నేమి ఆశ్చర్యము? ఇప్పుడు, ఈదుస్థితి హెచ్చుటచే దేశమునందలి మూడవవంతు ప్రజలకు అన్నము లేదని చెప్పుటలో నతిశయోక్తి యేమియు లేదు. భాగ్యవంత మగు వంగదేశమునందుగూడ సరిగా ప్రజలు అన్నము తినక విదేశములకు ధాన్యమును ఎగుమతి చేసికొనుచున్నారు. దేశ ములో నింత దుస్థితి ప్రబలియుండగా మన మూరకుండుటయా?

### జపాను సామ్యము.

భారతదేశపరిశ్రమలయెడల మన ప్రభుత్వమువారు ఉదాసీనభావము గలిగియుండగా జపానుజాతీయ ప్రభుత్వము వారు తమప్రజల కేమిచేసిరో చూతము. ప్రామాణికు లగు నిద్దరు గ్రంథకర్తల యభిప్రాయముల నిచ్చుట నుల్లే ఖించెదను.

'మాడరన్ జపాన్ అండ్ ఇట్సు ప్రాబ్లెమ్సు' అను గ్రంథమున అలెన్ గా రిట్లు వ్రాయుచున్నారు:—

"జపానుదేశమునందు నూతనపరిశ్రమల నేర్పరచినది ప్రభుత్వమువారే. ...స్వయముగా తాము డబ్బునివ్వజాలని వారికి కొంత ధనసహాయము చేసియు, పారిశ్రామికులకు రక్షణ నొసంగియు, బ్యాంకులనుండి ఋణముల నొసంగియు ప్రోత్సహించినది జపానుప్రభుత్వమువారే."

జపాను ప్రభుత్వమువారు 1870-1883 సంవత్సరముల మధ్య ఈ క్రొత్తపరిశ్రమల నేర్పరచి రని మనము మరువ రాదు. జపానుప్రజల కీ కాలములో వ్యవహారజ్ఞానము బాగుగా లేకయుండుటచే ప్రభుత్వమువారే స్వయముగా మిల్లులను, కార్ఖానాలను స్థాపించి సాగించిరి. ప్రజలకు సాంకేతిక విద్యయు, ఇతరవిధమైన జ్ఞానమును కలుగచేయుటకు జపాను ప్రభుత్వమువారు స్వయముగా కార్ఖానాలను సాగింప వలసివచ్చెను. రైళ్లు ప్రభుత్వమువారిక్రింద నుండెను. బొగ్గు గనులు, ఇతరగనులుకూడ వారిక్రిందనే యుండెను. నౌకలను గట్టు డొక్కు, బట్టల మిల్లులు, పట్టు మిల్లులు, ఉన్ని వస్తువుల, నేత, గాజు, కాగితపు మిల్లులుగూడ ప్రభుత్వమువారి అజమాయిషీ క్రిందనే నడుపబడుచుండెను.

'ఇండస్ట్రి అండ్ ట్రేడ్ ఆఫ్ జపాన్' అను గ్రంథములో ఉయహారా అనువారు ఈ క్రింది విధముగా వ్రాయుచున్నారు:—

1868-1893 సంవత్సరములమధ్య జపానుదేశమునందలి పరిశ్రమలు ప్రారంభదశలో నుండెనని చెప్పవచ్చును. 1883 వ సంవత్సరము చాయల కొంచెము అభివృద్ధి నొందియుండిన ఈపరిశ్రమలు ప్రజలపరము చేయబడెను. 1894 వ సంవత్సరములో జపాను-చీనా యుద్ధానంతరము జపాను పరిశ్రమలు విజృంభించెను.

## రాజకీయ స్వాతంత్ర్యముతో బాటు ఆర్థిక స్వాతంత్ర్య ముండవలెను.

తీవ్రమగు రాజ్యాంగ మార్పులు జరుగనున్న సమయమున దేశీయులు ఆర్థికవిషయములయందు శ్రద్ధ గైకొనుట యవసరము. రాజకీయ స్వాతంత్ర్యమునకు సైదోడుగ ఆర్థిక స్వాతంత్ర్యముకూడ మనకు లభింపవలెను. ఈ రెండును ఒకదానిపై నొకటి యాధారపడియున్నవి. ఈ కాలములో పారిశ్రామికాభివృద్ధి నొందిన దేశములే ఆర్థికదుస్థితియందు పడియుండగా బీదవారమగు మనము దానినుండి యెట్లు తప్పించుకొనగలము? మన ద్రవ్యము మనచేతులలో లేదు గనుకను, ఇతరులు ఖర్చుపెట్టు పద్ధతులను నియమించు చున్నారు గనుకను స్వాభావికముగా నీదురవస్థ యితర దేశములకంటె మన దేశములో హెచ్చుగా నుండును. బెంగాల్ దేశపువాడను గనుక అన్ని రాష్ట్రములయందలి స్థితిగతులను సంపూర్ణముగా నేను వివరింపజాలకున్నాను. వంగ దేశములో భూస్వాములు, రైతులు, వర్తకులు, వివిధవృత్తులయందలివారు, గ్రామమునందలి బ్యాంకులు, ఋణమిచ్చు కార్యాలయములు అన్నియు దివాలా యగుస్థితియం దున్నవి. ఇతర రాష్ట్రములలో నిట్లే ఇంతకంటె అధమముగా గూడ నున్నవేమో యని నేను తలంచుచున్నాను.

### ప్రదర్శనముల విలువ.

ఈ ప్రదర్శనమును జరుపుటయొక్క ఉద్దేశము పరిశ్రమలను వృద్ధిచేయుట యనియు, తద్వారా ప్రజల ఆర్థికస్థితిని

సౌభాగ్యమును వృద్ధిపరచుట యనియు నేను తలతును. ఇందుకు ప్రదర్శనములు ఉపయోగకారు లనియే నా నిశ్చితాభిప్రాయము. ఈ యుపయోగమున్నను దానిని గోరంతలు కొండంతలు చేయుచుండుట తటస్థించుచున్నది. దేశము నందలి ప్రతిభాగమునందును ఒకటిపై నొకటి, ఈ ప్రదర్శనములు జరుగుచున్నవి. కాని యివి దేశసౌభాగ్యమునకు సాధనములైన వని చెప్పజాలకున్నాము. ప్రదర్శనములు ఆర్థికాభివృద్ధికి ప్రయోజనకారులుగా నుండవలెనుగదా! ప్రదర్శింపబడిన వస్తువులు ప్రశస్తమగునవియే యైనను ముందు జరుగవలసిన యభివృద్ధి నవి స్పష్టము చేయుచున్నవి. వస్త్రములలో తప్ప తక్కిన వేనియందును హెచ్చు అభివృద్ధి లేకున్నదని చెప్పుటకు చింత పొడముచున్నది. మన జీవికకు అత్యవసరమైన వస్తువులకు మనము విదేశీయులపై నాధారపడవలసి వచ్చుచున్నది. మెకానికల్ ఎలెక్ట్రికల్ పరిశ్రమలు ఇంకను ప్రారంభదశలోనే యున్నవి. ప్రపంచ మతిశీఘ్రగమనమున ముందునకు బోవుచుండగా, మనము 50 సంవత్సరములకు పూర్వ మెచ్చట నుంటిమో యిప్పుడుగూడ నచ్చటనేయున్నాము. రాజకీయ స్వాతంత్ర్యము లేకపోవుటవలన మనకు ఆర్థికాభివృద్ధి లేకపోయె ననుమాట నిజమే యైనను, మనదశ కది యొక్కటే కారణము గాదు. కావున స్వదేశ ప్రదర్శనములు నాకు ఉత్సాహమును, దేశ సౌభాగ్యమునకు తోడ్పడునను ఆశలను కలుగజేయుచున్నవి.

## పాశ్చాత్యదేశములలోని పరిశ్రమలు.

నా దేశము వృద్ధి కాలేదను పరితాపము నాకు గలుగుచుండగా, ఉత్పత్తి వస్తువుల నుత్పత్తి చేయుటవలన ఐరోపా ఖండమునందును, అమెరికాఖండమునందును గలిగిన యనర్థములను గనుబింపకుండజాలను. వస్తువుల నుత్పత్తి చేయుట హెచ్చినకొలది ఆ దేశములయందు దారిద్ర్యము నిరుద్యోగముకూడ హెచ్చినవి. విద్యుచ్ఛక్తి పాశ్చాత్య దేశమునందలి పారిశ్రామికపద్ధతిని తీవ్రముగా మార్చివేసినది. పనివారిని తగ్గించినది. అమెరికా దేశములో యంత్రములు రాకముందు 210 లక్షల ప్రజలు చేయుచుండిన పని యంత్రముల మూలకముగా 40 లక్షల ప్రజలచే చేయబడుచున్నది. ఇతర దేశములలో గూడ నిట్టి స్థితియే యేర్పడినది. నిరుద్యోగమును వ్యాపారమాంద్యమును ఆర్థికదుస్థితి ఫలితములు. వస్తువులు సమృద్ధిగానే యున్నవి కాని దారిద్ర్యము హెచ్చినది.

అమెరికాలోని యవస్థ చూడదగియున్నది. ఆకాశము నంటుమేడలు, దివ్యభవనములు, సుందరమైన రోడ్లు, బారులు దీర్చిన మోటారులు, వానియందు విందుల కేగు సుందరులు నొక్కచో నుండగా వారికి కొలదిగజములదూరముననే అన్నా మో రామచంద్రాయనిఅల్లాడి, చేయిజాపు దరిద్రులు గలరు. నిలువ నీడలేక, స్త్రీలు, పురుషులు ఒకరిపై నొకరు కట్టకట్టుకొని యుండుటను మునిసిపాలిటీవారి వసతిగృహముల యందు గానవగును. మిక్కిలి ధనికులు దివ్యభవనములలో

నివసించుచుండగా హడ్సను నదిని దాటిపోవుతోవ యంతయు గుడిసెలతో నిండియున్నది.

పొలములు సమృద్ధిగా పండుచున్నవి; చూచుటకు పైరులు ఆనందదాయకముగా నున్నవి; కాని ప్రజలు తినుటకు తిండిలేక ఆత్మహత్య చేసికొనుచున్నట్లు పత్రికలలో గనబడును.

అమెరికా దక్షిణ భాగమునందు చూచినచో ప్రతి చోట అమ్ముడుపోని ప్రత్తియే. డిట్రాయిటులో గుడ్డలు లేని పిల్లల సంఖ్య 5000.

ఉత్పత్తి హెచ్చుచుండగా, ప్రజలకు తిండి యెట్లు లేకుండబోవుచున్నదో బెంగాలులోని అనుభవమువలన తెలియుచున్నది. వంగదేశములో బియ్యము మణుగు రు 1-4-0 చొప్పున అమ్ముచున్నది. కాని గ్రామాదులలో కాయకష్టముచేసి జీవించువారు దానిని కొనగలస్థితిలో లేరు. కావున కేవలము యంత్రమూలకముగా వస్తువుల నుత్పత్తిచేయు విధానమును జాగ్రత్తగా నవలంబింపవలె ననియు, గృహ పరిశ్రమలను మానరాదనియు నేను సలహానిచ్చుచున్నాము నూతన పారిశ్రామిక విధానమువలన గ్రామ జీవనము విచ్ఛిన్నమైనది. ప్రజల కనేకకష్టములు సంప్రాప్తము లైనవి. పాశ్చాత్యపద్ధతుల నవలంబించుటవలన మాత్రమే ప్రజల స్థితిని బాగుచేయ జాలమనుట నిశ్చయము.

మనదేశమునందలి ఆర్థికసమస్య అనేకకష్టములతో నిండియున్నది. రసాయనశాస్త్రము దెలిసిన నేను ఈ సమ

న్యను పరిష్కరింపజాలను. కాని ఒక్కమాట మాత్రము చెప్పుదును. మన ప్రదర్శనములు యంత్రములచే నుత్పత్తి చేయు పద్ధతులకు ప్రాముఖ్యము నొసంగుచు గృహపరిశ్రమలను మరువరాదు.

ఖద్దరు పరిశ్రమ.

మహాత్మునిచే ప్రారంభింపబడిన ఖద్దరుపరిశ్రమ విషయమై మీరు వినియేయున్నారు. నాశనమైన నూలు, నేతపరిశ్రమలను పునరుద్ధరించి గ్రామవాసులయొక్క ఆర్థికస్థితిని వృద్ధిచేయుటయే ఈ ఉద్యమముయొక్క ముఖ్యోద్దేశము. ఖద్దరు ఉద్యమము గృహపరిశ్రమలను వృద్ధి చేయుటకు చిహ్నము. వీనిని వృద్ధిచేయుటవలన కుటుంబజీవనము, గ్రామజీవనము విచ్ఛిన్నము కాకయుండును. మరియు మిల్లులవలన గలుగుచున్న యనర్థములు తొలగును. మన మందరము కోరదగినంతగా ఖద్దరుఉద్యమము అభివృద్ధి నొందకుండుట శోచనీయము. ఉద్యమము తగ్గిపోయిన దనిగూడ చెప్పవచ్చును.

పారిశ్రామికాభివృద్ధి విషయమై నేను చెప్పదగినదంతగా లేదు. పరిశ్రమలను స్థాపించి నిర్వహించుచున్న మహాశయు లావిషయమై నాకంటె బాగుగా నెరుగుదురు.

ప్రదర్శనములు జరుపు పద్ధతులు.

కాని ప్రదర్శనములు జరుపువిషయమై ఒక మాట చెప్పవలసియున్నది. ఇందువిషయమై మంచిపద్ధతు లవలంబింపబడుట యవసరము. ప్రస్తుత సమయమున నేమిజరుగుచున్నది? వివిధరాష్ట్రములవారు తమకిష్టము వచ్చినప్పుడు

ప్రదర్శనములు జరుపుచున్నారు. ఒక్క రాష్ట్రములోనే ఏక కాలమున ఒకటికంటె హెచ్చు ప్రదర్శనములు జరుగుచున్నవి. దూరప్రదేశములయందా రేడుచోట్ల ప్రదర్శనములకు తమవస్తువులను పారిశ్రామికులు పంపవలసివచ్చుచున్నది. ఇది వారికి చాలకష్టము. ఇందువలన ప్రదర్శనముల ప్రయోజనమే తగ్గిపోవుచున్నది. ఒక్క సూచన గావింతును. కాంగ్రెసు మహాసభవలె ప్రతిరాష్ట్రములోను ప్రతిసంవత్సరము ఒక అఖిలభారతప్రదర్శనము జరుపవలెను. ఇతరరాష్ట్రములన్నియు ఆ ప్రదర్శనము జయప్రదముచేయుటకు తోడ్పడవలెను. జాతీయమహాసభవలె నిదిగూడ దేశమున కంతటికిని యుండవలెను. అవసరమైనచో రాష్ట్రీయ ప్రదర్శనమును జిల్లాప్రదర్శనములు చేయనచ్చును. కాని ఒక్కటిమాత్రము భారతదేశమంతటికిని యుండవలెను. దానిని ప్రతిసంవత్సరము చేయవలెననిలేదు. మరియు దానిని కాంగ్రెస్సభకు అనుబంధముగా నుంచరాదు. ఎందుకనగా కాంగ్రెసుతో చేర్చితిమేని రాజకీయములలో నున్నశ్రద్ధ దీనిలో ప్రజలకుండదు.

రాష్ట్రములు పరస్పరము సహాయము చేసికొనవలెను.

మరియొకటి. ఆర్థిక విషయములలోను, పారిశ్రామిక విషయములలోను వివిధ రాష్ట్రములు పరస్పరము సహాయము చేసికొనవలెను. సామ్రాజ్యాభిమానము, ఒక దేశమునకు మఱియొక దేశమునకు ఒడంబడికలు - ఇత్యాదులు చేసికొనబడుచున్న ఈరోజులలో భారతదేశమునందలి వివిధరా

ష్ట్రములును పరస్పరము సహాయము చేసికొనవలెనని కోరుట యసమంజసమా? ఒక రాష్ట్రములో పండని ముడివస్తువులకును, పరిశ్రమలకును మరియొక రాష్ట్రమువారి కేల అభిమానము జూపరాదు? దేశమునందలి రాష్ట్రములలో నిట్టి పరస్పరాభిమాన ముండుట యావసరము. రాజకీయములలో ఫెడరేషను కావలెనని కోరుచున్నారు గదా! ఆర్థికవిషయములలోగూడ సక్లైల యుండరాదు?

ఈ ఫెడరేషను ప్రభుత్వమువారిచే నంగీకరింపబడినదై యుండనక్కరలేదు. కాంగ్రెసువలె నిది ఉపయోగకరముగా నుండగలదు. కాలక్రమేణ ఆర్థిక ఫెడరేషను యేర్పడగలదు. భారతదేశ మొక ఖండము. రాష్ట్రీయ స్వాతంత్ర్యము వచ్చునని యనుకొనుచున్నారు గనుక ఒక రాష్ట్రమునకు మరియొక రాష్ట్రమునకు సంబంధము కలుగజేయు అనధికార ప్రతిష్ఠాపనము దేశసౌభాగ్యమునకు సాధనముగా నుండగలదు. వివిధ రాష్ట్రములకు సంబంధము లేకపోవుటవలన నష్టము జరుగుచున్నట్లు ఉదాహరణము లెన్నియేని నేను చూపగలను. ఆర్యులారా, నేను రాజనీతివిశారదుడనుగాను, ఆర్థిక శాస్త్రవేత్తనుగాను. అనుభవమువలన కొన్ని యభిప్రాయములు నాకు కలిగినవి. రాజనీతి, ఆర్థికశాస్త్రమునుబట్టి పరీక్షించినచో నవి సరిగా నుండకపోవచ్చును. నాయభిప్రాయములను సర్వతోముఖముగా విచారించుపని మన నాయకులకు వదలుచున్నాను.

రాష్ట్రీయ స్వపరిపాలనమువలన లాభము బదులు నష్టము కలదేమో యని భయము కలుగుచున్నది. దీనివలన ఒక రాష్ట్రమునకు మరియొక రాష్ట్రమునకు స్పర్థ కలుగుచో భారతజాతీయవాదులకు నష్టమును, విదేశీయులకు లాభమును కలుగుట సత్యము. ప్రతిరాష్ట్రము తన ప్రజలకు మొదట సహాయము చేసికొనుచు, తనకు నష్టము లేకుండ నితరరాష్ట్రములకు సహాయము చేయవలెను. ఈ కారణమువలన దేశమున కంతటికి ఒక ప్రదర్శన ముండవలెననియు, రాష్ట్రములు పరస్పరము సహాయము చేసికొనవలెననియు చెప్పుచుంటిని.

## భో గ వ స్తు వు లు న ని కి రా వు .

అత్యవసరముగా కావలసిన వస్తువులను సంగ్రహింపకుండ భోగసాధనములగు వస్తువులను కొను అనర్థదాయకమగు పద్ధతిని నేను ఖండింపవలసియున్నది. అమెరికాలోను, ఆంగ్లదేశములోను నిట్టిభోగవస్తువులను కొనుట యుద్ధానంతరము అమితముగా ప్రబలినది. 20 సంవత్సరములకు పూర్వము లేని అనేకక్రొత్తవస్తువు లవసరమైనస్థితి యేర్పడినది. మోటార్లు, గ్రామఫోన్లు, రేడియోలు, ఎలక్ట్రికల్ సామానులు, టెలిఫోనులు, సినిమటోగ్రాఫులు, కెమేరాలు - ఇత్యాది వస్తువులపైన ధనము వెచ్చింపబడు చున్నది. ప్రజాప్రతినిధి ప్రభుత్వము వ్యాపించుటవలన ప్రజల నియమములు పోయి యెల్లరు భోగవస్తువుల నుపయోగించు భావ మేర్పడినది. ఆసియాఖండమును, ఆఫ్రికాఖండమును అమెరికా, ఇంగ్లాండు దేశముల ననుకరించుచున్నవి. అమెరికావారు ఎగుమతి

చేయు వస్తువులలో మోటారుకార్లు, సినిమా ఫిల్ములు, ఎలక్ట్రికల్ సామానులు, రేడియోలు, టైప్‌రైటర్లు, కార్యాలయమునకు కావలసిన సామానులు, కూడికలుచేయు యంత్రములు, కుట్టుయంత్రములు, పాత్రసామగ్రి, వ్యవసాయమునకై పనిముట్లు, రోడ్లుచేయుయంత్రములు, - ఇత్యాదులు కలవు......ఎక్కువకాలము మన కుండు వస్తువులు నాగరకతా చిహ్నములు గదా!

దురదృష్టవశమున నిట్టి వస్తువులపై ధనము ఖర్చుపెట్టుటకు మనవారుగూడ ఆరంభించినారు.

ఒకానొకప్పుడు ఈనగరములో కర్జన్ ప్రభువు స్వదేశీ సంస్థానాధిపతుల నిందులకై యాక్షేపించిన సంగతి మీలో కొందరికి తెలిసియుండును. తమదేశములో చేయబడిన తివాసీలు, దుప్పట్లు, జముకాణములు అభిమానములేక, సహాయము లేక రక్షణలేక నాశనమగుచుండగా లండనునందలి టాటెన్ హాం కోర్టురోడ్డునుండి వానిని తెప్పించుట కాయన చీవాట్లు పెట్టెను. నాగరకులగు మనవారు విదేశీయవస్తువులమీద నభిమానము పెట్టుకొనుట యనర్థదాయకమని యిటీవలనేగదా డా॥ నయ్యాదు రాప్‌మసూద్‌గారు సూచించిరి. "జపానులో తయారుచేయబడుచున్న సుందరవస్తువు లన్నియు భారతదేశమునందు తయారగుచున్నవి. కాని జపానులో సుందర వస్తు నిర్మాతలు గౌరవింపబడుచుండగా, తమ దేశప్రతిష్ఠను కాపాడి వృద్ధిచేయగలవారని ప్రశంసింపబడుచుండగా మన దేశమునం దట్టి యభిమానము, ప్రశంస లేకయున్నది. మన

గృహముల నలంకరించుకొనుటకు స్వదేశీ వస్తువుల నుపయో గింపక విదేశములలో తయారయిన చౌకపదార్థములను, అనాకారపు అసహ్యపదార్థములను మనము వాడుచున్నాము. ఇంత సుందరవస్తువులును, చాలకాలము మనువస్తువులును తయారుచేసి, దేశమునకు కీర్తిప్రతిష్ఠలు చేకూర్చినవారితో కలిసి మెలసి తిరుగుటకును, తగుదుమయ్యా యని వారితో పాటు కూర్చుండుటకును వీరు సిగ్గుకూడ పడుటలేదు.

ముగింపు.

స్వదేశీయ భావములు ప్రపంచమునందలి ప్రతిదేశము లోను వేరులు సాచియున్నవి. ఆంగ్లదేశములోని స్థితి విచా రింపుడు. రారాజునుండి అధముని వరకు 'బై బ్రిటిష్' అను నది సామాన్యమైనది. ప్రతి దేశములోను 'స్వదేశీ వస్తువులను కొనుడు' అను వాక్యము భూనభోంతరాళములు నిండియున్నది. ఒక్క భారతదేశము మాత్రము వెనుకబడి యుండదగునా? అలసత్వమును, సోమరితనమును, మాంద్యమును త్యజించి నా సహోదరులు, నా దేశవాసులు కార్యశూరులు కాగల రని ప్రార్థించు చున్నాను. ప్రపంచము ద్రుతగమనముగ ముందుకు నడుచుచున్నది. సోమరులముగా నుండి విదేశము లలో జరుగుచున్న వ్యవహారములను గోళ్లు గిల్లుకొనుచు జూచు చుండగలమా? ఈ ప్రదర్శనము జరుపుటకు కారణభూతము లైన భావములు ఇంకను గొప్ప ప్రదర్శనముల జరుపుటకు తోడ్పడి దేశసౌభాగ్యమును, కోట్లకొలదియగు మన దేశీ

యుల సుఖమును, సంతృప్తిని వృద్ధిజేయుటకు సహాయముగా నుండుగాక యని కోరుచున్నాను.*

భారతదేశ పరిశ్రమల నుద్ధరించుట కొరకు ఆచార్య రాయిగారు సూచించిన పద్ధతులను పూన సహకారసంస్థలు చక్కగా నిర్వహించి భారతదేశ సౌభాగ్యమునకు తోడ్పడ వచ్చును.

* ఆంధ్రపత్రిక: 1-3-33.